# విషయసూచిక



# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>30-4-61<br>వైశాఖ పూర్ణిమ | సంచిక ౧ |
| --- | --- | --- |


## స్వవిషయము

అఖిలాంధ్ర శైవ మతస్థులకు మన ఈ శైవమత ప్రకాశిక ఏకైక మత పత్రికయై యున్నది. చమురు తక్కువ దీపమువలె కొంతకాలము మినుకు మినుకుమని వెలిగి కొంతకాలము క్రిందట కొండ ఎక్కినది. ఆ వెలిగినంతకాలమైనను పీఠాధ్యక్షులయు, కార్యదర్శులయు, కొందరు పీఠసంఘ సభ్యులయు నుద్దీపన కారణముననే వెలిగినది. నామమాత్రమైన శైవమతప్రకాశికకు శైవపీఠమువారు పునరుజ్జీవన మొనర్చుటకు మరల పూనుకొనుట శ్లాఘ్యము. భరతఖండములో నొకప్పుడు ఆసేతుశీతనగ పర్యంతము ప్రధాన మతమై తేజోలింగ, వాయులింగ, జ్యోతిర్లింగాది భేదములతో అసంఖ్యాక దివ్యక్షేత్ర ప్రతిష్ఠల నొంది, ఆదిభారతీయమతముగా నుండిన శైవమతము అట్టడుగున బడిపోయినది. భారతీయులలో మన యాంధ్రులు మూడు కోట్లు మాత్రమున్నారు. అందులో శైవమతస్థుల సంఖ్య వేళ్ళపై లెక్కింపదగిన వేల సంఖ్యలో నుండిన నుండవచ్చును. ఆ కొలదిమందిలో శైవమతాభిమానులెంతో తక్కువగా నున్నారు. మతాభిమానులు అత్యల్పసంఖ్యాకులు గావుననే ఈ చిన్న మాసపత్రికకుకూడా విచ్ఛిన్నావస్థ కలిగినది. మతము పేరుతో బాహ్యావర్తనము ననుసరించుట మతాభిమానము కాదు. మత సిద్ధాంతములను గూర్చి వాదోపవాదములకు నడుము

కట్టుట మతాభిమానము కాదు. మతాచారముల కొరకు దేహమన స్ఫక్తులను ధారపోయుట మతాభిమానము కాదు. అవి యన్నియు విశ్వాసముతో కూడినవి. స్వయం తీర్థత కొరకు, పారలౌకిక సిద్ధుల కొరకు ఏర్పడిన దీక్షావిధులు. మతాభిమానము తన యొక్కని నమ్మికతోడను తన యొక్కని యాచరణతోడను, తన యొక్కని జీవన్ముక్తావస్థతోడను దృష్టిపడు స్థితికాదు. అభిమాన మనిన నైక్యభావము. అవినాభావ సంబంధము. దాని సుఖివృద్ధి తనది. దాని క్షీణత తనకు క్షీణత. దానిని విడచిన తనది మరేమియు నుండదు. అది పోయిననాడు తానుండడు. అట్టి సుబిమానుల చేతిలో నేమహాత్కార్యమైనను ఫలసిద్ధి నొందును. మతస్థాపకులలోను, దేశభక్తులలోను అట్టివారే మూల పురుషులుగా నున్నారు. నేడు శైవమతము అల్పమా, విస్తృతమా, సంఘీయులు ధనికులా, పేదలా? విద్వాంసులా, కారా? అను ప్రశ్న ముఖ్యముకాదు. కొలది మందియైనను సామాన్యులైనను తమ యుద్యమముపట్ల అభిమానము కలిగియున్నారా లేదా అనునది ముఖ్యవిషయము. అట్టి అభిమానులు పూనిన కార్యము క్షీణించదు. నేడు ప్రపంచమున నుద్యమము లన్నింటికిని ప్రబోధ ప్రచారములను చేయుటకు పత్రికలు ముఖ్యాధారములుగా నున్నవి. ఉద్యమాశయములను, దాని నియమములను, ప్రణాళికలను, ప్రతి దినకార్యక్రమములను నిరంతరము ప్రజల ఎదుట బెట్టి కనులకు కట్టినట్లు, కరతలామలకములవలె చూపించుటకు పత్రికలే యాధారము. అట్టిచో శైవమత ప్రబోధమునకు, విజ్ఞానాభివృద్ధికి మూలాధారమయిన ఈ మాసపత్రిక ఎంతయో ముఖ్యము. అయితే పత్రికా నిర్వహణము వ్యయప్రయాసలకు కారణమనియు, మూలధనము, కార్యకర్తలు నేర్పడనిచో పత్రిక నడవదనియు నెల్లరు చెప్పుదురు. పత్రికలు ప్రజల యాదరణముపై నాధారపడియుండును గదా! ప్రజల యాదరణ పత్రికల స్వభావమునుబట్టియే యుండును కాబట్టి ప్రజాదరణపూర్వకమైనట్టి స్వధర్మ నిర్వహణము పత్రికలకు కర్తవ్యము. కావున శైవ పీఠమువారు నేడు పూనుకొనిన ప్రణాళిక ననుసరించి పత్రికను ఆకర్షణీయముగను, అనుసరణీయముగను నడిపించినచో ఆంధ్రులలో శైవులకేకాక స్మార్తులు మొదలగువారికిని యుపాదేయముగా నుండగలదు. పత్రికా వ్యాసంగమునుబట్టి పాఠకులకు దాని

యందు గౌరవాదరములు గల్గును. సక్రమముగా పత్రిక పనిచేసిన నాడు స్వయంపోషక శక్తి పత్రిక కేర్పడగలదు. సర్వమతసామరస్యం. సర్వపక్ష సమన్వయం, సకలప్రజా శ్రేయస్సునను నియమములు కలిగిన ఎట్టి యుద్యమమును విఫలము కాబోదు. కావున పునరుద్ధృతమైన ఈ శైవమత ప్రకాశికకు విద్వాంసులు జ్ఞానదానమువల్లను, వితరణశీలురు ధనదానములవల్లను చేయూత నొసంగి యుత్తమ పత్రికగా పేరు పొంద చేయుదురనియు, శైవమహాశయులు తప్పక చందాదారులుగా చేరి పత్రికను దినదినాభివృద్ధి నొందించి, దాని ముఖమున ధర్మప్రబోధమును గాంతురనియు నమ్మి, తత్ఫలసిద్ధి కీశ్వరుని వేడుకొనుచున్నాను.



# శైవమత ప్రాచీనత - లింగధారణ ఆవశ్యకత

శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రి

శ్లో॥ గంగానిర్ఝరిణీం బిభర్తి శిరసా యో లీలయాక్ష్వేందువత్
యేనోర స్యుపవీతితో బహుఫణ శ్శేషాహిచూడామణిః
యస్మై శ్రీదయిత శ్చకార కమలై ర్నేత్రేణ చార్చాం స్వయం
సస్నోమార్ధ పరిష్కృతోవతు శివ శ్శ్రీ శైవపీఠం సదా॥

శ్లో॥ శివం శివాం శక్తిధరం గణేశం । నందీశ్వరం కుంభజవామదేవౌ
శ్వేతాశ్వమౌనిప్రవరంచ శ్వేతం । శ్రీ నీలకంఠం శిరసా నమామి॥

శ్లో॥ సదాశివసమారంభాం । శ్రీకంఠారాధ్యమధ్యమాం
అస్మదాచార్య పర్యంతాం । వందే గురుపరంపరాం॥

పరమ పురాతనమైన ఈ శైవమతము శివునిచేతను, శివదేవిచేతను నాదరింపబడి, వీరభద్ర కుమార గణపతి నందికేశ్వరాదులచే సేవింపబడినది. శ్రీ మహావిష్ణువు శివుని పూజించి, కాశియందు జక్రపుష్కరిణిం ద్రవ్వి శివానుగ్రహంబుచే మణికర్ణికఁ గావించి యందుఁ బూజించుచుండుటయు, సహస్ర కమల నేత్రకమలములచే శివలింగమును బూజించి తత్ప్రసాదంబున సర్వ రాక్షస శిక్షాకరంబైన చక్రము నొందుటయు ననేక విధంబుల విధేయుడై శివుని గొలుచుటయును సర్వపురాణేతిహాసంబు లుపదేశించుచున్నవి. అద్వైతాచార్యులగు శ్రీ శ్రీ శంకరాచార్య భగవత్పాదులవారు శివానందలహరీ స్తవంబు నందు-

శ్లో॥ బాణత్వం వృషభత్వ మర్ధవపుషా భార్యాత్వ మార్యాపతే
ఘోణిత్వం సఖితా మృదంగధరతా చేత్యాది రూపం దధౌ
త్వత్పాదే నయనార్పణంచ కృతవాన్ త్వద్దేహభాగో హరిః
పూజ్యాత్పూజ్యతర స్స ఏవ హి నచే త్కోవా తదన్యోధికః॥

శ్లో॥ భూదారతాముదవహద్యదపేక్షయా శ్రీ
భూదార ఏవకి మత స్సుమతే లభస్వ
కేదార మాకలితముక్తి మహౌషధీనాం
పాదారవింద భజనం పరమేశ్వరస్య॥

అని విష్ణుమూర్తియొక్క శివభక్తిని, శివోపాసనను బుజువుచేసినాఁడు.

శ్రీవిష్ణ్వవతారములలో మిక్కిలి గణనీయంబు లగు శ్రీరామ కృష్ణావతారములలో శ్రీ రామచంద్రు డగస్త్యునిచే శివదీక్షనొంది విభూతి రుద్రాక్షలను ధరించి, శివలింగ పూజ నొనర్చి శివానుగ్రహంబుచే రావణ సంహారంబు చేసి సీతాదేవిని తెచ్చుకొనుటయు సేతువునందు శివలింగ ప్రతిష్ఠ నొనర్చి యర్చించుటయు శివగీతా శ్రీరామాయణంబులందు విశదము జగ ద్విదితము శ్రీకృష్ణమూర్తి పుత్రార్థియై కైలాసయాత్ర నొనర్చి శివుని బూజించి, రుక్మిణీదేవియందు బుత్రుని బ్రద్యుమ్నుని బడయుటయు తదుత్తర కాలంబున జాంబవతీ ప్రేరితుఁడై హిమగిరి కేగి, యందుపమన్యుమునిచే శివ దీక్షనొంది శివుని బూజించి జాంబవతియందుఁ గుమారుని సాంబుని గనుటయు పంచమ వేదంబగు భారత సంహితయందు ప్రతిపాదితము. మహర్షులగు వామ దేవాగస్త్య గౌతమాత్రి శిలాద విశ్వామిత్రాదుల పాశుపత వ్రతములు ప్రసిద్ధములు.

ఈ కలియుగమందు శివుడు శ్రీ నీలకంఠ శివాచార్యుండై జన్మించి వైయాసిక సూత్రంబుల కయథార్థంబుఁ దొలగించి యథార్థ ప్రతిపాదనముతో శైవమహాభాష్యంబును నిర్మించినారు. శ్రీనీలకంఠాచార్యుని శివావతారంబుగ క్రియాసారకర్తలు "నీలకంఠ శివాచార్యనామా భాష్యమచీ కరత్" యని నిరూపించినారు. నీలకంఠ భాష్యారంభమందు

శ్లో॥ వ్యాససూత్ర మిదం నేత్రం । విదుషాం బ్రహ్మదర్శనే
పూర్వైః కలుషితం నీల । కంఠే నాద్య ప్రసాద్యతే॥
నీలకంఠో వివృణుతే । శ్రీకంఠోపసమాహ్వయః
బోధానయోక్తి మాలంబ్య । బ్రహ్మసూత్రం యథామతి॥
సర్వ వేదాంత సారస్య సారభాస్వాద మోదినాం
ఆర్యాణాం శివనిష్ఠానాం భాష్య మే తన్మహానిధిః॥

అని భాష్యరచన ముపక్రమించినారు. బ్రహ్మ విద్యాధ్వ ర్యప్పయ దీక్షితాదు లీ భాష్యము నామోదించి వ్యాఖ్యల నొనర్చినారు. శ్రీ శంకరా చార్యుల వా రనేక స్తవములందు శివప్రాముఖ్యంబు దెల్పుటయేకాక తమ నిత్యార్చనమందుఁ బ్రధానంబుగ శ్రీ చంద్రమౌళీశ్వర లింగమును శ్రీచక్రము నునిచికొని పూజించినారు. ఇప్పటివరకుగూడ తత్పీఠంబు లందిట్లే యర్చ నంబు జరుగుచుండుట సుప్రసిద్ధము. హరదత్త శివాచార్యులు చోళరాజ సభ యందు బ్రతివాదుల గెలిచి నిదర్శనంబునకై తప్తలోహనిశ్రేణినెక్కి శివ

పారమ్యంబుఁ బ్రకటించిఁ చోళరాజునకు లింగదీక్ష నిచ్చి దిగ్విజయం బొనర్చి చతుర్వేద తాత్పర్యం బనుసంధించి శైవమతంబు నభివృద్ధి చేసినారు. వేద భాష్యమును మున్ముందు రచించిన భట్ట భాస్కర శివాచార్యులవారు శ్లో॥ మహాదేవో దేవ స్సకల జగదారాధ్య చరణ స్త్రయీమార్గో మార్గః" యని బోధించి శైవమతంబును వృద్ధిచేసినారు. ఇట్లే శైవ ద్వాదశాచార్యులలో సుప్రసిద్ధులగు నుద్భటారాధ్యులవారు కాశ్మీరము మొదలు సర్వభారతదేశము లం దాచార్యులై ముంజభోజుడు మున్నగు రాజవతంసులకు శివలింగ ధారణం బొనర్చి శైవమతంబును నాల్గు దెసల వ్యాపింపజేసి తాము శివ లింగముతో శివుని జేరుచు స్వదేహాగ్ని ధూమమాత్రమున భూతంబులై యున్న గంధర్వులకు శాపమోక్షంబు గావించిరి. ఇట్లు వారిని గూర్చిన స్తవమందీ శ్లోకము —

శ్లో॥ గంధర్వ భూత శత సప్తక శాప మోక్ష
దాన ప్రభావ జగదద్భుత కీర్తి భాజం
విశ్వేశలింగ నిజగర్భజనిం మహాంతం
వందే హ మీశనిభ ముద్భట దేశికేంద్రం॥

అని చెప్పుచున్నది. ఇక సాధారణముగా ఎట్టివారినిగూడ మెచ్చ నట్టి ధీరుఁడు శ్రీ రామలింగకవి ఈ యుద్భటారాధ్య గురునియందు భక్తి పారవశ్యంబు నొంది ఉద్భటారాధ్య చరిత్రంబును విరచించి తన్మహిమంబును బ్రకటించినాఁడు.

శ్రీ మల్లికార్జున పండితారాధ్యులవారు మన ఈ శైవమతంబు నితర సమూహంబులోఁ బడి పోనీక వర్ణాశ్రమ ధర్మసహిత శైవమతోద్ధారకు లైనట్లు సుప్రసిద్ధము. వీరి తపస్సామర్థ్యాతిశయంబులను శివపూజాపరాయణ త్వమును గూర్చి శ్రీనాథ మహాకవిసార్వభౌములును, పాలకుర్తి సోమనాథ కవివర్యులును శ్రీ పండితారాధ్య చరిత్ర కావ్యమును రచించి యవబోధము చేసినారు. ఇట్లే ద్వాదశాచార్యులనఁబడు శైవాచార్యు లందరును ఏకవింశ న్మహాదీక్షోపలక్షిత శివలింగ దీక్షా ప్రారంభ చాక్షుషీ నిరీక్షిత సర్వాంతేవ సన్మానసాజ్ఞాన హిమానీ దూరీకరణ భానుమూర్తులు. వేయియేల- శివ ప్రతిములు తమ యసాధారణ శక్తి మహిమంబుల నపారకీర్తి గడించి, శైవ మతంబును జగజ్జేగీయమానంబు నొనర్చి జగద్గురు పట్టాభిషిక్తులైరి. విశ్వా రాధ్య గురుల వంశపరంపరలయందలి ఇవటూరివారు కృష్ణాతీర పరిసర గ్రామక్షేత్రంబందు పైడిమొక్కల నుద్భవింపఁజేసి యా గ్రామమును, మరి కొన్ని గ్రామములను రాజులచే నగ్రహారంబు లొందినారు. ఉద్భటారాధ్య

గురువంశ్యులగు ముదిగొండవారు గుంటూరు మండలిలోని మాదల, రెంటపాళ్ళ, ధవళపురి మున్నగు గ్రామంబులను, శ్రీ మల్లికార్జున పండితారాధ్య గురు వంశ్యులు గుడిపాడు మున్నగు గ్రామములను, మంచన పండితారాధ్య వంశ్యులు పెసరమిల్లి గ్రామంబును, శ్రీపతి పండితారాధ్య గురుపరంపరలోని వారగు కాశీనాథునివా రెలకుర్తి గ్రామంబును ప్రభులచే నగ్రహారంబులొంది నారు. నేటివరకా యగ్రహారంబు లా గురుల సుప్రతిష్ఠలకు నిదర్శనంబులు.

ఏక కవి కుల గురువులగు శ్రీ కాళిదాస మహాకవులు కావ్యారంభ మందు "వాగర్థావివ సంపృక్తౌ" అని మొదలుచేసి

శ్లో॥ అణిమాదిగుణోపేతం అస్పృష్ట పురుషాంతరం
శబ్దమీశ్వర ఇత్యుచ్చైస్సార్ధం చంద్రం బిభర్తి యః

యని కుమారసంభవమందు నుడివి, మేఘ సందేశమం దుజ్జయినీ మహాకాళేశ్వరుని బలువిధంబుల నుపస్థానముచేసి కైలాసయాత్ర జేసి శివుని సేవించినారు.

శ్లో॥ యాసృష్టి స్స్రష్టు రాద్యా వహతి విధిహుతం యాహవి ర్యా చ హోత్రీ
యే ద్వే కాలం విధత్త శ్శ్రుతివిషయగుణా యా స్థితా వ్యాప్యవిశ్వం
యా మాహు స్సర్వభూతప్రకృతి రితి యయా ప్రాణినః ప్రాణవంతః
ప్రత్యక్షాభి ప్రపన్న స్తనుభి రవతు వ స్తాభి రష్టాభి రీశః.

అని అభిజ్ఞాన శాకుంతల మందును, ...

శ్లో॥ ఏకైశ్వర్యే స్థితోపి ప్రణతబహుఫలో య స్స్వయం కృత్తివాసాః
కాంతాసమ్మిశ్రదేహో ప్యవిషయమనసాం యః పురస్తా ద్యతీనాం
అష్టాభి ర్యస్యకృత్స్నం జగ దపి తనుభి ర్బిభ్రతో నాభిమానః
సన్మార్గాలోకనాయ వ్యపనయతు స వ స్తామసీం వృత్తి మీశః॥

అని మాళవికాగ్నిమిత్ర మందునను—

శ్లో॥ వేదాంతేషు య మాహు రేక పురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మి న్నీశ్వర ఇ త్యనన్య విషయ శ్శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభి ర్నియమిత ప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణు స్స్థిరభక్తియోగ సులభో నిశ్శ్రేయసా యాస్తు వః॥

అని విక్రమోర్వశీయమందును శివైకపారమ్యమును దెల్పి తమ శివభక్తిని శాశ్వత ప్రకాశితమును జేసినాడు. ఇట్లే శివభక్తులగు మహర్షులయొక్కయు

మహారాజులయొక్కయుఁ బండితులయొక్కయు స్వరూప చరితంబులను జెప్పుటకుఁ బెక్కేండ్లు గూడ జాలవు.

ఇఁక మన మతమం దువాదేయ ముఖ్య ధర్మములు శివలింగధారణ పూజనములు, విభూతి రుద్రాక్ష ధృతియు శ్రీ పంచాక్షరీ మహామంత్రజపము మున్నగునవియై యున్నవి.

అందు శివలింగధారణమందలి ప్రయోజనమును గురించి కొందరకు సందియము, జిజ్ఞాసయు నుండవచ్చును. అద్దాని గూర్చి ఇంచుక నుడివెదను. మనకు సర్వమందుఁ బ్రవృత్తి నివృత్తి ప్రతిపాదకమైన యామ్నాయమందును స్మృత్యాగమ పురాణంబులందును శివలింగధారణ ముపదేశింపబడినది. అది యట్లుండఁగా లోకములో సామాన్యముగా దేవసేవలయందు రథోత్సవాదులందు దేవుని మోసిన మహాసుకృతంబని యొక్కింతసేపేనిఁ బండితులును మహారాజులును దేవులను దేవాధిష్ఠిత రథంబులను వహించుచున్నారు. నిరతము శివలింగమును వహించుట యందలి గుణమును చూడుఁడు. బ్రాహ్మణ సామాన్య భోజన సమావేశములందు నెవరేనొకరు దేవతార్చన సంపుటిని దెచ్చి పూజింపుచుండిన ఆ సన్నిధికి బలువురు జేరి తీర్థప్రసాదంబుల నొందుటయు మనము చూచుచునే యున్నాము. నవరత్నములు బంగారము మహౌషధీ మూలికలను సంతతము దేహమందు ధరించినయెడల దేహమున కారోగ్యమనియు, కాంతికరంబును రోగహరంబనియు వైద్యశాస్త్రమందుఁ జెప్పబడినది. ఇందు సతతము స్ఫాటిక శివలింగధారణ మెంత శ్రేయస్కరమో యూహింపుడు. కీటము భృంగ సాంగత్యముతో భృంగమగునట్లు సంతత లింగధారణముతో తన్నికేతన పూజాదికములతో శివత్వము సాధితమగునని పూర్వులు లింగధారణము నుపదేశించియున్నారు. ఇఁక విభూతి గంధాక్షత పుష్ప బిల్వదళాది పూజనముతో నేత్రములు, నాసిక, హస్తము, ఉరము మున్నగునవి పవిత్రము లగుటయేకాకే శుద్ధములై సుగంధమ్ములై ఆరోగ్యసుఖకరములగును. ఇంతియెకాక

శ్లో॥ అస్నాతాశీ ర్విషం భుంక్తే : అజపః పూయశోణితం
అనైవేద్యంతు యో భుంక్తే । విషం ప్రాశ్నాతి సద్విజః॥

యనెడు ఆత్రేయ స్మృతిచేత, అనివేదిత పదార్థ స్వీకారము మహాపాపంబని తేటబడినది. లింగధారి యరణ్యములో నున్నను, సముద్రమధ్య మందున్నను లింగ నివేదనము చేసి ప్రసాదము ననుభవించును. తదితరులకది దుర్లభము. శివలింగధారణము తర్వాత విభూతి రుద్రాక్షల గురించి యుపనిషత్తులు

ప్రకాశింపించినవి. విభూతి స్పర్శమాత్రంబున సర్వక్రిములును సర్వదుష్టగ్రహములును హరింపబడుట ప్రత్యక్షము. రుద్రాక్షము మహాత్మ్యాదికి ఫలము. దీని మాహాత్మ్యమును వర్ణింపఁజాలము. రుద్రాక్షచయంబు అనవరతము ధరించిన శివ్వుఁడును మహర్షిపద్యుతే నాకులు. ఈయది ధారణముచేతనె సర్వరోగ హరము. సన్నిపాతరోగమం దేతత్సారసేవనంబునను గండమాలాదికములచేతను సంప్రదేశ హరింపఁబడును. ఇఁక శివమంత్రము — ప్రణవాదినమోంతమగు శ్రీ శివపర్ణ ప్పయము యజుర్వేదమున నంతకు శిరోభూషణంబని మహా పండితవర్యు లుద్ఘోషించినారు. ఈ మంత్రము ప్రస్తారక్రమముతో అష్టోత్తరశత ప్రకారమై యుపాసకులకు సర్వసిద్ధుల నొసఁగుచున్నది. ఉచ్చారణ మాత్రంబునను జప పురశ్చరణ హవనంబులచేతను సకలాభీష్టంబుల నిచ్చుచున్నది. ఇందులకు శివపురాణమం దొకపద్యము—

సీ॥ బాలేందుమౌళి రూపముఁ జూపు దర్పణం బరయఁగా శైవ పంచాక్షరంబు
బ్రహ్మహత్యాదిక పాపాటవి దావమరయఁగా శైవ పంచాక్షరంబు
కైవల్యపుం జెలి కలదివియకు సౌక యరయఁగా శైవ పంచాక్షరంబు
ఎల్ల కోర్కులనురంజిల్ల దీర్చెడుకల్ప మరయఁగా శైవపంచాక్షరంబు

తే॥ అమరగేయము శైవ పంచాక్షరంబు ఆగమ ధనంబు శైవ పంచాక్షరంబు
అఖల సుఖదము శైవ పంచాక్షరంబు హర్ష నిలయంబు శైవపంచాక్షరంబు.

పూర్వోక్తరీతి మన యాచార్యులు పూర్వు లందరును శివాంశ సంభూతులై మహా తపస్సంపన్నులై శైవమత ధర్మంబుల దా మాచరించుటయే కాక భారతదేశమం దనేకులచే నాచరింపజేసి, శైవమతంబును వృద్ధిచేసి యుండుట సర్వజన విదితమే. అవ్వారల యసమాన మహిమాతిశయంబుచేతనే మన మందరము నేటికిని తద్వంశ్యులమనియు తత్సాంప్రదాయకులమనియుఁ జెప్పుకొనఁ గల్గుచున్నాము. ఐనను అమ్మహామహుల యన్వయంబులందు జన్మించియు సంప్రదాయగాములమయ్యును వారుపదేశించిన ధర్మంబుల నెంతవరకు నెరవేర్చుచున్నామో, విశ్వశ్రేయంబుఁ గోరి ఎంతవరకుఁ బ్రబోధము చేయుచున్నామో, వారి కీర్తి చంద్రికల కేలాటి యాచ్ఛాదనము కలుగకుండు నట్లుగా అన్యపథంబులం దడుగు బెట్టక స్వధర్మాచరణమం దెంతవరకుఁ గృషి చేయుచున్నామో ఏకాగ్రచిత్తులమై తలపోసి, పూర్వుల ధర్మంబుల నడచుచు లోకమునుగూడ నట్లు నడుపింపఁజేయుచు శైవమహాపీఠ సమ కున్నతిని గూర్చుచు మహేశ్వర మాహేశ్వర ప్రసాదంబుల పొందవలయునని శైవ మహాజనులకు నా మనవి మరొక్కమాట. ఆవశ్యకాచరణీయంబులను నాకు దోఁచిన వానిని చిత్తగింపుడు.

సీ॥ ఆంధ్రమండలికి శైవాచార్యులను బంపి శివభక్తి బోధింపఁ జేయవలయు
లింగధారణము బాయంగరాదని బోదబాహుళ్యముగనొనర్పంగవలయు
మానినవారికి మరల నుద్బోధించి ధారణం బొనరింపఁ జలపవలయు
సంబంధ బాంధవ్యసామరస్యముల వైదికనియోగులతోడఁ దీర్పవలయు

తే॥ వేదముల శాస్త్రముల స్మార్తవిధి విధాన
ములను బాలకులకు నేర్పి పలు విధముల
వారలను సత్కరించి జీవనము లొసంగ
వలయు నేతాదృశములె యావశ్యకములు.



# మతమునకు సంఘమునకు గల మహత్తర సంబంధము

లోకమున వ్యక్తులయొక్క విజ్ఞానవికాసముచేత సమాజమును, సమాజాభ్యుదయపరిణామముచే మతమును మహోజ్జ్వలవ్యవస్థకు ఆకరమగుచుండుట సహజ మగుచున్నది. వ్యక్తిజీవన పరమావధియగు చతుర్విధపురుషార్థసిద్ధికి శాస్త్రవిదులచే నిర్దేశింపబడినదియు, శిష్టానుష్ఠానపరమై, వైజ్ఞానికమగుధర్మసంస్కృతి ప్రధానమగుచున్నది. అసామాన్యమైన మహత్తరాదర్శమును వ్యక్తీకరించు స్థితినే సంస్కృతి యని మన మందుము. అట్టి సంస్కృతికిమూలమైన అఖండశాస్త్రజ్ఞానమును వ్యక్తినిత్యానుసంధానము నొనర్చుకొనగలిగినప్పుడే కృతకృత్యుడగుచుండును. అహింస – సత్యము – అస్తేయము – బ్రహ్మచర్యము – దయ – క్షమ – దానము – జపము – పూజ అనునివి ధర్మసంగ్రహముగ వాకొనబడుచున్నవి. వేద వేదాంగాదికము లగు కళాయోగములు కర్త బ్రహ్మస్వరూప స్వభావ పరిణామము లగుటకతన, కళాక్షేత్రమగు ప్రపంచము పురుషార్థసిద్ధికి తదాదేశముల శిరసావహించుట అనుల్లంఘనీయమునై యున్నది. ప్రాక్తన పరమోత్కృష్ట దర్శసిద్ధాంత వ్యవస్థల ఆదరించి తదనుష్ఠానపరులై తాము తరించుటయేగాక, లోకకల్యాణసాధకులై, ఆప్తగుర్వాది సార్థకనామములచే ప్రముఖు లగుచుందురు. సంఘమిట్టి వర్గముల కృషిమూలకమై, సాంప్రదాయికమగు అభ్యుదయసిద్ధిని సంపాదించుకొని తద్ద్వారా సంఘైక్యత కలిగి, వ్యక్తినిర్ణయాదులవలన సాధింపజాలని మహోత్తమస్థితిని సాంప్రదాయక నిష్ఠానుకరణమునపొంది ఆదర్శజీవనసంపన్నత నలరారుచుండును. "యచ్ఛాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః । నచసిద్ధి మవాప్నోతి న సుఖం న పరాంగతిం ॥" ఎవ్వడు కామచారుడై శాస్త్రవిధిని అతిక్రమించి యథేచ్ఛగా సంచరించునో అతనికి కార్యసిద్ధియు, సుఖమును, ఆముష్మిక సంపన్నతయు పొందరానివని గీతావచనము.

శాస్త్రవిజ్ఞానము ఆధ్యాత్మిక దృక్పథముతో సమన్వయము కావలెను. పరస్పర సంబంధము లేక యిందేదియైనను ప్రయోజనకారి కాజాలదు. శాస్త్రాధ్యయన ప్రాప్తమగు ధర్మవిచారమునం దప్రమత్తుడై కర్మల విహితములైనవాని నొనర్చుచు, కర్మజ్ఞానములకు గల పరస్పర వైరుధ్యాదికమును గమనింపుచు, బ్రహ్మవిచారమున ప్రవృత్తికలవాడై సాధకుడు ఉపాసకుడు

కావలయును. అజాలప్రమాణ తత్త్వజ్ఞులచే నిర్ణయింపబడి నిర్మాణమునొంది అనంతాముష్మిక దర్శకలితమౌట మతమునకును ధర్మమునకును అన్యోన్య వ్యాప్తి లక్షణ లక్ష్యమగుచుండును. విశిష్టమైన శాస్త్ర సాంప్రదాయకాచరణానురూపమగు ఆదర్శమే విధులాది ప్రదర్శకస్థావరమై మతమను నొక మానవకూటమికి ఆధారమగుచున్నది. తన విదిని తాను నెరవేర్చుకొనుటలో వ్యక్తి ముందుకు సాగినప్పుడు అట్టి ఉత్తమ భవిష్యద్గమనమునకు కారణముగ మతమును గుర్తింపచేయుచు, సంఘ సాంప్రదాయకాచరణ పద్ధతులు అతని స్వయంకర్తృత్వమునకు అనుకూలమైన దోహదముల సమకూర్చుచుండును. లౌకికాలౌకిక ప్రయోజనసాధనములైన సత్యాది మహద్గుణముల స్వాశ్రయులకు ప్రాపింపచేయగల ప్రభావము మతగర్భమున నిగూఢమైయున్నది. బోధాప్రభావ సంపన్నమైన వ్యక్తిత్వము పూర్ణస్థితిని సాధించుకొనుటకు ఎట్టి పాత్రత బడయగల్గుచున్నదో, అట్లే శాస్త్రీయ ధర్మబద్ధమైన మతము సంఘానురూపమగు ధర్మానుష్ఠాన విధులను శాసించుటద్వారా తదభ్యుదయ నిశ్రేయస సిద్ధికి ప్రధాన పాత్రమగుచున్నది. మతాశ్రయములేని సాంఘికాచరణములు, మతిలేని వ్యక్తికార్యములవలె నిరర్థకములగుటయేగాక ప్రత్యవాయ ప్రమాదములుగ అనుక్షణము ప్రత్యక్షము లగుచుండును. సాంఘికాభ్యుదయమునకు కొలగర్రయై, మతము మానవసమాజమునకు శరీరమునకు ప్రాణతుల్యమైయుండును. ఐహికాముష్మిక సుఖప్రాప్తికి, సాధకస్మృతియందు హత్తికొన్న సాంప్రదాయక సచ్ఛీలమునకు తేజోబల ప్రభావముల సమకూర్చుచు, సాధక జీవన నిత్యసాఫల్యమునకు మతవ్యవస్థ పరమ ప్రయోజనభాజన మగుచుండును. ప్రకృతి విజ్ఞానమును సాధించిన యోగి తదతీత పౌరుషానంద నిమగ్నుడౌనటుల, ధర్మవిజ్ఞానమునగాని మతావ్యక్తమగు ఆనందము సాధకునకు ప్రత్యక్షము కానేరదు.

హృదయము ధర్మాంకితమైనప్పుడు దుష్టకృత్యముల తృణీకరింపగల ప్రబోధరూపమైన సత్యవిజ్ఞానమును పొంది యుత్తేజితమగుచుండును. సాధకాచరణయందు ప్రమాదాదిక ప్రాప్తమైన ధర్మవైపరీత్యఘటనను సవరించుటకే మతసంస్కరణముగాని, సకలాభ్యుదయశ్రేయస్సాధనమైన మతధర్మమెన్నడును సంస్కరణ మర్థింపకుంటయెగాక తాత్కాలికవ్యక్తములైన ప్రతికూల వ్యవస్థలను సయితము నిర్జింపగల బలప్రయోజనముకలది యగుచున్నది, శాస్త్రీయవిజ్ఞానానుగుణమగు మతధర్మమును దృఢవ్రతముగల సంఘమును. అట్టి సాంఘిక వ్యవస్థ నాశ్రయించి తన్నిష్ఠుడైన వ్యక్తియొక్కయు పరస్పర సహకార సంభరితమైన యునికి లోకజీవన వికాసకారణమును సాధకాశయ సిద్ధికి పరమ ప్రయోజనమైన సాధనముగ రూపొందుచుండును. ఆస్తిక

మతవిజ్ఞానము బహుమార్గ భేదమైనదయ్యును ఆభేదములన్నియు ఉపాసనా పద్ధతులుగ ప్రాజ్ఞులచే గుర్తింపబడి సాధకగతికి ఏకసూత్ర ప్రయోజనమునకే యగుచున్నవి. కాని ఇందు సాధకాధికారి ఉపాసనాపరత్వము శాస్త్రీయ ధర్మ సమన్వయరూపమగు విధివిధానముగ నుండవలెను. జీవగణముల జీవితపరమావధి ముక్తియే యైయున్నది. దైనందిన జీవనసాఫల్యమును కలిగింప సమర్థమైనదియు, ఆముష్మిక శ్రేయోదాయకము నై, శాస్త్రీయ వైజ్ఞానిక విచారాచరణాత్మమైన మతము అద్వైతాది నామకకర్త బ్రహ్మో పాసనానిష్ఠానురూపకమై సాధక చతుర్విధ ఫలపురుషార్థసిద్ధికి మూలమగు చుండును. ఇట్టి మతాశ్రయమున ప్రాప్తించిన ఆధ్యాత్మిక జీవనమునకు మోక్షమే ప్రతిఫలము కాకతప్పదు.

## సాంఘిక విధి

తన ధర్మమును తాను గాఢముగ ప్రేమించుచు తన్నిమగ్నుడై యుండుట తన సంఘజ్యోతిలోని జ్వాలాభాగమై సంఘజీవనహిత పరిణామమునకు మూలమగుదానిగ వ్యక్తి గుర్తింపవలయును సాధకాభ్యుదయమునకు ఇది ఒక విశిష్టగతి యగుచున్నది. ఎవడు సమర్థుడయ్యును ధర్మ రక్షణకు సహకార మొసగకుండునో అతడు నరకభాగియని ఆర్యులు వచించిరి. మానవులకు స్వధర్మాచరణమున సాధ్యము కానిదెద్దియు నుండ జాలదు.

స్వధర్మాచరణమున మరణము సంభవించు స్థితి సంభవించినను, మరెట్టి స్థితి కలిగినను తన మతము, తన ధర్మము, తన సంఘమును విస్మరింపక తాత్కాలిక ప్రవర్తకములగు ప్రతికూలశక్తుల నెదుర్కొని శక్తివంచనము లేక తన ధర్మమును చిరస్థాయిగా నొనర్చి లోక కళ్యాణమునకు తోడ్పడుట ధీరలక్షణ మగుచుండును. సువిశాల భావము- కార్యదీక్ష- నైతికరక్షణ- అహింసాదిక ధర్మాచరణము నిక్కమైన సాంఘికుని పరమ ధర్మములై యున్నవి. సంఘసేవా పరాయణుడగు వ్యక్తికి పారమార్థికసిద్ధి యెక్కువ దూరముగ నుండదు. స్వసంఘమును ప్రేమింపుచు తత్సాంఘికు లందరొక కుటుంబమునకు చెందిన వారనియు, వారిసేవయే తనకు కనీసధర్మ మనునది ప్రతి సాంఘిక హృదయ ఫలకమున శిలాక్షరములవలె అంకితము కావలయును. వ్యక్తి సాంఘికాదేశముల శిరసావహించి తన్నిష్ఠుడు కావలయును. శిష్టులు సాంఘికుల స్వధర్మమును ప్రబోధించు నిత్యజీవన సందేశముల చాటుచు శాసింపు చుండవలయును. మానవ జీవిత గర్భమున అనంత శక్తులు నిద్రించుచున్నవి. ఎవరికి వారు తమ అసమర్థతను అడ్డము పెట్టుకొని ఉపేక్షా

భావమున తచ్ఛక్తుల జాగరిత మొనర్ప ప్రయత్నించకుండు టెంతయో శోచనీయ మగును. ఎట్టి కార్యమైనను తన ప్రయత్నమే లేకుండ భగవంతు డనుగ్రహింపవలె ననుకొనుచు, విలంబనమునకు స్వస్తి చెప్పజాలని సోమరి పోతునకు సిద్ధిపొందుట గగనకుసుమమే యగును. దేశమును నే నొక్కడనే యుద్ధరింతునని ఆంగ్ల మహాశయుడొకడు తన ఆత్మవిశ్వాసమును ప్రకటించెను. గాంధి మహాత్ముడు తనహక్కు, అధికారముల గుర్తింపలేని వాడు బ్రతుక వలసిన అవసరముండదనియెను. శ్రీ కృష్ణుడు తన ధర్మమునందు మరణ మైన శ్రేయమేనని వచించెను. ప్రారబ్ధవశమున జన్మజరాదుఃఖ మరణాదిక బాధాపీడితుడగు మానవునకు దుఃఖనివృత్తి చేయునదియు, నిత్యసుఖమును ప్రసాదింపగల ప్రభావముగలది పరమేశ్వరారాధనారూపమైన దొకటియే యని సర్వశాస్త్రముల యందును వివరింపబడినది. పాశబద్ధుడగు జీవుడు పాశచ్ఛేదకమైన పరమేశ్వరారాధనమున తత్పరిపూర్ణానుగ్రహ పాత్రుడగుచు తద్వారా నిత్యసుఖానుభూతికి పాత్రుడగుచున్నాడు. తన ప్రభువును తన ధర్మమును గుర్తింపజాలని భృత్యునివలె అజ్ఞానవశమున సర్వభావముల శరణముగోరి తన దైవమును గుర్తించి, మనోవాక్కాయకర్మముల నారాధింపజాలని పశువాచ్యుడగు జీవుని స్థితియు క్షణక్షణ పతితమై నిరర్థకమగును.

భారతీయ సంస్కృతికి మూలమైన ఆస్తిక మత శాఖలందు శైవము ప్రథమము ప్రధానమై సర్వవిద్యా సమన్వయ విభాసితమయి యున్నది. సకల శిష్టాదృత ప్రసిద్ధమై లింగారాధనము మన దేశమందు మాత్రమే గాక ఖండఖండాంతరములందును ప్రవర్తిల్లుచున్నది. శివ ధర్మానుష్ఠానము మానవ దైనందినాభ్యుదయ నిశ్శ్రేయస సిద్ధికి ముఖ్యమైనదిగ శాస్త్రపరిగణనీయ మయినది. విద్యాస్థానము లీ విషయమున కన్నివిధముల ప్రత్యక్ష సాక్ష్యము లయి యున్నవి. కర్మజ్ఞాన సముచ్చయ విలసితమును, శివజ్ఞాన ప్రతిపాదకమును— సద్యఃపాశక్షయకరమును, నిగమాగమ ప్రసిద్ధమును, సదాచార కలితమై రుద్రాక్ష శివలింగధారణార్చనాదిక సర్వాంగకలితమును అష్టావరణ పంచాచార సంఘటితమై జగద్గురుత్వాధికృతమైన దగుచు మోక్షమే మూలముగ శైవమత ధర్మము నిర్దేశింపబడి ఒకప్పుడు సిద్ధత్రయ ఆచార్యత్రయ ఆరాధ్యత్రయ పండితత్రయముల యొక్క శ్రీవారల శిష్య— అనుయాయికులైన మహాత్ముల నిరంతర కృషిమూలక పరివ్యాప్తమై జగమున దివ్యజ్యోతి బోలె విలసిల్లినది. శైవవాఙ్మయ మెన్నివిధములుగనో విస్తరిల్లినది. మతము మహారాజుల మన్ననలకు పాత్రమైనది. మత నిష్ణాతలగు మహాత్ములు జగద్గురుత్వాధికృతులైరి. మతధర్మానుష్ఠానము బహుళతనంది సకల కళాపూర్ణత భాసిల్లెను.

కాలవశమున అట్టి మహోత్తమ పరిస్థితులు నేను కొంతవరకు తారుమారు లయినవని చెప్పవలసి వచ్చుట శోచనీయము కాకపోదు. ఒక విధముగా నిది లోకసహజమే మో? కాని అట్టి లోపములను తొలగించి. విలుప్త తేజస్కమయిన శివమతము మతసంఘములకు పూర్ణమగు యుత్తేజము కలిగించి సకల కళావంతముగ నొనర్చు భారము సాంఘిక ప్రధాన విధియని చెప్పక తప్పదు. సాంఘికుల దృఢదీక్షయు స్వార్థత్యాగమును ఐకమత్యమును దీనికి సాధనము కాగలవు. స్వసంపూర్ణదరణ పాత్రముగాని ఏ సంస్థయు పూర్ణవికాస వంతము కాజాలదు.

గురుచరేశ్వరారాధన రూపకమైన ఓీర దేవతారాధనమునకు తామందరు శక్తివంచనము లేక తోడ్పాటు నొసగి పరమేశ్వరానుగ్రహపాత్రులై లోకమున శైవప్రతిష్ఠను శివధర్మమును శైవమతమును యథాపూర్వకముగ విభాసిల్లుసిట్లొనర్ప దృఢవ్రతులై, పూర్ణ ప్రయత్నముల నిమగ్నులై, భక్తిహారి ఉత్తమాధికారత నాకాంక్షింతురుగాత మని విన్నవించు చున్నాను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



# పీఠాధిపతి సందేశము

శివయోగి ముదిగొండ వీరేశలింగారాధ్యులవారు

ఓమ్.

ఋ|| ఈశాన స్సర్వ విద్యానాం ఈశ్వర స్సర్వ భూతానాం
బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోధిపతి ర్బ్రహ్మ శివో మేఅస్తు సదాశివోం॥

## శాంభవ దీక్షితులగు భక్తమహేశ్వరులారా !

శైవమతము అతి ప్రాచీనము. 'శ్రౌతాశ్రౌతత్వ భేదేన శైవం ద్వివిధ ముచ్యతే.' అని శ్రౌతశైవము అశ్రౌతశైవము అను రెండువిధములుగా శివ పురాణమందుకలదు. యిందనేక భేదములున్నవి. 8 వ శతాబ్దమున 63 శివ భక్తులుకర్నాటక, ద్రావిడ దేశములందు శైవజ్యోతుల వెలిగించిరి. వీరినే అరువత్తుమూవురు నాయనారులని దక్షిణదేశమున పిలుచుచున్నారు. శెక్కరస్ అనువాడు 72 అధ్యాయములతో పెరియ పురాణము రచించినాడు. కాంజీయప్పన్ అనువాడు స్కాందపురాణమును, కందపురాణమను పేరుతో వ్రాసినాడు. 14 వ శతాబ్దములో మృత్యుండదేవుడు సిద్ధాంత గ్రంథము వ్రాసినాడు. రాజపుత్ర స్థానంలో గుజరాత్‌లోను లాకుల శైవము కలదు. 650 ప్రాంతములో అభినవగుప్త పాదచార్యుడు, సోమానందుడు, కాశ్మీర శైవమును వ్యాపింపచేసినాడు. కన్నడదేశమునందు శైవము విశేషముగా వ్యాపించియున్నది. భండార్కర్, బరోడా సంస్థానములోని కార్వార్ అనుగ్రామమున లకులీశ్వరాలయ మున్నదని 7 వ శతాబ్ద శాసనములో పేర్కొన్నాడు. మొహంజొద్దారో హరప్పాలవద్ద భూగర్భ పరిశోధనమున బయలువెడలిన శివలింగములు క్రీస్తుకు పూర్వమే 5,6 శతాబ్దములనుండి శివలింగ పూజయున్నదని రుజువు చేయుచున్నవి. పాలకురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర 82 వ పేజీలో 112 మంది శిష్యులతో యోగాచార్యులును, తిరునీలకంఠుడు మొదలుగాగల నాయరులు 63 ను దశగణము, షోడశగణము, త్రయోదశగణము మొదలగు శివభక్తులు శైవమత ప్రచారము చేసినట్లు వ్రాసినాడు. యిదిగాక విదేశములయందుగూడ శివలింగపూజ, శివోపాసన కలిగియున్నట్లు బేచాసింహాశాంభవిగారు శివ నిర్మాల్య రత్నాకర పీఠికలో వ్రాసియున్నారు.

బాబ్లిన్ నగరమున 1200 అడుగుల ఎత్తుగల ఒక మహాలింగమును, టర్కీలో 300 ఎత్తుగల శివలింగమును గలవు. స్కాట్లండులో సువర్ణాచ్ఛాదిత

మయిన శివలింగము కలదు. నేటికి 4 లక్షల 38 వేల సం॥ క్రిందట ముఖలింగేశ్వర దేవాలయము స్థాపింప బడినట్లు ఒక శాసనములో కలదు. పండిత కాశీనాధశాస్త్రి (మైసూరు) ఆనాం దేశమునందు శివాలయములు కలవని దీనికే చంపానగరమని పేరున్నట్లు వ్రాసినారు. శ్లో॥ చంపాదేశే జనయతు సుఖం శంభు భద్రేశ్వరోయం॥ యీ ప్రకారముగా విచారించినచో శివాలయములును, శివపూజలును, శివోపాసనయును శృతులనుబట్టియే కాక శాస్త్రములనుబట్టి కూడ పూర్వకాలమునుంచి శైవమతమే ప్రబలముగానున్నట్లు తెలియుచున్నది. ఏమి వ్రాయబడినదో చూడండి.

కావున ప్రపంచమతమే శైవమతము. శివతత్వము, ఆద్యంతరహితము, నిర్గుణము, శక్తి విశిష్టము ముముక్షువులకు కొంగుబంగారము. ఉపాసకులకు సర్వమనోరథప్రదాయి–హేయగుణరహితము – అనంతకళ్యాణగుణ సహితము పంచ బ్రహ్మాత్మక సదాశివ మహేశ్వరరుద్ర ఈశానాద్యంత స్వరూపములు గలిగి పరాపరభేద విశిష్టమై పంచకృత్యము లొనర్చుచు లోకవత్ లీలాకేవలావస్థా సంకలితమై మహాలింగమనీ జ్యోతిర్లింగమని, మహాదేవుడని, మృత్యుంజయుడని యనంత నామములతో భక్తులచే నుపాసించ బడుచున్నది.

వర్ణాశ్రమ ధర్మము శివలింగధారణము చాతుర్వర్ణ గురుత్వముగలిగి కరపీఠమున శివలింగోపాసనమొనర్చు బ్రాహ్మణులే శైవులన్నీ – ఆరాధ్యులని వ్యవహరింపబడుచున్నారు. ఈ ఆరాధ్యులు తమశిష్యులకు అనగా బ్రాహ్మణులకు, వైశ్యులకు తదితరులకు శివదీక్షలనిచ్చి త్రిలోకగురు, జగద్గురులోకారాధ్యేత్యాది బిరుదాంకితులై ద్వాదశారాధ్య పీఠముల నెలకొల్పి శైవమత ప్రచారము చేసిరి. రాజాధిరాజులకు గురువులుగనుండి రాజ్యపరిపాలనము చేయించిరి. పీఠాధిపతులుగను మఠాధి పతులుగనుండి అగ్రహారములు సంపాదించిరి. నేడు అట్టివారు ఘృతకోశాతకీ న్యాయమున ప్రాభాతిక దీపజ్యోతులవలె నిస్తేజస్కులై విలసిల్లుచున్నారు.

సిద్ధత్రయములో చేరిన రేవణాసిద్ధులవారు–దేశోద్ధారక కళాప్రపూర్ణ విశ్వదాత బిరుదాంకితులగు కాశీనాథుని నాగేశ్వరరావుగారికిని, ఉర్లాం సంస్థానాధి పతులయిన చాగంటి సీతయ్యశాస్త్రిగారికిని మూలపురుషులు. ఈ రేవణసిద్ధులవారే ఆదిశంకరులవారికి చంద్రమౌళీశ్వర రత్నలింగము నిచ్చినట్లు సప్తమశతాబ్ధముననున్న నాగనాథకవి గురుచరిత్రలో వ్రాసియున్నాడు.

విజయవాడలో అంగవస్త్రమున నిప్పులు మూటగట్టి జమ్మికొమ్మకు వ్రేలాడవేసి ఏ గృహమున అగ్నిహోత్రమూలేకుండ చేసిన మహాతపస్వియగు

శ్రీపతి పండితారాధ్యులవారు – సికింద్రాబాదు నగరమునందలి సెకండుబజారులో పండితస్వామి మఠమను పేరుతో తన సర్వస్వము ధారపోసి మఠనిర్మాణము చేసిన శ్రీపతి పండిత స్వామివారికి–పెదపులివఱ్ఱు అగ్రహారములోనున్న కాశీనాథుని వారికి–శ్రీశైల స్వాములని పిలువబడుచున్న శ్రీపతి పండితారాధ్య పట్టెస లింగారాధ్య స్వాములవారికిని మూలపురుషులు.

3 వేల అగ్రహారములు ముంజభోజ భూపాలునిచే బహూకరింపబడి జయాపీడునిచే కోటి దీనారములతో ప్రత్యహము పాదపూజ చేయబడుచు, నూరు వందల గంధర్వులకు శాపవిమోచనముచేసి కాశీ విశ్వేశ్వరలింగ నిజగర్భ సంభూతులైన జగద్గురు ఉద్భటారాధ్యులవారు మన శైవసభకు ప్రథమమునందే అధ్యక్షస్థాన మలంకరించిన శంకరారాధ్య స్వాములవారికే గాక ఆహ్వాన సంఘాధ్యక్షులగు నాగవీరయ్య శాస్త్రి వారికిగూడ మూలపురుషులు.

అష్టభాషా కవిత్వముగలిగి పండితారాధ్య చరిత్రము బసవపురాణము వ్రాసిన పాలకుర్తి పురవాసియైన ఇవటూరి సోమనారాధ్యులు కోటిపల్లిలో నున్న విశ్వారాధ్య పీఠమునకు చెందినవారు. ఇవటూరివారి కందరికి గురుతుల్యులు. కాశీనగరమున విష్ణువిగ్రహమును సభావేదిక దగ్గరనుంచి విశ్వేశ్వరాలయమువరకు నడిపించి తనమహిమను గన్పరచిన మంచన పండితులు శివలెంక వారికి మూలపురుషుడు.

చందవోలుగ్రామమున బౌద్ధుల వివాదములో ప్రత్యక్షముగ తన కన్నులతీసి పశ్చాత్ మనందుంచి తిరిగి యథాపూర్వకముగ కన్నులుపొంది శివతత్వసారమును వ్రాసిన మల్లికార్జున పండితారాధ్యులు, నిర్మల అంకయ్య సిద్ధాంతి గారికి కొడిమేల బసవయ్యగారికిని, కొడిమేల మల్లయ్యగారికని. ఘట్టేపల్లి నాగమల్లయ్యగారికిని మూలపురుషులు.

ద్వాదశారాధ్య వర్గమునకుచెందిన భండార్లు, బుద్ధిరాజు, కొమ్మరాజు, సింగరాజు, ఆదిరాజు, కందుకూరు, అత్తలూరువారు మొదలగు శివలింగధారణగల శైవులు చతుష్షష్టి శీలవ్రతముల చేతను గణార్చన చేతను దృష్ట ప్రత్యయములు చూపించి లింగ పసాయితములధరించి ఆరాధ్య మతమునకు వన్నె పెట్టినారు. కొమ్మరాజు వెంకటశివుడుగారు వ్రాసిన దేవరాజ లింగశతకము నొకమారు పఠించిన పై విషయములు బోధపడగలవు. శైవ ప్రస్థానత్రయకర్తలగు జగద్గురు నీలకంఠం శివారాధ్యులవారు ప్రప్రథమమున మనకందరికి వందనీయులు. వీరి భాష్యములకు శివచింతామణి ప్రభాది వ్యాఖ్యానములవ్రాసియు తదనుకూలములగు నిబంధనగ్రంథముల వ్రాసిన శైవమహాపీఠాధిపతులు మదిగొండ నాగలింగ శివారాధ్యులవారు సదా పూజనీయులు.

10 వేలు వెచ్చించి సూత్రభాష్యమును ముద్రింపించిన ఆకారపు నర సింగంగుప్తగారును, 3 వేలు వ్యయపరచి గీతాభాష్యమును ముద్రింపించిన కొమరవెల్లి బాలరాజు గుప్తగారును ఇంకను శైవ్యగ్రంథముల పునర్ముద్రింపించిన దాతలందరును ప్రశంసనీయులు, స్మరణీయులు.



# శైవ మహాపీఠ స్వర్ణోత్సవములు

౩౦—7—60 తేదీ నుండి మూడురోజులు శ్రీ శైవమహాపీఠపు యాబదియవ వర్ధంత్యుత్సవము, "స్వర్ణోత్సవము"లను పేరుతో సికింద్రాబాద్ కవాడిగుడా యందలి శ్రీ శంకరమఠంలో విజయవంతముగ జరిగియుండెను. ఇందుకు పీఠాధ్యక్షులగు శ్రీ ముదిగొండ వీరేశలింగ శాస్త్రిగారు కోరిన ప్రకారము స్థానికులు శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారి అధ్యక్షతన ఆహ్వాన సంఘమేర్పడియుండ సభకు వివిధ ప్రాంతములనుండి దాదాపు రెండు వందలకు మించిన మహేశ్వరులు విచ్చేసిరి. ఈ సమావేశాల్లో శైవ యువకులు సమావేశముగా పాల్గొనడం ప్రత్యేక విశేషము. ఈ సమావేశాన్ని మూడవ రోజున 'సంజయ' 'ఆంధ్రభూమి' పత్రికా సంపాదకులు శ్రీ పండితారాధ్య నాగేశ్వరరావుగారు ఆరంభించిరి. 30 జులై ఉదయమున పీఠాధిపతి శ్రీ యం. వీరేశలింగ శాస్త్రిగారిని, శ్రీ యం. నాగవీరయ్య శాస్త్రిగారిని, పండిత మఠమునుండి శంకరారాధ్యుల మఠమువరకు ఊరేగించుతూ తీసుకరాబడి, ఆహ్వాన సంఘాధ్యక్షుల స్వాగతముతో, శతావధాని శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారి, విద్వాన్ శ్రీబి చిదంబరశాస్త్రిగారి స్వాగత పద్యములతో ప్రారంభింపబడెను. సాయంకాల సమావేశంలో సహాయ కార్యదర్శి శ్రీ ముదిగొండ కోటేశ్వరరావుగారు నివేదించిన వార్షిక నివేదిక ఆమోదింపబడినది. మరియు శ్రీ శివలెంక పున్నయ్యగారు, శతావధాని ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు, ముదిగొండ రామలింగ శాస్త్రిగారు, ముదిగొండ రామనాథ శాస్త్రిగారు మహోపన్యాసముల నిచ్చిరి. శ్రీ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు పంపిన వ్యాసము చదువబడెను.

రెండవ రోజున మహాసభ శ్రీ ఘట్టేపల్లి నాగమల్లయ్యగారి అధ్యక్షతన జరిగినది. శైవమత ప్రాశస్త్యము, వ్యాప్తికి సంబంధించిన తీర్మానము మీద శ్రీపతి పండితారాధ్య పట్టేశలింగం, శ్రీపతి పండితారాధ్యుల శరభారాధ్యులు, శ్రీ శివలెంక లింగయ్యగారు, ముదిగొండ ముక్తిలింగశాస్త్రిగారు మాట్లాడిరి. తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడినది. కృష్ణా పత్రికా సంపాదకులు శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు శైవమత ప్రయోజనమునకు ఉద్దేశింపబడిన ధర్మాదాయ సంస్థల "యాజమాన్యం" నిర్వహణలకు సంబంధించిన తీర్మానాన్ని ప్రతిపాదించిరి. శ్రీ బండారు సదాశివరావుగారు ప్రతిపాదించిన సవరణతో తీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడినది.

శ్రీముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు నిలచిపోయిన "శైవమత ప్రకాశిక" యనుపత్రికను పూర్వము మాదిరిగనే తిరిగి ఒక సంవత్సరము వరకు ఉచితముగ ప్రచురించుటకు ప్రకటించిన విషయము మిక్కిలి శ్లాఘ్యము.

విద్యావ్యాప్తి, శైవవిద్యార్థుల విద్యార్జన గురించి మరొక తీర్మానము గూడ అంగీకరింప బడెను. ఈ తీర్మానమును బలపరుస్తూ డాక్టర్ శ్రీ ముదిగొండ మల్లికార్జునరావుగారు, పేదశైవ విద్యార్థులకు సహాయముగ వెయ్యి రూపాయలు ఒసంగుటకు ప్రకటించిరి. (ఇట్టి ధనము మాకు వచ్చిన నివేదికలను పరామర్శించి చాలా మంది విద్యార్థులకు పంచడమైనది.) ఇట్టి విరాళముతో నభ్యసించి ఉన్నతశ్రేణిలో ఉత్తీర్ణుడయిన విద్యార్థికి బంగారు పతకము నిచ్చుటకు శ్రీ బుద్ధిరాజు సుబ్బారావుగారు తెలియ పరచిరి. (విరాళము పొంది ఉత్తీర్ణుడయిన విద్యార్థి తన తరగతి మాకు తెలియపరచినచో పతకము ఒసగ బడును)

ఆగమ శాస్త్రముల నభ్యసించు విద్యార్థి యొకరికి నెలకు 25 రూపాయలు వేతనము ఇస్తానని శ్రీ పండితారాధ్యుల పట్టేశలింగంగారు ప్రకటించిరి. సాయంకాలను శ్రీ పండితారాధ్యుల సాంబమూర్తిగారు "నంద నార్" అను హరికథను రంజకముగా చెప్పిరి.

మూడవ రోజు శ్రీ శంకరారాధ్యులవారికి క్షీరాభిషేకము, లక్ష బిల్వార్చనలతో ఆరంభింప బడగా శ్రీ శివదేవుని వీరభద్ర శాస్త్రిగారు, కవి రాజశేఖర రెంటాల సుబ్రహ్మణ్య శాస్త్రిగారు, ముత్యంపేట నాగలింగ శర్మగారు, కొంపల్లి ఆంజనేయ శాస్త్రిగారు మొదలగు అనేక ప్రముఖుల ఉపన్యాసములతో బహు చక్కగా ముగింపబడెను.

ఇట్టి సభను స్వర్ణోత్సవములన్న పేరును సార్థక మగునట్లుగా పూర్తి చేసిన శైవమహా జనులందరికి, ప్రత్యేకించి మా యందలి యభిమానముతో సభకు విచ్చేసిన శ్రీ బెల్దె జగదీశ్వరయ్యగారు, మొలుగు రాజయ్యగారు మొదలగు వైశ్య ప్రముఖులకున్ను ఆహ్వాన సంఘము ఎంతయు కృతజ్ఞతయై యున్నది: విశేషించి రెండవ రోజు సమావేశమునకు అధ్యక్షత వహించిన శ్రీ ఘట్టేపల్లి నాగమల్లయారాధ్యుల ప్రియ శిష్యులగు పొద్దుటూరి వీరన్న గారి భార్య తన మనుమడు ఇంద్రకుమార్ తో పాదపూజ చేయించి కడు మన్ననకు పాత్రులైరి.

శ్రీ శివదేవుని భ్రమరాంబమ్మగారు లోగడ తనపైగల బాధ్యతను నిర్వర్తించుకొనుటకు రెండు వేల రూపాయలను శ్రీ శైవ మహాపీఠమున కొసంగుటకై యొప్పుకొని అట్టి ద్రవ్యమును శైవమహాపీఠ కార్యవర్గము వారు సద్వినియోగ మొనరించ గలరని కోరిన విషయము బహు ప్రశంస నీయము.

ఇట్లు శైవ జనాభివృద్ధికై పాటు పడుచున్న శైవమహా పీఠమునకు అనేక విధములుగా శక్తికొలది సహాయము చేయుచు పీఠాభివృద్ధి యగునట్లు తోడ్పడగలరని కోరుచున్నాను.

ఇట్లు
శైవ మహాపీఠ కార్యదర్శి
ఎడ్వొకేట్ చాగంటి శంకరశాస్త్రి.



# కిరాతలీల

విద్వాన్ ఓ. చిదంబరశాస్త్రి

అది కామ్యకవనము. పరమేశ్వరుని దివ్యలీల ననుభవించుటకై రాత్రింబవలు తపించు మహర్షులు వసించు పుణ్యభూమి. అందు సింహాది క్రూరజంతువులు వధ్యములైన గజాదులను మిక్కుటముగా ప్రేమించుచు సహజ వైరముకైనను ప్రేమ మయముగా నొనర్చుటకు సత్పురుషుల సాంగత్యమెట్లుపకరించునో ఋజువు చేయుచుండెను. నాటిరాత్రి సుధాకరుడు విశ్వ మనోహరమైన సకల కళలను ప్రత్యక్షమువులో ప్రసరింపజేయుచు సృష్టి యెంతటి యానందమునకు నిలయమో చాటుచుండెను. అట్టి చల్లని వెన్నెలలో సరస్వతీ కూలమందలి యొక చలువ ఱాతిపై పాండవమధ్యముడగు నరుడు సుఖాసీనుడై మనమున నిట్లు వితర్కించుచుండెను: "పూజ్య ధర్మరాజు అప్రతిమాన మేధా సంపన్నుడు, సత్యవాది, నిష్కళంకజీవి. అతడు చేయుప్రతిపనియు సర్వజనుల కాదరణీయమౌను. యోగ్యమగు ద్వైతవనమునుండి ఇచటికి వసతి నేల మార్చియుండెను. సమీపమున నున్నచో నీచులగు దుర్యోధనాదుల వలన నేదైనకీడు శకించియుండునా? నాడు ద్రౌపదీ పరాభవమున ధర్మపు సంకెళ్లతో కాలు - చేతులు బంధింపబడిన మాయందలి శక్తి సామర్థ్యముల నెఱిగిన వాడుగదా? భీమాగ్రజుని క్రోధోపన్యాస మించుక మనస్సునకు చలనము కలిగించియుండునా! ధీరోదాత్తుల చిత్తమునకు క్షణికములగు నాగంతుకములు కలచనేరవు. దూరదర్శి వ్యాస మునీంద్రులు మాయందలి యభిమానమున విచ్చేసినపుడు ఇటుల నాదేశించి యుందురా? ధర్మైక పక్షపాతుల శాసన మనుల్లంఘనీయముకదా? అయిన నిందేదియో మహత్కార్య ముద్దేశింప బడియుండును." అని చాలాకాలము నుండియు తనముందు నిలిచిన ధర్మజునైన చూడలేక పలువిధముల వితర్కించు నర్జునుని భుజముపై చేయినుంచి యుధిష్ఠిరుడు ఇట్లుపలక నారంభించెను. "వత్సాఅర్జునా, నీకార్య నిర్వాహపరత్వము అసాధారణము. శౌర్యపటిమ యనన్యము. కర్మవీరుడవైన నీవంటివానికి అగ్రజుండనైగదా మిమ్ముల నరవుణ్య జీవుల నొనరించితిని. ఎట్టివాడును దైవ కారణమునకు యెదురోడ్డలేడు. లేకున్న ధర్మ వృద్ధులగు భీష్మద్రోణాదులచే మనవలెనె సుశిక్షితులగు దుర్యోధనాదులు భ్రాతృజాయ ద్రౌపదియెడ నౌల పరాభవము తలపెట్టుదురు. మఱియు మనసంకేత కాలము పూర్తియైన తదుపరియు స్వార్థ లంపటుడగు దుర్యోధనుడు స్వాయత్త

మగు రాజ్యమును విభాగించుటకు నిచ్ఛగించడు. భీష్మద్రోణకృపాశ్వత్థామల సాహాయ మాతని సంకల్పమును రెచ్చగొట్టు చుండును. మన యాచార్యులు దుర్యోధనదత్త పిండులగుట యుద్ధ రంగమున మనకెదురు నిల్చుట తప్పదు. ఆహవమున తలపడిన శివునైన నెదిరించ కుండుటకు క్షత్రియ ధర్మ మంగీక రించదు. పరాక్రమ వంతుడవైన నీ యస్త్ర సంచయమున ద్రోణాదులు పరా జితులు కాకపోరు. కాని పూజ్యులు ధర్మ వీరులునైన మహాత్ములు సామాన్యా స్త్రములచే నవధ్యులు. (సశేషము)



# శైవపీఠ కల్ప తరువు

విద్వాన్
బి. చిదంబరశాస్త్రి.
శైవమహా పీఠ కార్యదర్శి:

కం॥ నుతవితత దివ్యరస మప్రతిహతముగ దొరలుచున్న భవ్యఫల సమా
వృత శైవ పీఠ సురతరువతి సుందరమౌచు ధరణి వర్ధిలు చుండున్.

చం॥ నిలిపెను నీలకంఠ మహనీయుడు మూలము నేల తొల్లిను
జ్జ్వల వరశాఖలల్లికొన బంచెను దిక్కుల నప్ప యాఖ్యదన్
గలిత యశుండు సత్వగుణ గర్భ నిరంతర వాస నాకలత్
ఫలముల నాగలింగ బుధవర్యుడు పండగ జేసె నేటికిన్.

చం॥ లలితరస ప్రసార విచలన్ మధుధారల పారమై జగత్
తలమున మూల మూలలకు దారసిలన్ ముదిగొండ శంకరుం
డలరుల యంగడిన్ దెరిచె నందున జిందు రసంబు గ్రోలి మ
త్తిలు వర శైవులార శ్రమదేర మధు వ్రతులై చరించుడీ.



# శైవమత ప్రకాశిక

శ్రీ శైవమహాపీఠ పక్షమున ప్రచురింపబడు సచిత్ర మాసపత్రిక


| సంపుటం 1 ] | ప్లవసంత్సర అధిక జ్యేష్ఠ పూర్ణిమ (30—5—61) | [ సంచిక 2 |
|---|---|---|



సంపాదకులు :

కందుకూరి వీరబసవరాజు




శ్లో॥ శ్రీ వేదశాస్త్రార్థతతిప్రభాసికా
సందేహసందోహమహాసిరాసికా ।
తత్త్వత్రయోద్బోధన సిద్ధదేశికా
జయత్వియం శైవమతప్రకాశికా ॥


## శ్రీ శైవమహాపీఠము

1 - బి, పద్మారావునగరు,

శికింద్రాబాదు

పబ్లిషరు : బి పేట చిదంబరశాస్త్రి

# విషయసూచిక





# శైవమతప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

| | | |
|---|---|---|
| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>30–5–61<br>అధిక జ్యేష్ఠ పూర్ణిమ | సంచిక ౨ |

## కర్తవ్యము

శైవ మతప్రకాశిక గడచిన సంచికలో శైవ పీఠముపట్ల శైవమతస్థులు అభిమాన గౌరవములు కలిగియుండవలసిన విషయము దిఙ్మాత్రముగావ్యక్త పరచియున్నాము. శైవపీఠమునందు మతస్థులకు గల యభిమానము ఒకనోటితో, ఒక పనితో ఒకవ్యక్తితో నిర్ణయింప సాధ్య పడదు. సంఘీ భావముతో మతస్థులు తమ తమ శక్త్యుత్సాహముల నుపయోగించి పీఠాభివృద్ధికి పూనుకోవలసియున్నది. పీఠము వివిధశాఖో పశాఖలతో కూడుకొనిన మహాకల్పవృక్షము. దానికి దోహదము చేసి, దాని నీడనుచేరి, దానివివిధశాఖా ఫలములను సంఘీయు లనుభవిం చుట కర్తవ్యము. పీఠమును వృద్ధి పొందించు విధానములో తరతమ భావము లుండవచ్చును. కాని సమష్టి కృషివల్ల కలిగే ఫలములకు సం ఘీయు లందరును సమాన భాగార్హులుగానుందురు. ఫలము ననుభవించు టలో ఒకరి.కెక్కువ ఒకరికి తక్కువ యుండదు.

"పీఠాభివృద్ధి"యని మూక ఉమ్మడి మాటతో భావముతేలలేదు. పీఠమునకు ఆర్థిక స్తోమత మొట్ట మొదటిది. ఆర్థిక బలము ఏ కొలది మందితోనో నెరవేరునది కాదు. సంఘీయులు తమతమ శక్తి వంచనము లేకుండ స్వహస్త పరహస్తములతో ఆర్థిక బలమును పీఠమునకు చేకూర్చు చుండవలయును. తనకు మాలిన ధర్మము నెవరు చేయ జాలరు. యథాశక్తికముగా విరాళముల నిచ్చియు అవకాశములు కలిగి నప్పుడు దాతలవల్ల విరాళముల సంపాదించియు పీఠమునకు తోడ్పడుట యొక విధానము. భరతఖండమున దాతలకు కొదువలేదు.

కార్యము యొక్కయు, కర్తల యొక్కయు అర్హతను బట్టి ధనసహాయము లభించుచునే యుండును. నిరంతరమును దేశమున నేన్నెన్నియో సంస్థలు తలనెత్తుచున్నవి. వృద్ధిచెందుచున్నవి ఒకవేళ కొన్ని క్షీణించినచో కర్తలయొక్క లోపమేకాని దాతల యవితరణ చేతగాదు. దేశములో అనేక కళాశాలలు, మఠములు, రామకృష్ణ పరమహంస మున్నగు వారి మందిరములు, వివిధ జ్ఞానభక్త సమాజములు పుట్టివృద్ధినొందుచున్నవి. అయితే ఆయాసంస్థల యందు ప్రజా బాహుళ్యమున కాదరము కలిగియుండ వచ్చును. అట్టి ప్రజాదరము మన పీఠము నందును కలుగదని యనజాలము. ఎందరు శైవ వైశ్యులు దేవాలయ, సత్ర, విద్యాసంస్థల నెలకొల్పి భూరి విరాళముల నిచ్చియుండలేరు. శివ క్షేత్రములలో శైవ వైశ్యుల భూరి విరాళముల వలన నెంతటి ఆలయ గోపుర, ప్రాకార, సత్ర. వాహనాలంకార మహోత్సవములు జరిగి యుండుటలేదు? కాని పూర్వుల ప్రతిపలను సార్థకపరచు ప్రణాళికలు గాని ఉత్తరోత్తరాభివృద్ధి నొందించు కృషిగాని కాన్పించదు. కొన్ని నిర్మాణములు, వసతులు, శైవమతోద్ధరణ కుద్దిష్టములైనవి. శైవ పీఠాభివృద్ధి ప్రణాళికల కనుకూలముగా సరిదిద్ది ఆయా విధానముల నన్వేషింప వలసి యున్నది. ఆ కృషికి గ్రామస్థులు పడికట్టుగా పూనుకొని సంఘముగా నేర్పడి నిర్వహించినచో పీఠమునకు గొప్ప మూలధనముగా నుండకతప్పదు. అయితే యిట్టి సంఘకార్యములలో వ్యక్తి భేదములతో కాని, వ్యక్తుల లాభనష్టములతో కాని, వ్యక్తుల యభిరుచులతో కాని, సంబంధ ముండ కూడదు. అట్టి సమిష్టి భావమే మన మీనాడు నేర్వ దగినది. అందరు నేకీభవించి కృషి చేసిననాడు శైవ పీఠమునకు నిర్మాణాత్మకమైన నూతన శాఖ లేర్పడక మానవు. సంఘీయు లెక్కడనో లేరు. ఎవరో కారు. ప్రతిబట్టణవాసులును. పల్లెటూరివాస్తవ్యులును ఉద్యోగస్థులును, వ్యాపారస్థులును సంఘీయులే. ఒక్కొక్క గ్రామము లోని ప్రతివారు ఒకసంఘముగా చేరి తమ గ్రామములోని ప్రతి యాస్తికుని, దాతను, ప్రోత్సహించి బహువిధ పీఠ కార్యక్రమ వికాసమునకు వలయు భూరివిరాళములను సంపాదించుటకు పూనుకొన వలయును. సంఘకార్యమునకై చేసిన యెట్టిసేవయు గౌరవప్రద మేయగును—

# శ్రీశైల భ్రమరాంబాదేవి మంటప ద్వారమునకు కవచాలంకరణ

## మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారిచే ప్రారంభోత్సవము

## పీఠాధ్యక్షులు శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

శ్రీ శార్వరినామ సం॥ మాఘ బహుళ చతుర్దశి మహాశివరాత్రినాడు శ్రీశైల మందలి శ్రీ భ్రమరాంబాదేవి యంతరాళ మండప సింహ ద్వారమునకు శ్రీదేవి యవతారముల చెక్కడము కలిగి పదిహేను వందల రూపాయల వ్యయముతో, శ్రీ పండితారాధ్యుల పట్టైన లింగారాధ్యుల గారిచే బహు రమ్యముగా తయారు చేయించబడి, వేయించిన యుత్సవి తోడు గునకు ఆంధ్ర ప్రదేశ దేవాదాయ ధర్మాదాయ శాఖా మంత్రులు శ్రీకల్లూరి చంద్రమౌళి గారిచే ప్రారంభోత్సవము చేయబడెను. మరియు శ్రీశైల మల్లికార్జున స్వామివారి కల్యాణోత్సవాది కార్యముల జరిపించు చున్న శ్రీపతి పండితారాధ్యుల పట్టైనలింగా రాధ్యులవారు ప్లవ సం॥ వైశాఖ పౌర్ణమినాడు శ్రీ భ్రమరాంబాదేవికి నిత్యపూజలకు గాను మోటకార్తి మొదలు కుంభహార్తి- నక్షత్రహారము వరకు వెండి హారతులు చేయించి యున్నారు. ప్రతి నెల, సోమ, శుక్రవారము' లందును, మాస శివరాత్రి పూర్ణిమ లందును దాదాపు పది కల్యాణోత్సవములు వారిచే జరిపించ బడు చున్నవి. పండిత త్రయములో పేరెన్నికగన్న, శ్రీపతి పండితుడు, అనంత భూపాలునకు గురువై విజయవాడ యందు "శమీశాఖక శిఖాపట నిరుద్ధ జాత వేద ప్రమాణ" యను బిరుదమును ధరించి ఆరాధ్య శైవమును ఆంధ్ర దేశము నంతటను ప్రచారము జేసెను. నేటికిని శ్రీపతి పండిత మఠము శ్రీశైలమున గలదను మాటకు పండితారాధ్య చరిత్రయే తార్కాణము. పండితుని విషయము పల్లకేతు భూపాలుని శిలా శాసనములో ప్రకటింప బడినది. South Indian Inscriptions Volume X Page 8 లో నెం॥ 22.

మల్లేశ్వర ఇతిఖ్యాతః సన్నిధత్తే మహేశ్వరః
శ్రీ విజయ వాటికాఖ్యే పురే కృష్ణా విభూషణే
తతశ్శ్రీ పండితారాధ్య నామ్నా భక్తోత్తమేన చ
శివభక్తా ఏవ నూనం దేవర్షి భ్యోధికా ఇతి.

చీనాంబరేగ్నిం సంస్థాప్య శమీకోమలశాఖయా
బద్ధే మల్లేశ్వరః ప్రీతః ప్రత్యక్ష స్సమజాయత,

అని 25 పంక్తులు చెక్కబడి యున్నది. ఏత ద్వంశీయులే శ్రీశైలము నాది నివాసముగా జేసికొని శ్రీ భ్రమరాంబా మల్లికార్జున స్వామి వారి యాలయమున నాచార్య స్థాన పట్టభద్రులై కల్యాణోత్సవ ప్రతిష్ఠాది కార్యముల నెరవేర్చు చుండిరి. ఇంతియె గాక "శ్రీ గిరిస్థ శ్రీ శివానంద భగవత్పండిత మఠాధికారులు॥ ఇత్యాది బిరుదాంకిత శ్రీపతి పండితారాధ్యుర శివానంద శాస్త్రిగారు బహుళముగా శైవప్రచారము జేసినారు. తరువాత వారి వంశీయులైన శ్రీ పట్టెస లింగారాధ్యుల వారున్ను, బహు వ్యయ ప్రయాసల కోర్చుచు పండితారాధ్య మఠములో నివసించు చున్నారంటే శ్రీశైలమారాధ్యులకు మూలస్థాన మగుటయు, మల్లేశ్వరుడు వారి కులదైవ మగుటయు—వారి జన్మాంతర సంస్కారమున్ను, హేతువు లనవచ్చును.

"శ్రీపతి పండితారాధ్య మఠము" నాది నుండియు ఆరాధ్య బ్రాహ్మణులదేనని తలంచ బడుచు వెళ్లిన యాత్రికులు అచ్చట నివసించు చున్నారు.

శ్రీశైలమున నొక సత్రము గట్టవలయునని గత సంవత్సరమున కొంత ప్రయత్నము జరిగినది. కాని అది పూర్తి కాలేదు. క్రొత్తవాటిని కట్టినను కట్టకున్నను మన కిదివరలో నున్న పాతదైన, శ్రీపతి పండితారాధ్య మఠమును, శైవులు పునరుద్ధరించుకొనినచో నా మఠము యథా పూర్వముగా దిగంత వ్యాప్తమగు కీర్తితో వెలయు చుండునని మా యాశయము.



శివాయ గురవే నమః

# ఉదాహరణము

## మల్లంపల్లి వీరేశ్వరశర్మ

ఆశు, మధుర, చిత్ర, విస్తరములను, చతుర్విధ కవిత్వములలోనిది మధుర కవిత్వమునకు సంబంధించినది. ఇందలి వృత్తములగు చంపకోత్పల శార్దూలమత్తేభాదులు—మార్గకవిత్వమునకును, నవవిధ రగడలలో జేరిన కళికోత్కళికాదులు మాత్రాప్రధానములై దేశికవిత్వమునకును సంబంధించినవి సామాన్యముగా మార్గకవిత్వము సాహిత్యప్రధానము. దేశికవిత సంగీత ప్రధానము. కావున నిది మార్గదేశికవితలయు, సాహిత్య సంగీతములయు కలయిక యని విమర్శకుల అభిప్రాయము.

జగమంతయు, క్రియాత్మకము. సమస్తక్రియలు పరమేశ్వరుని వలన నేర్పడి, మఱలనందే లీనమగుచున్నవి. ఈక్రియలకట్లు సమన్వయించుటలోగల విభేదములే కారకములు. అవి కర్తృ, కర్మ, కరణ, సంప్రదాన, అపాదాన, అధికరణ భేదములచే నాఱువిధములు—ప్రాతిపదికార్థ లింగపరిమాణాదులందుఁ బ్రథమయు—అందుండి సంబోధన ప్రథమయునేర్పడి, మొత్తమెనిమిది విభక్తులు కలిగినవి. పరమశివుని శరీరము లెనిమిది. ఒక్కొక్క విభక్తియు, ఒక వృత్తము, కళిక, ఉత్కళిక, అనువానిచే ముమ్మాఱు గీర్తింపఁబడుటచేఁ బరమశివుని శరీరాష్టకమునందుఁ ద్రికరణశుద్ధిగా సకలక్రియలసమర్పించి చేయు పూజావిధానమున కిది యుదాహరణమగుచు దీని నామము సార్థకమగుచున్నది.

సోమనాథుఁడు సంస్కృతమున రచించిన బసవేశ్వరోదాహరణము నేటి యుదాహరణములకెల్ల మొట్టమొదటిగా గన్పించుచున్నది. రావిపాటి తిప్పనవ్రాసిన త్రిపురాంతకోదాహరణము తెలుఁగునసుప్రసిద్ధము-వీరిరువురును శివభక్తులే. విభక్తికి మూఁడేసి పద్యములుగా నెనిమిది విభక్తులందును గలిపి ఇరువదినాలుగు పద్యములగుచున్నవి తరువాతిదగు సార్వవిభక్తిక పద్యముతో నుదాహరణము పూర్తియగుచున్నది. మొత్తము ఇరువదియైదుపద్యములు పరమశివుని పంచవింశతి లీలలను సూచించుచున్నవి, కావున నిది శివకవుల యుపజ్ఞయనుట నిర్వివాదము,

సంస్కృతమున షష్ఠీవిభక్తికిఁ జాలయర్థములు గలవు. తెలుఁగునఁగూడ నన్నయభట్టారకుఁడే. షష్ఠీవిభక్తి ప్రత్యయమగు "కు" అనుదానిని, ద్వితీయ, తృతీయ చతుర్థి, పంచమి, సప్తమి-అనువాని స్థానమునందును బ్రయోగించి నాఁడు. కాఁగా గ్రంథము నంకితము చేయునపుడు వ్రాయవలసిన యుదాహరణమునకు బదులుగా తెలుఁగున షష్ఠ్యంతము లేర్పడినవి వీనిని దొలుతగా నన్నెచోడుడు కుమారసంభవమున రచించెను.

ప్రకృత మీ వీరభద్రోదాహరణము-వీరభద్రా రాధనమున మిక్కిలిగా నుపయోగించును. వీరభద్ర పళ్లెముపట్టు సమయమున-ఖడ్గములుగాఁ జదువుటకు కిందలి రగడలు చాల ననుకూలముగానుండును. భక్తమహాజను లీవిషయమును గురుతించి యిందలి గుణమును గ్రహించునెడల నాప్రయత్నము చరితార్థము కాఁగలదు.

శివమ్.



# శ్రీ వీరభద్రోదాహరణము

## ప్రథమా విభక్తి

శా॥ 1. శ్రీ కల్యాణ గుణామృతాంబుధి కృపాస్నిగ్ధాంతరుం డాశ్రితా
నేకార్థప్రద దివ్యవీక్షణుఁడు, భగ్నీభూత దక్షాధ్వరుం
డేకాధీశ్వరుఁడేకవీరుఁడు, మునిధ్యేయుండు శ్రీభద్రకా
శీకాంతుండగు వీరభద్రుఁడు సిరుల్ చేకూర్చి రక్షించుతన్.

### కళిక - జయభద్ర రగడ

2. ఆదిమత్స్యము రేఖ లదలించి కదలించి
యాదికూర్మము మించు నడుగుఁ దమ్ములవాఁడు
ఆది కిరి దంష్ట్రికాహారి జంఘాయుగీ
ప్రాదికిటి ఘోణతటదంక శోభల వాఁడు
భగ్ననరసింహావలగ్న లక్ష్మి పునః
ఫలితాత్మవక్షః కవాట ఫలకమువాఁడు
భుగ్నత్రివిక్రమప్రోత్థ కంకాళ వి
స్ఫురితదంష్ట్రి భోగిముఖ హస్తముల వాఁడు
నందీశ్వర కకుజ్జనక దంసముల వాఁడు
నాగేంద్ర బంధసుందర కర్ణముల వాఁడు
స్పందిత సుదర్శన శ్లథితశార్ఙ్గ ప్రభా
జాగ్రదక్షి భ్రువోదగ్ర వక్త్రము వాఁడు
స్వధితి ప్రభాచ్ఛటా ప్రౌఢనాసిక వాఁడు
పరమేష్ఠి సృక్స్రువప్రభ వోష్ఠముల వాఁడు
విధివీతిహోత్రగృహ విభ్రమాస్యము వాఁడు
వియదభ్ర విభ్రమ తప్పృథు జటాభృతి వాఁడు

### ఉత్కళిక - ద్విరదగతి రగడ

3. హసియించి హసియించి యభ్రకాంతుల చాలు
గ్రసియించి గ్రసియించి కలువపూవుల డాలు
విహసించి విహసించి వెన్నునిమెయి ఠీవి
ప్రహరించి ప్రహరించి ప్రదళితేంద్ర మసావి

హరియించి హరియించి యంబుదాసుల ప్రోల్పు
విరచించి విరచించి వేయిఁగన్నుల వేల్పు
లడర నెందఱనేని నలరు తనుము[ద్రుం]డు
ఖల కాలరుద్రుండు-ఘన వీరభద్రుండు.

## ద్వితీయా విభక్తి

మ. 4 ఛలిత క్రుద్ధదధీచినందన తపస్సంతుష్ట రుద్రాక్షిభూ
జ్వాల నశుద్ధ సమస్త దేవగణ రక్షాదాన లీలారతిన్
విలసద్గౌతమ కన్యకా హృదయధాని, న్నిండుకొల్వున్న, మ
త్కుల దైవమ్మును బట్టిసప్రభుని గొల్తున్, వీరభద్రేశ్వరున్.

## కళిక - తురగ వల్గనము

5. ధృతిశీలున్ ధృతశూలున్, దృత హేలుఙ ద్రుతకాలున్
శ్రితపాళీస్తుతి లీలాస్మితలక్ష్మీవృతఫాలున్
రుడ్భుగ్నీ కృతఫాలున్, లుఠితద్రుహిణ కపాలున్
ద్విడ్భుగ్నీ కృతిలోలున్, దిగ్ధిక్కృత సురపాలున్
శ్రితరక్షా ధృతదీక్షా, కృతశిక్షాదృతదక్షున్
దిత కుహనా హర్యక్షున్, దృప్యన్మతి హర్యక్షున్
గళితబ్రధ్న రదాంఘ్రిన్, ఖండితవాయు కరాంఘ్రిన్
లలిత మనోంబుజ లీలా లాలితభూమిరథాంఘ్రిన్.

## ఉత్కళిక - హయప్రచారము

6. శతరుఘపమై శ్లథిత మిషా
కిటిరదనము గిళిత మృషా
హరి రదనోద్ధత కదనము
హరశూలోదయ సదనము
స్వరుగుదిత స్వరుచక్రము
పరిభావిత భవిచక్రము
కరవాలము గైకొనుపతి
సురవారము చొచ్చిన గతి

## తృతీయా విభక్తి

శా. 7. హేరంబోద్ధిత హస్తసన్నిభ భుజాహిగ్రస్త సౌపర్వణ
శ్రీ రాకేందునిచేతఁ దీర్ఘపటలీ శ్రీజన్మ పాదాంబు రుట్
ధారానమ్ర పునఃపవిత్రము రజితప్పర్యంకుచేతన్, గృపా
ధారా స్వర్ధుని తాళువాయినిగమాస్థానీ సుఖాసీనుచేన్.

## కళిక - తురగ వల్గనము

8. భద్రుచేత, రుద్రుచేత, భావుకామరుద్రు చేత
కాద్రవేయ హారవార కలితకాల రుద్రుచేత
హారిచే, విహారిచే, నతారిచే, కుతారిచేత
వీరుచే నుదారుచే, గభీరుచేఁ బ్రధీరుచేత
దానిచే నిదానిచేఁ బ్రధానిచే సుధానిచేత
జ్ఞానిచేత మౌనిచేత, సర్వసుగుణ ధానిచేత
లలిత లలిత జలద రుచిర లసితతను సముద్రుచేత
విలయదహన విజయినయన విజయ వీరభద్రుచేత,

## ఉత్కళిక - హయప్రచారము

9. వాణిముక్కుఁ జెక్కిచెక్కి
యేణధరుని ద్రొక్కిత్రొక్కి
రవినిబండ్లు రాలఁదన్ని
దివిని భువిని దెఱలుతన్ని
లింప పతుల లెంపలోడిచి
పంపుమిగులఁ బగులనడిచి
తాతనేలు త్రాతచేత
మాతృభక్తి మాతచేత.

## చతుర్థి

మ. 10. అరవిందాసన మూర్ధభేదికయి త్రయ్యర్థైకసంవేదికై
దురితారణ్య మహోగ్ర కీలికయి, యందూబద్ధ లేఖాళికై
చరణాలంకృత విష్ణుచక్రునకునై సారాంగద చ్ఛక్రికై
కొఱవిన్నిల్పిన వీరభద్ర విభుకై కోదండ దోర్దండుకై.

## కళిక - ద్విరద గతి

11. వీరభద్రునికొఱకు విపులరౌద్రుని కొఱకు
వైరినాశను కొఱకు, ఫలిత భద్రునికొఱకు
ఘనునికై సర్వలోక భయంకరుని కొఱకు
ననఘుకై వరదుకై యభయంకరుని కొఱకు
భీమవేషుని కొఱకు విబుధభూషణు కొఱకు
శ్యామలాంగుని కొఱకు సకల పోషణు కొఱకు
విజయ దాయకుకొఱకు విధివిష్ణుహరునకై
త్రిజగతీ భరణైక దీప్రనిజ కరునకై.

## ఉత్కళిక

12. శ్రీ భద్ర కాళికా
సౌభాగ్య మాలికా
ప్రథమాన మధుమాన
విధుహాసి దరహాస
నవసుధా సేవనా
కవితా విభావనా
మధురావతారుకయి
పృథుదయా సారుకయి.

## పంచమి

మ॥ 13. భరితోత్సాహత గౌతమీ తనయ, ప్రాగ్వారాశిఁ గై సేయుచే
గుఱిగానిల్చి, సమస్త భక్తజనతాగోరాశి వారాశిఁగ్రగ
చ్ఛఱనిట్టింకు లొనర్చి యెల్లప్పుడు వాంఛాసిద్ధు లందించుచున్
మురమళ్ళంగల వీరభద్రువలనం బుట్టెన్ జగద్భద్రముల్.

## కళిక - హరిగతి

14. పది రెండిండుల నొదిగిన హయగతిఁ
బడనడచిన గుణభద్రుని వలనన్
మది రెట్టించిన హయవల్లన గతి
మదమడచిన బలభద్రుని వలనన్

చఱచఱ జెచ్చిన జయమంగళ గతి
చదలంటిన భుజసారుని వలనన్
ద్విరదగతులఁ బదిదెసలను జెచ్చిన
వికలించిన రణవీరుని వలనన్
మఱిమఱి తెచ్చిన మసలక కసిమసి
మడియించిన జయభద్రుని వలనన్
హరిగతి నెగయుచు హరిదంతమ్ముల
నదలించిన పదముద్రుని వలనన్
మధురగతులతోఁ బదియాఱు కళల్
మఱిమఱి గ్రోలిన ప్రమథుని వలనన్
విధురాకడలై వెతపోకడలై
వెడలెడు చూపుల సురధుని వలనన్.

## ఉత్కళిక - మధుర గతి

15. వారిణగతింజను హరిహయు వెంబడి
పరువులుడిపి, వెఱవారల పైఁబడి
కసిమసఁగిన వృషగమనము మెఱయఁగ
దెసలెల్లెడఁ దనతేజము మెఱమఁగ
రణగుణ రవములు రగడలఁ బొగడఁగ
ఘణఘణ రవములు ఘంటల నిగుడఁగ
భయము లడంచెడి భద్రుని వలనన్
జయ భద్రములిడు శరభుని వలనన్.

(సశేషము)

# లింగధారణ దీక్షా ప్రదానము

నేటి శైవ యువకులలో కొందరికి లింగధారణ చేసికొనవలయు నన్న యభిలాష మిక్కుటముగా నుండియు దానికి తగిన పరిస్థితులు అనుకూలించక విచార పడుచున్న విషయమును శైవపీఠమువారు గ్రహించి శైవ పీఠము తరపున అట్టి కార్యము నెరవేర్చినచో చాలామందికి ఉపయోగపడు నన్న ఉద్దేశముతో శార్వరినామ సంవత్సర మాఘ మాసమున సికింద్రాబాదు నందలి శంకరమఠమున లింగధారణ జరిపించుటకు నిశ్చయించి యుంటిమి. అందులకు ఉత్సాహముతో విచ్చేసినయువతీ యువకులు పన్నెండుగురికి ఉచితముగా పీఠాధ్యక్షులచే దీక్ష యిప్పించబడెను. ఈ మహోత్సవ సందర్భమున విందు యేర్పాటులు సికిందరాబాద వాస్తవ్యులు శ్రీ ముదిగొండ రాజయ్యగారు భరించిరి. శైవ మహాపీఠ కార్యక్రమములలో లోగడ ఇతర సందర్భములలో వలెనే ఆసక్తి వహించి శ్రీ ముదిగొండ మల్లయ్యగారు శ్రీ శంకర మఠములో వలయు సౌకర్యములను ఉత్సాహముతో సమకూర్చిరి. విజయవాడ కేంద్రములో కూడా ఈ విధముగానే లింగధారణముల యేర్పాటు శ్రీ శైవలెంక బసవయ్యశాస్త్రి, ఎడ్వొకేటుగారు ఏర్పాటు చేయగలరు. మరియు ఇంకను లింగధారణ కావలసినవారు చాలమంది ఆ యా ప్రాంతముల యందు కలరని వినుచున్నాము. ఇందుకు కొంతమంది చేరి ధారణ కావలసినవారి వివరము మాకు తెలిపినచో అట్టివారికి వీలుపడునట్లు అనువైన కేంద్రములలో పీఠము తరపున కలశ స్థాపన చేయించి అట్టి కార్యము నెరవేర్ప గలందులకు సంకల్పించనైనది. కావున శైవారాధ్యులు ఇట్టి సదవకాశమును వినియోగించుకొన గలరని కోరడమైనది.

ఇట్లు

శైవమహాపీఠ కార్యవర్గము

# కిరాతలీల

విద్వాన్ బి. చిదంబరశాస్త్రి

(గత సంచిక తరువాయి)

[ధర్మరాజు ఏకాంతమున నున్న యర్జునునితో కర్తవ్యమును గుఱించి పలుకుచున్నాడు.]

పార్థా! భీష్మద్రోణులు రణరంగమున శస్త్రవిహారులై యుండ కర్ణ సంరక్షితుడు దుర్యోధనుడు భీమునకు చేజిక్కకుండును. సర్వథా మన హక్కుభుక్తమగు రాజ్యమును పరిపాలింప బూనకుండుట ధర్మ విరుద్ధ మగునుగదా! ఎవడు ధర్మాచరణయందు విముఖుడై యధర్మప్రవృత్తుడగునో వానిజన్మ పశుపక్ష్యాదులనుండి విశేషించదు. ఆర్షప్రోక్తమైన ధర్మమే విజ్ఞాన ఖనియగు మానవునకు సదా అనుసరణీయము. నిష్కళంక జీవితులగు మహర్షులు ధర్మరతులౌటనే దివ్యయోగమున నేటికిని చిరంజీవులై శాపానుగ్రహశక్తులౌచు దేవతలకంటెను పూజ్యులగుచున్నారు. ఇట్టి నిస్వార్థ పరులు లోకకల్యాణము నపేక్షించి స్వానుభవముతో మానవతా కర్తవ్యము నుద్బోధించిన దానిని శంకించువారు ఉన్మత్తులు కాక మఱెవ్వరు? ఫలితాఫలితముల నపేక్షించక ధర్మరతుడైనవానికి ఒక్కొకపుడు విరుద్ధ ఫలితములె యాభాసించ వచ్చును. అంతమాత్రమున నీరస పడరాదు. చూడు కుమారా! నాడు మనము ధర్మనిరతులమై ప్రజా పరిపాలనము నొనర్చుటకు రాజ్యమధిష్ఠించి యుండ ద్యూతక్రీడకు కౌరవులచే నాహ్వానింపబడినపుడు నిరాకరించుచో మన యసమర్థత ప్రకటిత మయ్యెడినిగదా! జూదపువ్యసనము సకలానర్థ హేతుక మగుట సమర్థనీయము కాదందువేమో! రాజ్యపదస్థుడైన క్షత్రియ వీరునకు బహు ప్రాణి నాశకమగు యుద్ధ తంత్రము మాత్ర మెట్లు ఆచరణయోగ్యమయ్యెను. సూక్ష్మకాల పరిమితమైన యైశ్వర్యమున సుఖపడుదునని యాసించిన కురురాజు శాశ్వతమగు నపకీర్తిని యూహించకుండుగాక. అనంతవిశ్వమున అజరామరకమగుకీర్తి సామ్రాజ్యము నేలదగిన మనము అధర్మమున నెట్లు ప్రవర్తింతుము. అది మోసమే యగుగాక, సకలము పణముగానొడ్డి పరాజితులమైనపుడు దాని నంగీకరించకుండుట బహుదోషము. ఇక ద్రౌపదీ విషయ మందువా! ధర్మబంధనములచే మనల అసమర్థులనుగా నొనర్చి అసహాయురాలగు నొకయబలను, అందును, మాతృసమానను,ధర్మవృద్ధులముందు కొంచ

పరుచ జూమటచే దుర్యోధనుడే యిందు పరాభవింపబడెను. ఇట్లు రాజ్య కాంక్షచే సర్వమునకు తెగించిన ధార్తరాష్ట్రుడు ఎప్పట్టుననుతనజీవితమున మనభాగము నొసంగుటకు నియ్యకొనడు. అట్టితరి మనకు యుద్ధమనివార్య మగును. బహుప్రమాదగర్భితమై రణరంగమున నప్రమత్తుడైన వానికే విజయ లక్ష్మి చేకూరును. ఇందుకు నీయసాధారణప్రజ్ఞావిషయమున నాకెట్టి శంకయు లేదు కవచ కుండలములతో సహ జనితుడగు కర్ణుడును, స్వేచ్ఛామరణుడైన భీష్ముడును,అసామాన్యుడైన ద్రోణాచార్యుడును, నీచే జయింపదగినవారు, నీకుతోడు దివ్యాస్త్ర సంచయము గల్గిన నీవిజయ పరంపరకు తిరుగులేదు. తొల్లి వ్యాసభగవానుని యనుగ్రహమున బడసిన మహామంత్రమ్మును నీకిదే యుపదేశించుచున్నాను. దాని ప్రయోగమున సకలప్రపంచము ప్రకాశించును, ఇటు నుత్తరదిశ ననుసరించి గంధమాదనమును దాటిపోవ ఇంద్రకీల మహా పర్వతము కలదు. కవచ సంరక్షితుడవై ధనుర్ధారివయ్యు సాధుశీలంబున మునివై యతిరహస్యముగా నమ్మహా పర్వతంబున ప్రవేశించుము అచట నమ్మహామంత్రము సాధనముగా నుగ్రతపస్సున మహేంద్రుని యనుగ్రహ మును సంపాదించుము. పూర్వము వృత్రాసురునిభయమున లోకపాలుర మహాస్త్రంబులెల్ల యాతనికడ దాచబడియుండెను, అట్టి యస్త్రసర్వస్వమును ఒక్క దేవేంద్రునివలన పొందగలవు— ఇదిగో, విశ్వాధి నేత్ర్యత్వంబున రేయెల్ల వెలిగిన మృగాంకునికళ మబ్బుపట్టి పోవుచుండ నుదయాద్రినుండి తన యరుణ కిరణప్రసారమున లోకజాలమునకు మహోదయము నొసగుప్రభాకరుడు ఉషః కాలమును సూచించుచున్నాడు. ఇది యెంతయు శుభ సూచకము—— వెంటనే సర్వసన్నద్ధుడవై నేడే పయనించుమని కర్తవ్యము నుపదేశించి ధర్మరాజు వెడలిపోయెను...

అర్జునుడును యుధిష్ఠిరునకు గల అతి సూక్ష్మములైన ధర్మములు నిర్వ ర్తించుటయందలి యాసక్తియు, శాంతస్వభావమున నప్రమత్తతయు, రాగల దాని నూహించి దానికిందగు సాధనసంపత్తిని సాధించుటయందలి కుశాగ్ర బుద్ధిశాలితయు,నుద్రేక పరచుచుండతనకు సంక్రమించనున్న లోకాతీత భాగ్య విశేషమునకు నుప్పొంగి వెంటనే ప్రక్కనున్న సరస్వతీ కూలమునకేగి యందు సుస్నాతుడై నిత్యకృత్యముల నెరవేర్చుకొని తనకై యెదిరిచూచు చున్న ధర్మరాజాదులను చేరికొనెను, దివ్యదీక్షా ప్రభావంబున ప్రాభాతిక కాంతులచే ప్రకాశించు నుదయ భాస్కరునివలె తేజోవంతుడగు పాండవమధ్య ముని జూచి యత్యుత్సాహమున భీముడిట్లు పలుక నారంభించెను. "తమ్ముడా ఫల్గుణా, మన యగ్రజుడు ధర్మవాది యగుట అదినిమిత్తముగా మనము చూచు చుండగానే మన సర్వస్వమును దుర్యోధన పాతకుడు బలీయములగు సింహముల నోటనున్నమాంసమును నక్కవలె అపహరించెను. బలహీనములగు

మృగములవలె దుర్బలులమై మనము జీవితావధి అడవుల గడుపవలసినదేనా? ధర్మజుడు కేవలధర్మము నాశ్రయించి ధర్మ కామములకు మూలమైన అర్థ మును త్యజించి దుఃఖించుచున్నాడు. ఎవనిధర్మము తనకు తనవారికిని బాధా కరమై,ధర్మసాధనమునకు ధర్మమే ప్రధానమని యెంచబడుచున్నదో వాడు సూర్యుని తేజస్సును చీకటివలె ధర్మరహస్యార్థము నెంత మాత్రమును తెలిసి కొననేరడు. ఎవని యర్థము స్వార్థమునకై యెంచబడుచు ధర్మకామములను త్యజించునో, ఎవడు ధర్మార్థములను స్వీకరించక కేవల కామపరతంత్రుడై చరించుచున్నాడో వాడు శుష్కించిన హ్రదమునందలిచేపవలె నశించు చున్నాడు కావున పండితు డెప్పుడును ధర్మార్థములను పరిహరించలేడు. కామమున కారెండును ఇంధనమున కరణివలె ప్రకృతిసిద్ధము. అటులనే ధర్మ మునకు అర్థమును, అర్థమునకు ధర్మమున్ను మేఘంసముద్రములవలె అన్యోన్యా శ్రితములు. ఈమూడింట నేయొక్కదాని నాశ్రయించి తక్కురెంటిని త్యజిం చిన వానికి శ్రేయస్సునులేదు. మఱియు దానము, యజ్ఞము, సత్పురుషసేవ, ఆర్జవము మొదలగునవి గదా ధర్మవాచ్యములగు చున్నవి. మహైశ్వర్యమున సాధ్యములగు వీనిని ద్రవ్యవిహీనుడు ఎట్లు సాధించనేర్చును, అట్టివిత్తమును క్షత్రియవీరుడు భిక్షాటనచేతగాని, సేవకావృత్తి చేతగాని పొందనేరడు. క్షాత్రవీర్యమున శత్రుబాధాకరుడై ప్రజా పరిపాలన మొనర్చువాడు స్వీయ కిరణముచేత ప్రజలను పరితపించి, పరి పోషించు సూర్యునివలె తేజోవంతు డగుచున్నాడు. మన సత్యపరిపాలన మనుదానిచే తెచ్చికొనిన యలసత్వ మును చూచి శత్రువులు, అందును కౌరవులు మిక్కిలి పరిహసించుచున్నారు, ద్రౌపదీ శరణ్యమున దాస్య విముక్తులమై పదిరెండేడులు అరణ్యమున గడువ నజ్ఞాత వత్సరమును పట్టువడి యథాపూర్వముగ జీవించవలసినదేనా! మనలను దాచికొనుటయన ముష్టిప్రమాణమగు తృణముతో హిమవత్పర్వతమును గప్పజూచుటయగదా! అదియట్లుండె, తొల్లి రాజసూయాది యాగములకైన ద్రవ్యార్జనమునకు మనచే పరాజితులైన రాజవర్గములు మనవలనిరానున్న యాపత్తును శంకించు దుర్యోధనునిచే విశేషముగా సన్మానితులగుచు నవసర మున నాతనికిప్రాణములు నర్పించుటకును సిద్ధపడుచున్నారు. ఇట్లు కుతం త్రముల నెన్నియేని బన్నుచు మనః ప్రాణములుకూడా హరించుటకుయత్నించు చున్న దుర్యోధనమాయావిని హతమార్చినాడు గాని నాయాత్మ శాంతిం చదు. జగదేకవీరా, సోదరా, అప్రతిహతతపో నిష్ఠచే దివ్యాస్త్ర సంచయ మును కొనితెచ్చి శత్రుసంహారమున లోక కల్యాణమును సాధింతువుగాక'' అని భీముడు తనకు సంక్రమించిన విసంకటవృత్తులనుండి తొలగి పోవుటకు వలయు పరికరములను తేనున్న యర్జునునితో పలికి మిన్నకుండెను.

(సశేషము)

# నన్నెచోడుని పార్వతీ పరిణయ వర్ణన

భాషాప్రవీణ శ్రీ అమరేశం రాజేశ్వరశర్మ M. A.

"వివాహేస్నాన శుభ్రాంగ భూషాలూలు త్రయీరవా
వేదీసీమంత తారేఖాలాజా మంగళ వర్తనమ్."

శివపురాణయమునందుఁ బార్వతీ పరమేశ్వర వివాహమహోత్స వము పదునెనిమిది యధ్యాయములచే విపులముగా వర్ణింపబడినది. కాళిదాసీయ కుమార సంభవము నందును నేడవ సర్గమున గిరిజా వివాహము మనోహరముగా వర్ణించఁబడినది. నన్నెచోడ మహాకవియు పార్వతీ పరిణయమును రెండాశ్వాసములలో విపులముగా వర్ణించినాఁడు అయినను. నీ ముగ్గురి యీ వర్ణములందుఁ గొంత భేదము గలదు.

శివపురాణమునఁ బార్వతీ వివాహ సందర్భమును బురస్కరించుకొని పతివ్రతా ధర్మబోధ గావించుటకలదు. అంతేకాక మఱికొన్ని యుపాఖ్యానములును నందు వర్ణింపఁ బడినవి. అది పురాణ గ్రంథమగుటచే యుక్తమే. కడమ వివాహ విషయములు శివ పురాణమునందు వైదిక వివాహమును వివరించు విధముగా నున్నవి. అయినను లౌకికాచారములును గొన్ని లేకపోలేదు. కాళిదాస మహాకవియు నీ వివాహమును వైదిక మార్గంబుననే జరిపించినాఁడు.

నన్నెచోడుని వివాహ వర్ణనము వీనికిఁ గొంచెము భిన్నముగా నున్నది. ఇది యవైదికము అనలేముగాని వైదిక విషయములు శివ పురాణము, కాళిదాసీయ గ్రంథము లందున్నంత స్పష్టముగా లేవనుట మాత్రము ఉచితము. ఉదాహరణముగఁ గన్యాదాన విషయమును గ్రహింతము. శివపురాణము నందుఁ గన్యాదాన విషయమున శివునిగోత్రమును వంశమును గూర్చిన చర్చ గలదు. అది వైదిక విషయము.

కన్యాదాన సమయమునందు వధూవరుల గోత్రప్రవరలను జెప్పి ధారాపూర్వకముగా దానము చేయుట వైదికపద్ధతి. కన్యాదానమునకుఁ

పిమ్మట గృహ్యాగ్ని ప్రతిష్ఠ మొనర్చుటయుఁ దత్ప్రంప్రధానయమే. ఇవియెల్లో శివ పురాణమునందు వర్ణింపఁబడినవి, కన్యాకరగ్రహణమయిన పిదప శివుడు—

"క్షితిం సంస్పృశ్య కామస్యకో దాదితిమనుం మునే
పపాఠ శంకరః ప్రత్యాదర్శయన్ లౌకికీం గతిం"

అని చెప్పబడినది. ఇదియులోకమునఁగల వైదికాచారమే. ఈ సమయమున వరుడు చదువ వలసిన వేద మంత్రమిది:

"సోమోఽదద ద్గంధర్వాయ గంధర్వోఽదద దగ్నయే
రయించ పుత్రాంశ్చాదాదగ్ని ర్మహ్యామథో ఇమాం"

ఆ పిమ్మట బ్రహ్మహోయాజ్ఞ గృహ్యాగ్ని ప్రతిష్ఠ జరిగి శివుడు పార్వతీ సహితముగ స్థాలిపాకాది హోమములు నాచరించినాడని శివపురాణము వర్ణించుచున్నది.

నన్నెచోడుని కుమార సంభవమున ఇది యిట్లులేదు. శివుని కన్నముందే పార్వతి వివాహ వేదికకు వచ్చినది. తరువాత శివుడు వచ్చి వివాహ వేదికపై నొక ఆసనమున గూర్చున్నాడు. ఆ పిమ్మట నాతనిప్రక్కన గిరిజ కూర్చున్నది. ఆమె శివునిఁ జూచినది.

"అంత బృహస్పతి దత్త సుముహూర్తంబున ఁబరమేష్ఠి
హోమపురస్సరముగ విధివిహిత విధానంబున గిరిశుండు
గిరిజం ఁబరిణయం బయ్యె."

తరువాత వేదాశీర్వచనము, గంధర్వగానము ఇత్యాదులు జరిగినవి ఇందు కన్యాదానము విధి విహితముగా జరిగెనని యున్నదేకాని విధి వివరింపఁబడలేదనుట స్పష్టముగానే కానవచ్చు చున్నదిగదా!

దీనిని బట్టి చూడగా నన్నెచోడుని పార్వతీ పరిణయ వర్ణనమున వైదికాచారములకన్న దేశీయాచారములకే యెక్కువ స్థాన మీయఁబడినదనియు నందుకే యది మూలమునకు భిన్నముగ నుండుట సంభవించిన దనియుఁ దేలుచున్నది.

ఇఁక నన్నెచోడకవి యిందుఁజూపిన దేశీయాచారములేమో కొంచెము చూతము.

శివుడు పార్వతికి నిజరూపము చూపిన సమయమున చెలికత్తె యామెను విధియుక్తముగా వివాహ మాడవలెనని శివుని వేడుకొన్నది. శివుడందు కంగీకరించి రజత గిరిని చేరుకొని సప్తర్షులను స్మరించి వారిని హిమవంతుని కడకు పోయి కన్యా వరణమును గావించి రమ్మని యడిగినాడు. వారట్లే వెడలి హిమవంతునకు పరమేశ్వరుని కోరిక నెఱింగించినారు. ఇంతదనుక శివ పురాణ కుమార సంభవములందు సమానముగానే కథ జరిగినది. తరువాత కాళిదాసీయమున హిమవంతుడు మేనక ముఖమును చూచినట్లు గలదు.

"శైల స్సంపూర్ణకామోపి మేనాముఖ ముదైక్షత
ప్రాయేణ గృహిణీ నేత్రాః కన్యార్థేషు కుటుంబినః
మేనే మేనాఽపి తత్సర్వం పత్యుః కార్య మభీప్సితమ్
భవం త్యవ్యభిచారిణ్యో భర్తురిష్టే పతివ్రతాః." (కాళిదాసీయము)

కాని మన చోడ కవి కుమారసంభవమున నీ సందర్భమున మేనక ప్రశంసయే కానరాదు. అందుకు కారణము చోడుఁడు రాజగుటయు, రాజుల యిండ్లయందు స్త్రీలు పురుషుల మధ్యకు రాకుండుటయు మన దేశీయాచారము. కాన రాజగు నన్నెచోడకవి యీ సందర్భమున మేనక ప్రశంసలేకుండగనే వ్యవహారములు జరిపెననియూహింప వలసి యున్నది.

అటు పిమ్మట నన్నెచోడ మహాకవి హిమవంతుని యాదేశమునఁ బార్వతి రాఁగా మునులామెను జూచి "ముద్రారోహణ"మును జేయించిరని వర్ణించినాడు. ఈ "ముద్రారోహణము"దేశీయాచారమే కాని వైదికాచారము గాదు. కన్యా నిశ్చయ సమయమున నేదో నొకయాభరణమును గొని వచ్చి యామె కిడుట నేటికి నాంధ్ర దేశమున ఁబ్రచారమునఁ గలదు గదా!

తరువాత శివుఁడు హిమవంతుని పురమునకు వచ్చుటయు, నాతఁడీతని నెదుర్కొని విడిది గృహమునకుఁ గొనిపోవుటయు, వివాహ సమయమున రంభాద్యప్సరసల నాట్యగానములును, వాద్యములును, నివి యన్నియును దేశీయాచారమునను సరించియే వ్రాయబడినవి. శివపురాణము నందున్న లాజాహోమాదులు నన్నెచోడ కుమార సంభవమున విడువఁబడుటకు నిదియే కారణమని యూహింప వలెను.

నన్నెచోడుని పార్వతీ పరిణయము మనదేశమున రాజుల ఇండ్లలో జరిగిన వివాహమువలె దేశీయాచారముల ననుసరించి యున్నదనుట తేలిన సారాంశము.

# కర్తవ్యములు

సంస్థలు సామాజికుల పురోభివృద్ధికొఱ కుద్దేశింపబడిననిర్మాణములై వుండగా సామాజికుల సాహాయ్య సహకారములే సంస్థల పురోభివృద్ధికి మూలాధారములయి వున్నవి. సామాజికులు కార్యకర్తలతోను కార్యకర్తలు సామాజికులతోను పరస్పరము సంప్రతించుటకు పత్రిక ముఖ్య సాధనము. ఇప్పుడు మన 'శైవమత ప్రకాశిక' తిరిగి అవతరించడంవల్ల అట్టి సాధనము లభ్యమైనందున, అట్టి సాధనము సక్రమముగా వినియోగించుకొనుటయున్నూ మనకొక కర్తవ్యమే అయి ఉన్నది. ఈ దృష్టితో మేమిప్పుడు పత్రికా ముఖమున కొన్ని విషయములు ముచ్చటించ దలచినాము.

పీఠము సర్వాంగ సుందరమై సంపూర్ణ ప్రతిష్టత్వము సంపాదించ వలసియున్నది. అందుల కుపయుక్తములగు వివిధ మార్గము లన్వేషింప వలసియున్నది. తగు మార్గములు బుద్ధిమంతులు ఆలోచించి పత్రికద్వారా అందజేసినయెడల పీఠాభివృద్ధికి విశేషముగా తోడ్పడగలదు. సాధ్య యోగ్యములయిన మంచి సూచనలను మన శైవమత ప్రకాశిక ద్వారా మే మాహ్వానించుచున్నాము.

శైవ మహాజనులందరూ గమనింపవలసిన కొన్ని కర్తవ్యముల నిప్పుడు మే ముదహరించు చున్నాము.

(1) శైవపీఠ సభ్యత్వమున కర్హులయిన శైవ మహాజను లందరున్నూ సభ్యత్వ చందాను చెల్లించి వెంటనే సభ్యులుగా జేరుట; సభ్యత్వము ప్రాతిపదికమైన వాక్కుని గ్రహించుట;

(2) 'శైవమత ప్రకాశిక'కు వారి వారి శక్తికొలదిని శైవ మహాజను లందరూ మహారాజ పోషకులు మొదలు సాధారణ చందాదారుల వరకు చేరి, తదితర మహాజనులకు చేర్పించి పత్రికను శాశ్వతముగా పోషించుట;

(3) ప్రతి ఒక్కరున్నూ నెలనెలకు కొంత కనీసపు మొత్తమును నిర్ణయించుకుని పీఠమునకు వ్రతముగా చెల్లించుట;

(4) ఉపనయన వివాహాది సమస్త కార్యములందును ప్రతి ఒక్కరున్నూ వారి వారి శక్తి సామర్థ్యముల ననుసరించి కానుకలు వ్రతముగా సమర్పించుట;

(5) శ్రీ డాక్టరు మల్లికార్జునరావు గారి ఔదార్యము వలన నిరుడు ఇచ్చినట్టి రూ॥ 1000/= (వెయ్యి)లకు తక్కువకాని విద్యా వేతనములు ఈ సంవత్సరమున్నూ ఇస్తూ, ప్రత్యేకముగా స్కాలరుషిప్పు నిధి నొకదానిని నిర్మించుట ;

(6) రాజధానిలోని శైవ యువజనులవలెనే తదితర ప్రాంతములలో శైవ యువజనుల సభ్యత్వము నేర్పర్చుట :—

ఇవి శైవ మహాజనుల ప్రస్తుతపు కనీసపు బాధ్యతా ధర్మములని మా అభిప్రాయము. వీటి నన్నింటిని అమలుజరిపి క్రమమైన ఆచరణలో పెట్టుటకు ఆ యా ప్రాంతములవారు ప్రణాళిక నేర్పరిచి పనిచేయవలెను, వట్టి ఊహాంగీకారములు మాత్రముచాలవు, ప్రయోజనకారి కావు. బాధ్యతతో యీ పనులకు పూనుకొను పీఠాభిమానులు కొందరవసరము. అట్టివారు వారి పేరులు మాకు తెలియజేయవలెను లేక ఆ యా ప్రాంతములలోని, ఇందుకు అర్హులయిన యితరుల పేరులు యోచించి తెలుపవలెను. ఈ విధముగా అతి శీఘ్రకాలములో మాకు తెలుపుటకు మేము మిక్కిలిగా కోరుచున్నాము.

పై బాపతుల ద్రవ్యసహాయములో పీఠము సజీవముగా మాత్రము వుండగలదు. అంతమాత్రము చాలదు. పీఠము తేజోవంతమై నెరవేర్చతగిన కొన్ని ముఖ్య కార్యములు గత వార్షికోత్సవ సందర్భములో చేయబడిన తీర్మానములవల్ల విశదము కాగలవు. ఇట్లుండగా విశేష కృషి సామర్థ్యములతోను, మతాభిమానుల సహాయ సహకారములతోను నిర్మింపబడిన విజయవాడలోని పీఠ భవనమునకు దైవిక రాజకీయమైన విపత్తు సంఘటిల్లినది. స్థలము ప్రభుత్వమువారు తిరిగి స్వాధీన పరుచుకొన గోరుచున్నారు. భవనమును కాపాడుకొనుటకు శక్తికొలది సంఘీభావముతో సంఘము పాటుపడవలసి యున్నది. అవసరమయ్యే యెడల విజయవాడలో వేరొక భవన నిర్మాణమునకు కృషి చేయవలసి యున్నది. రాజధానిలోనూ ఒక భవనమవసరమని యెంచబడుచున్నది. మరిన్నీ శ్రీశైల క్షేత్రములో శైవుల సౌకర్యము నిమిత్తము కొన్ని గదులు కట్టుకోవలెననిన్నీ, మన విద్వాంసులు రచించిన శైవ మహాగ్రంథముల ప్రచురణకు తోడ్పడవలెననిన్నీ మొదలగు ప్రశస్తమైన ఇతరాశయములు కూడా వున్నవి, ఇందుకొరకు విశేష ద్రవ్యనిధు లవసరము. అధిక వితరణతో కూడిన విస్తృత విరాళము లత్యంతావశ్యకములు.

వీటి నన్నింటిని నిర్వహించుటకు ఆచరణ యోగ్యములైన మార్గము లను సూచిస్తూ యిందునిమిత్తము శ్రద్ధానక్తులతో స్వార్థరహితముగా పాటు పడుటకు సంసిద్ధులయిన మతాభిమానులు కొందరు ముందుకు రావలెనని కూడా యిందుమూలముగా మేము కోరుతున్నాము. ఏ మహాత్కార్య సాధనకుగాని అర్థబలమువలెనే అంగబలమును ప్రధానము. నిరాపేక్షణీయమై నిర్మాణాత్మకమైన కార్య శూరత్వము సాధనములలో అగ్రగణ్యము.

పీఠము తరఫున ఆరాధన విధి, అంత్యేష్ఠి గ్రంథములు త్వరలో అచ్చొత్తించి ఉపయోగ పరుచుటకు ప్రయత్నము జరుగుచున్నది.

ఇట్లు

కార్యదర్శులు

# నివేదన

## పుష్పదంత

## 1

ఈ నది ఎంత శాంతముగ, ప్రసన్నముగ, కనపడుచున్నది? ఈ మందగమనపు ప్రవాహములోని గాంభీర్యముమాటున సాగరసంగమమునకై త్వరితత్వరితముగ సాగిపోవలెను అమితోత్కంఠము, ఆరాటము లేవా? మఱి వానిని కనబడనీయదేమి?

వినయ సౌశీల్యములుగల విద్యావంతునివలె ఈ దేవళమెంత నిరాడంబరముగా నున్నది? ఆహా! స్వామీ! సాక్షాత్తు నీవే యిందు నెలకొని యున్నావుకదా! పరీక్షించి చూచిన ఈ దేవాలయపు నిరాడంబరతయందు ఆనందగర్వరేఖలు ఎంతగా క్రిక్కిరిసికొని ఒదిగియున్నవో గోచరించుటలేదా?

ఆనదీతీరము వెంబడివచ్చి, ఈ దేవాలయమునందడుగు పెట్టగా, ఆవరణములన్నియును దాటిరాగా సన్నని జ్యోతులవెలుగులో తక్కిన ఏ గోడవలును పట్టనట్లు ప్రభూ! నీవు ఇక్కడ! ఆ నదినిజూచి, పైనుండి ఈ దేవళమును జూచి వాని బాహ్యాంతర తత్వముల అంతరమును గమనింపగల్గితిని కాబట్టి కాని, లేకున్న నిన్నుచూచి మోసపోయి ఉండెడివాడనుకానో? సర్వజ్ఞా! శాశ్వత! శివ! ఇచ్ఛామాత్రమున సృష్టించి, జగత్తునడిపి, ఏమియు నెఱుగనట్లు ఇక్కడ స్థాణువవైయుండిన అమాత్రము పోల్చుకొనలేనని!

## 2

ధ్వజస్తంభాగ్రమున చిరుగంటలు మ్రోగినవి. కనులేమో మూతపడుచున్నవి, నే నెక్కడకు తెలిపోవుచున్నాను? ఇంతవఱకు పైవ ఎచ్చటనో కను పట్టిన తెలిమబ్బులు ఇంతలో పాదములక్రింద – ఇంకను క్రింద అదృశ్యమై పోవుచున్నవి. ఈ విస్తృత వినీలాకాశమున – దూర దూరముల ఎచ్చటనో వేణు, వీణా, శంఖ, పటహాధ్వని సముదాయము–అశ్రుతపూర్వము; ఇతఃపురాదృష్టమైన, చిత్రవర్ణ సంకీర్ణ కాంతిమండలములు. అబ్బ! కనులు చెదరుచున్నవి· ఈ తటిల్లత లెక్కడవి. కాంతికిరణముల ప్రతిఫలింపజేయగల కాచదర్పణము

ళేవో ఎండవెలుగులో చాలితములైనట్లు...ఇవి తటిల్లతలుకావు. విశ్వాంత రాళమంతయును దామే అయిన రెండుపదముల జంటలు. ఒకటి శ్వేతపద యుగళము; మఱియొకటి గౌరవర్ణాంచితము. తొలకరి చినుకులు భూమిపై అవతరించునట్లు—సముద్రపు కెరటముల నురుగు ఎగసిపడుచున్నట్లు-తేజోవంత ములయిన చుక్కలు మినుకు మినుకు మనుచున్నట్లు – చిత్రవర్ణ శోభితము లైన పుష్పములు గాలితెరలలో నుయ్యాల లూగుచున్నట్లు ఈ పదయుగళ ములు ఎంత విచిత్రముగా, ఎంత ఒయ్యారముగ, ఎంత నిపుణముగ, ఎంత మనోహరముగ చాలితము లగుచున్నవి?

స్వామీ! వోల్చుకొన్నానులే నీ పాదములు—అమ్మపదములు· ఈ నిరం తర లాస్యోల్లసనముతోగదా నా ప్రాణములు, నా చైతన్యము, నా సర్వ స్వము ముడివడియున్నవి!

# 3

ఉలికిపడి కనులు తెరచితిని. రెక్కలు ముడిచికొనిన పారావతమువలె ఊహలుడిగి, ఇట ప్రాలియుంటిని. బాహ్యముగా కనుపట్టు సర్వచైతన్యము నుపసంహరించుకొని, భీష్మించుకొని, లింగాకృతిగా ఇక్కడ అధివసించి యుంటివి!

ఎవరయ్యా? నిన్ను స్థాణువవని వర్ణించినవారు? పాపమెవరా వంచి తులు? కరచరణాద్యవయవములు కనుపట్టనితీరున, నీ తత్త్వము ఎంత గోపన మొనరించుకొనుచున్నావో కాని—నాకు తెలియును; అనంతశక్తి, అఖండ చైతన్యము ఘనీభవింపజేసికొని నీ వీ ఆకృతి తాల్చితివని, ఆ నదివలె, ఈ దేవాలయమువలె శోధించినగాని స్ఫురించని గూఢుడవునీవని. ఆ ప్రకృతికి చిహ్నమే నీవని!

# 4

నేను ఎఱుగనా నిన్ను? ఏమో, లీలగా స్ఫురించుచున్నది! గాఢాంధ కారము అలమిన అమావాస్యనిశిలో దూరమున మెరసినట్టి అనేక తారలలో నొకతారవలె, ఒకఊహ మనసులో పొడమి ఒక స్మృతి మనసులో మెదిలి, ఒక విచిత్రానుభూతి యొదవి-ఉత్తరక్షణమున పదితారలలో ఆతార గుర్తుతెలియక పోయినట్లు ఇంతలో పరాకుపడిపోవుచున్నాను, కాని

సంజచీకటిలో వస్తువుల రేఖాకృతులవలెనున్న యొుగ జ్ఞాపకములప్రపంచ మున ఒకటే పరిభ్రమించుచున్నాను.

ఆ పరిభ్రమణ వేళలలో అనుకొందును-అథవా! నీవు, నేను ఒక్కటే యని-ఆ ఒకటియగుట యెట్టిదో ఆ వివరణమాత్రము చిక్కుటలేదు. ఘూర్ణిల్లుచున్న యొుక మహాసాగరమై నీవున్నప్పుడు-కెరటమునై తీరము లందున ఎగిరి యెగిరి పడుచుంటినో! కోటి సూర్యబింబములకన్నను తీక్ష్ణమై, దశకోటి చంద్రబింబములకన్నను సుప్రసన్నమైన యొుక కాంతి వెల్లువనీవై విశ్వాంతరాళమంతయు వ్యాపించి నీవున్నప్పుడు, ఆ కాంతిలో ఒక కణమునై విద్యుదుద్వేగముతో ఈ కొననుండి ఆ కొనదాక పరువులెత్తితినో!

పర్వతము నీవై పరమాణువునేనయినా వస్తుతత్త్వమున నీవు, నేను అభిన్నులమై యుంటిమో!!



# పునరావిష్కృత పత్రికా ప్రారంభోత్సవము



7-5-1961 తేదీన సికిందరాబాదు కవాడిగూడ శంకర మఠమునందు రెండు సంవత్సరములనుండి మరుగుపడిపోయి తిరిగి వెలువడిన శైవమత ప్రకాశికయు ప్రసిద్ధ ఆయుర్వేద రిసెర్చి ఆఫీసరు శ్రీ డాక్టరు ముదిగొండ మల్లికార్జునరావు గారి అధ్యక్షతను సమావేశమైన శైవ మహాజనులచేత ప్రారంభోత్సవము చేయబడెను. ఇందు విద్వత్కవి శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారును, తాటికొండ వీరభద్రయ్యగారు, బండారు చంద్రమౌళీశ్వరరావుగారు మొదలగువారు పాల్గొని పత్రిక నిరంతరాయముగా నడుచుటకు శాశ్వతమగు మూలధనమును సేకరించి దాని పరిపోషణతో సమర్థులైనవారి యాజమాన్యమున నడపబడు చుండవలెననియు, ఇందుకు యువకు లెంతయు ఉత్సాహముతో ముందంజ వేయవలయుననియు ప్రబోధించిరి.

## శైవమత ప్రకాశిక చందా వివరము.

| | సంపాదకులు |
|---|---|
| మహారాజ పోషకులు | రు॥ 116-00 |
| రాజ పోషకులు | 50-00 |
| ప్రధాన పోషకులు | 25-00 |
| పోషకులు | 10-00 |
| అభిమానులు | 5-00 |
| చందాదారులు | 3-00 |
| విడిపత్రిక | 0-25 |

## సవరణ

గత సంచికలో ప్రచురించిన "మతమునకు సంఘమునకుగల మహోత్తర సంబంధము" అను శీర్షికగల వ్యాసమునకు రచయితలు శ్రీ ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు. సా॥ తెనాలి అని పాఠకులు తెలిసికొనగలందులకు మనవి.

---

*Book Review*

## "SAIVAMATHA PRAKASIKA"

The Sree Saiva Mahapitham of Secunderabad has undertaken the publication of a monthly Magazine with the name of "Saivamatha Prakasika", the first issue of which dated 30th April 1961 has just been issued. It is being published with Shri K. Veerabasavaraju as Editor to promote increased awareness of the tenets of "Saivism".

Though Hinduism is one of the oldest religions in the World, there are not many magazines to enlighten the public mind on the various philosophies and schools of thought prevalent in the Country. The venture of Sree Saiva Mahapitham in undertaking to publish the magazine is thus quite laudable. The magazine has been well brought out with interesting articles pertaining to "Veera Saiva" philosophy.

### పత్రికాభిప్రాయము 13-5-61 తేదీ దక్కన్ క్రానికల్

సికిందరాబాదులోని శ్రీ శైవ మహాపీఠము వారు ప్రచురించుచున్న శ్రీశైవమత ప్రకాశిక అను మాసపత్రిక మొదటి సంచిక (30–4–61) మా కార్యాలయమునకు చేరినది. శైవమత మూలసిద్ధాంత పరివ్యాప్తికై కంకణము దాల్చిన యీ పత్రికకు శ్రీ కందుకూరు బసవరాజుగారు సంపాదకులు.

ప్రపంచములో మతాలన్నిటికన్నను హిందూమతము పరమ సనాతనము, పరమ ప్రాచీనమైనను అందలి దర్శన వైవిధ్యమును, అగాధతత్త్వ పారమ్యమును, బహుజనోపయోగముగ తేటతెల్లముగ వివరించి వ్యాఖ్యానించగల పత్రికలు చాల తక్కువ. పై లోపమును యథాశక్తి పూరింప సమకట్టిన శైవమత ప్రకాశిక కృషి బహుధా శ్లాఘనీయము. వీరశైవమతతత్త్వ వివరణాత్మకములైన వ్యాసములతో వెలువడిన యీ సంచిక ముద్రణకూడ చాల చక్కగ నున్నది.

---

కృష్ణాపత్రిక ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాద్ - (ఆం. ప్ర)

# శైవమత ప్రకాశిక



శ్రీ శైవ మహాపీఠము

1-బి. పద్మారావునగరు. సికింద్రాబాదు.

[illegible]: శ్రీ పేట చిదంబర శాస్త్రి

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు - కందుకూరి వీరబసవరాజు

| సంపుటము | ప్లవ సంవత్సరము | సంచికలు |
| --- | --- | --- |
| ౧ | 23-6-61 27-7-61<br>నిజజ్యేష్ఠ పూర్ణిమ, ఆషాఢ పూర్ణిమ | ~~4, 5~~ ౩ - ౪ |


# శ్రీ శైవ మహాపీఠము

ఆది కాలము నుండియు విశిష్టములైన మతములచేత అన్ని దేశముల నుండి ప్రత్యేకించబడినది భారత దేశము. అందు మహర్షి మొదలు సామాన్యుని వరకు, పండితుని మొదలు పామరుని వరకు మహారాజు మొదలు పరమ దరిద్రుని వరకును భగవంతుడున్నాడనియు, అతడే సర్వమునకు మూల కారణ మనియు నేదో యొక సమయమున, నేదో యొక రూపమున స్మరించి తరించుచున్నాడు. కాని జరా మరణ నివారకమై నిత్యానందము చేకూర్పగల యమృతము పుట్టిన చోటనే సర్వనాశకరమగు కాల కూటమును జనించకపోదు. అనంత దుఃఖ సంగళమగు సంసారము నుండి విముక్తి నొందించగలిగి దివ్యజ్ఞాన సంపన్నులగు మహర్షులచేత విస్తరింప చేయబడిన యాస్తికమత సిద్ధాంతములు వెల్లివిరిసిన యీ భరత ఖండమునందే జైన బౌద్ధ కాపాలికాదు లుద్భవించి నాస్తిక మతసిద్ధాంతములచే సంక్షోభము కల్పించుచుండిరి. అట్టియెడ నవతార మూర్తులగు నీలకంఠులు, ఆది శంకరులు మొదలగు నాచార్యు లవతరించి తన్మత ధ్వంసకారులపై విజృంభించి యాస్తిక్యమును పునరుద్ధరింప జేసిరి. అంతియగాక

యిట్లు నానాటికి క్షీణించకుండుటకై కొన్ని నిర్మాణాత్మక కార్యముల యావశ్యకతను గూడ గుర్తించిరి. అందు ముఖ్యముగా ఒక దివ్యాశయము న నేకీభావము గల యనేక వ్యక్తుల యొక్క కూటమియే సంఘమగు ననియు, అట్టిసంఘమున విచ్ఛిన్నకర శక్తులు ప్రవేశించకుండ నరికట్టుటకై సమర్థులగు మూలపురుషుల యావశ్యకత యెంతైనా కలదనియు, అట్టి వారిని సేకరించుకొనుటకై యొక యధికార పూర్వకమగు మూలస్థానముండినచో పరంపరాగతబలముచే చిరస్థాయి నెలకొని ప్రజా సహకారమున పెంపొందుచు ప్రపంచమున కొక దివ్య సందేశము నందీయకలదని తలంచి యట్టి వానిని నెలకొల్పి వానికి పీఠములన్న నామకరణము జేసిరి. అయ్యవి యసంస్కారుల యొక్క సంపర్కముచే మధ్యమధ్య పరిపుష్టి నొందకున్నను నాటినుండి నేటివరకును వెలుగొందుచునే యున్నవి. విజ్ఞాన ప్రగతి గల వారమని చెప్పికొను నేటి నవనాగరికులును సంఘీభూతములైన మూలస్థానముల యందలి విశేష ప్రయోజనమును గ్రహించిన వారగుట చేతనే మరొక పేరున నైనను అట్టి సంస్థల నెలకొల్పుకొనిరి. ఇందుకు శాంతినికేతనము మొదలగు వానిని యుదహరింపవచ్చును. ఇట్టి వానిని స్వదేశీయులే కాక విదేశీయులు కూడ అనుసరించుచు వాని నుండి తమ యాశయములను దేశదేశాంతరములకు పంపుచుండిరి. అమెరికనులు కొన్ని వేల యోజనముల దూరమందుండియు మన దేశమున మూల మూలలకు వ్యాపించి తమ సిద్ధాంతములను ప్రచారము చేయుచున్నారు. ఏ సంఘమునకైనను తన యాశయ మందలి మహత్ప్రయోజనమును సాధించుటకు నొక మూల స్థానముండుట తప్పనిసరి. ఇట్టి యావశ్యకత తెలిగిన వారగుట చేతనే దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు గారును మహా మహోపాధ్యాయ శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారును, శైవమతోద్ధారక శ్రీ. ముదిగొండ శంకరారాధ్యులు మొదలగు మహనీయులు, బహు పురాతనమగు శైవమతము ప్రక్షీణగతి నొందుచుండుటకు విచారించి దానిని తిరుగ మహోన్నత దశ నందించుటకై శైవ మహాపీఠమును స్థాపించిరి. ఇట్టి పీఠమును సమర్థులగు శైవాభిమానులందరు సహకరించి యార్థికముగను, వైజ్ఞానికముగను పరిపుష్టి పొందించుట విధియై యున్నది.



# అనసూయాఽత్రిమునులు

శ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారు

---

శ్లో॥ విశ్వైకపావక! నతావక పావకైక
శక్తేఋతేఽమృత! బతామృత దివ్యకార్యం
ప్రాణిత్యదో జగదహో జగదంతరాత్మన్
తవ్ పావక! ప్రతిపదం శమదం నతోఽస్మి॥

(వ్యాసః)

తా॥ విశ్వమునకు ముఖ్యుఁడవగు నో పావకా! ఓ అమృతుఁడా! ముఖ్యమైన నీదు పావక శక్తికంటె వినాగా అమృతమగు దేవకార్యము కాదు. ఆశ్చర్య మెంతకష్టము! ఓ జగదంతరాత్మా! నీశక్తి వినాగ నీ జగముగూడ జీవింపదు. అందువలన ఓ పావకా! శమమునిచ్చు నీపదమును గూర్చి నతుఁడ నగుచున్నాను.

గోదావరీ దక్షిణ ప్రదేశ వనంబునం దరవిందగర్భుని పుత్త్రుండగు నత్రి మహాముని పత్నియైన యనసూయా దేవితో శిష్యులతో నివసింపుచుఁ దపం బొనర్చుచుండె. అందుఁ గొంతకాలంబున భయంకరంబైన దుర్భిక్షం బేర్పడఁ బది రెండేండ్లు వర్షంబులు గురియక మహా క్షామంబు సంభవించె. ఎచ్చోటను దడియైన లేకుండె. ఆశ్రమ వృక్షంబు లన్నియు నెండిపోయె. వేడిగాడ్పులు చెలరేఁగె. ఎందును హాహారవంబులు మ్రోయుచుండె. నిత్యవృత్తికి నీరం బనునది శూన్యంబయ్యె. అపు డనసూయాదేవి నాథునిఁ జూచి నేనీ హాహా ధ్వనుల వినఁజాల, దాహార్తులగు దీనప్రజలఁ జూడఁజాల. నే నేమి సేయుదు ననిన నా ధీరోత్తముఁ డపుడే శివునిఁ దలచి ప్రాణాయామం బొనరించి సమాధినొంది తపించుచుండె. అంతేవాసు లంద ఱాకలిదప్పులఁ గీడ్వడి యెద్దడి నెదురలేక ప్రాణభీతులై యెందేనిజనిరి. అనసూయాదేవి సమాధి యోగంబున నున్న విభుని సేవింపుచుఁ దాను గూడ నొక మృణ్మయలింగం బొనర్చికొని మంత్రంబులఁ జదువుచు భావమయంబులగు సకలోపచారంబుల సమర్పించుచు నహోరాత్రంబులం దర్చించుచుండె. అప్పుడు దురాత్ములగు నిశాచరులు గొంద ఱనసూయా సుందరోజ్జ్వల మూర్తిని జూచి కామించి తన్నాథుండు తపస్సమాధియం దుండుటయు శిష్యులందఱు వలసఁబోవుటయుఁ దెలిసికొని యిదియే యదనని ఆ యనఘమూర్తిని డాయవచ్చుచుండిరి.

అంతనే యా దేవి పావనతనూద్భూతాగ్నిజ్వాలలు భీషణంబులై తమ దేహంబుల దహింప వచ్చుచుండుటను జూచి రక్కసు లుక్కసెడి హా యనుచుఁ గూయిడుచు దిక్కులకుఁ బాఱిరి. అంతరిక్షంబందు విమానంబు లెక్కి చూచుచున్న సర్వామరబృందంబు అనసూయా పాతివ్రత్య తేజంబున కానందించి భూమికి డిగ్గవచ్చి యనసూయాత్రిమునులకు మ్రొక్కి సన్నుతించి పోయిరి. అప్పటి కనసూయాత్రిమునుల తపోవత్సరంబు లేఁబదినాల్గుదాటె. అప్పుడుఁ గూడ వృష్టి యొనరదయ్యెఁ. దత్కాలంబం దత్రిముని యాకస్మికముగ మాసధిని వదలి బాహ్యప్రపంచమును జూచె. అనసూయాదేవి హరుసంబునఁ బెనిమిటికి మ్రొక్కి నిలచియున్నంత మునీశ్వరుండు పురంధ్రినిజూచి దప్పియొదవె నెందేని యుదకమ్ముఁ దెమ్మనియె. అపు డా మునీంద్రదేవి కమండలువంది యాశ్రమంబు నెంతఁ గలయఁగన్గొనిన నెందును సలిలమగుపట్టకున్నఁ జూచి హా యేమిసేయుదు నాథుఁ డుదకంబుఁ గోని రమ్మనియె. యెందును నద్ది దుర్లభం బిఁక నేమి సేయుదు విభునిదాహం బెట్లు దీర్తునని మానసంబునఁ బరితపించుచుండ నంతనే స్వర్గంగ యొకయంగనయై యనసూయను వెనుకొని వచ్చి సాధ్వీమణీ నీ వేమివాంఛింతు విచ్చెదఁ జెప్పుము.

కం॥ నీసెలవుఁ గడుఁగూరిమిఁ జేసెదఁ జెపుమమ్మ యిట్లు శివసేవనముఁ
నీ సామి సేవనంబును వాసిగ నొనరించినట్టి పావనవెలమిఁ ॥

ఇట్లడిగిన ననసూయాదేవి యా గంగాదేవిని జూచి హర్షించి 'తల్లీ! నీ వెందుండి వచ్చితివో నీదుసంపత్తి నొకింత సెలంగింపు' మనియె. అపుడామె 'నేను గంగను. శివునిరాణిని. నీ యీప్సితంబు లడుగుదువుగాక. యనిన ననసూయ సాష్టాంగపడి మ్రొక్కి. 'తల్లీ! మధురోదకంబు లిమ్మ'నె, గంగాదేవి యంతనే 'సతీమణీ! ఒక చిన్నగర్తముఁ బొనరింపుము. అందు మధురనీరంబులఁ గూర్తు'ననియె అనసూయ హర్షంబుతోడఁ బల్లం బందొక చిన్నగుంటను నిర్మించె. తత్క్షణంబున గంగాదేవి స్వాదూదకంబుల నిండించె. అనసూయ కమండలమం దుదకంబు నింపికొని గంగాదేవికి మ్రొక్కి 'తల్లీ! నేనిప్పుడే నీ సన్నిధికి మరల వచ్చెదను. నేను వచ్చుదనుక నీ వరుగక యిందే యుండు'మని ప్రార్థించినంత భాగీరథి యంగీకరించె. అనసూయ తీర్థమును గొనిచని నాథున కొసఁగఁగా నతఁడు వేగిరంబుగ నా సలిలంబులఁ ద్రావి యానందించి 'దేవీ! యీ తీర్థంబు లెందుండి తెచ్చితివి. అపూర్వంబు లివి యమృత సమానంబు లెపుడెపుడు నీ విచ్చునట్టి నీరంబు లిట్టివిగావు. దావాగ్ని తప్తంబగు నా హృదయంబందలి వేదనఁ బాపి సుఖంబొసంగినవి. ఇట్టి సలిలంబులు నీ కెట్లు లభించినవి చెప్పు'మనిన, అనసూయ యించుక యోజించి మహాత్మా! తమ తపోబలంబునను శివుని యనుగ్రహంబునను మనవనమం దొక్కచో గంగోదకంబులు

చేరినవి. అందునుండి యీ తీర్థంబులను దెచ్చితి ననియె. అప్పు డత్రిమహా ముని సంతసించి వేగిరంబుగ సతితో నటకేగి సలిలవార పూరితంబైన సరోవరంబుఁ జూచి యక్కజంపడి మురిసి తా నందు తీర్థమాడి నిత్య కర్మంబుల నెరవేర్చుకొనియె. అనసూయా దేవియు నందవగాహనంబుఁ జేసె. అంతఁ బరమేశ్వరుండును గంగాదేవియు నాదంపతులకు దర్శనంబిచ్చి యత్రిమునిని ననసూయను బ్రశంసించి వరమునిచ్చెద మడుగుఁడనిరి. అప్పు డనసూయ గంగా దేవి కిట్టులనియె.

కం॥ తల్లీ ! యీ తాపసవని నెల్లప్పుడు మఱచి పాయ।కీవుండవలెఁ
జల్లఁగ మా యెడఁగలకృప పుల్లాంబుజనయన భువన।ములు పొలుపొందఁ.

కం॥ లోకోపకారమును నగు వీఁకఁ గరుణాతిశయము।వెల్లివిరియ గాఁ
నీ కమనీయోదకముల నీ కానఁ సతము నిలిపి।తేని మహాత్మా !

అని యనసూయ గోరిన నా హరురాణి 'పతివ్రతాతిలకమా ! నీ వొక వత్సరము శివపూజచేసినఫలము నా కొసఁగుము నేనల్లే యిందు సాన్నిధ్యం బొంది యుదకంబులఁ దఱుగనీక యుంచెద' ననియె. అనసూయయు నట్లొక యేటి శివపూజాఫలంబును గంగకు ధారవోసె. దేవధుని నిజోక్తి ప్రకారంబుగఁ బుష్కరిణియందు సాన్నిధ్యంబు చేసియుండె. అంత ననసూయాత్రిమునులు ప్రసన్నుఁడై దరిసెనం బిచ్చినమహేశ్వరు నిట్లు ప్రార్థించిరి.

కం॥ మందాకిని యెట్టుల మా యందాదర మెసఁగ నిందు నమృతమయంబై
పొందికఁ జేరి వశించెనొ యిందుధరా ! యట్టు లరసి।యీ వుం డు మిటఁ.

అని ప్రార్థించి యడిగిన శివు డట్లేయని యనసూయారచితపార్థివ లింగంబందుఁ బ్రవేశించి యత్రీశ్వరుఁ డనుపేరితో జగంబు నేలుచుండె. మఱియు నాదిదేవుండగుశివుం డనసూయాత్రులఁగాంచి కొలది కాలంబులో మీకు నాయంశంబున నొకపుత్రుఁడును హరిబ్రహ్మలయంశంబుల నొక్కొక్క పుత్రుండును జన్మింపగలరని యాదేశించి భాగీరథితో నంతర్హితుం డయ్యె. యథాపూర్వంబుగ వనం బంతయు బహుపల్లవ పుష్పఫలభరితతరువ్రాతంబుతోఁ జెలువొందె. మేఘంబులు సువృష్టి నాపాదించె. ఎద్దడిదొలగి నట్లెఱింగి వలసఁ బోయిన మునులెల్లసకుటుంబ ఛాత్రజనులై మరల వచ్చి శాంతిహోమంబుల నెరపి యానందంబున నుండిరి. అత్రిమహామున్యంతేవాసులును మరలఁ జేరి యవ్వారిని సేవించుచుండిరి. శివోక్తప్రకారంబుబునఁగొంతకాలంమీఁద నమ్మౌని దంపతులకు శివాంశంబున దూర్వాసమునియు విష్ణ్వంశంబున దత్తాత్రేయుండును బ్రహ్మాంశంబునఁ జందురుండును బుత్రులై జన్మించి పెంపొందిరి. ఇది మహానీయులగు ననసూయాత్రిమునుల చరిత్రంబు.—



# ఋతు కాల సేవ

శ్రీ బి. చిదంబరశాస్త్రి

చం॥ కలుషిత కాలవాహిని వికారత కొండొకనాడు మోడుగా
బొలచిన మావిగున్న యలవోక చిగిర్చె స్వకీయ యత్నమం
దలరుల బూయ పూర్ణ మధురావృత దివ్యఫలంబు నీనగా
వలచు వసంతపుం జిగి నుపాసన జేతును సిద్ధరాముడా !

చం॥ అలతి వెలుంగు భాస్కరు మహోగ్ని కణంబుల గ్రక్కునెండ, లెం
తలుగ దహించు పాంథుల వితానములన్ మృదు శీతవాత సం
కలిత రసాల సాలముల కమ్మని చాయల నిద్రవుచ్చి యం
తలు సుకపెట్టు గ్రీష్మ సుకృతంబున నెంతును సిద్ధరాముడా !

చం॥ జలద కఠోర గర్జ దవశార్భటి కల్పితభీతి కింతయే
నులుకక తీవ్రభాను తపనోద్ధతి బాపు రసాంచితోరు ధా
రల మునుగంగ నేగిన వలాహక సుందర వర్షకాలపుం
జెలిమికి నంజలింతు నిను జేరి సుఖంపడ సిద్ధరాముడా !

చం॥ పులకిత మయ్యెనేమొ యలపొంచిన మీ హృదయంపు భావనా
కలిత వికాసముం గనిన కాలవిలాసికి రేల పండు వె
న్నెలలుగ పొంగి విశ్వకమనీయత చాటు శరత్తునందు తా
రల నరయంగ జూతును కలానిధిశేఖర! సిద్ధరాముడా !

చం॥ చెలమల బాయు నీరముల చిక్కని క్రొన్ననచాలు నందు బి
ప్పిలు తొలిమంచు పోత ప్రభవించిన రాగ సమన్వయంబులో
నలరెడి హంస దివ్యనటనంబున బొల్చు హిమర్తునందు మీ
లలిత విలోల మానసకలంబును దల్తును సిద్ధరాముడా !

చం॥ దలముల చేత పుష్పసము దాయము చేత రసప్రపూర్ణ స
త్ఫలముల చేత తొల్లి జగదర్చన జేసిన వృతుజాతి ని
ర్మలమగు స్థాణు వౌచు మధురాకృతి నొందగ జేయకారణం
బల శిశిరర్తు శోభ హృదయంబున చాటుదు సిద్ధరాముడా !

చం॥ అలకలకంఠ కోమల కలారవముల్ దెసలంటి మిజగ
ద్విలసిత మెల్ల పొందుకొను వేళ, మనోహర పంకజంబు ప్రా
బలుకుల మన్కి విచ్చుకొనబంచి రసంబు గలంచు ప్రాతరు
జ్జ్వలమగు వేళ మీ పదము వాంఛిలు చుందును సిద్ధరాముడా !

చం॥ అలఘు తరంగ ఘట్టన భయంకర సాగరమందు గల్గు లో
యల బహుకాల మీదిన సహస్రకరుండు క్రమంబుగా వియ
త్తలమున మించి స్వీయగత ధామము జిమ్ముచు మూల మూల రం
జిలు దినమధ్యమందు నుతి జేతును మీకళ సిద్ధరాముడా !

చం॥ కలిమికి లేమికిన్ నడుమ గమ్మిన గారడియందు మానవా
వళి యసియాడు చెంతటి యవాచ్యత నందెనో చూచి వేదనన్
కిలకిల లాడి గూండ్లదరికేగు పికంబుల రావ మింపునన్
గులుకగ సంజవేళ నినుగోరి నుతింతును సిద్ధరాముడా !

చం॥ నెలకొను జీవితంబుల ఘనీభవకర్మ విపాకపున్ విశృం
ఖలముల దెంపు గల్గని జగాల కనూహ్య సుఖంబు నెయ్యదో
గలచు సుషుప్తి ముగ్గి యెటుగానగ రాని నిశీథవేళ నే
కలలను దేలి మీ మధురకాంతిని గాంతును సిద్ధరాముడా !

చం॥ గలమున కాలకూటము తగన్ సిగవేలుపు కేటి వామపున్
దలమున గట్టురా కొమరితన్ గటి బెబ్బులి తోలు మేనిలో
జిలువల జేనిసొమ్ము గయిసేసిన మీ మధురంపు రూపమే
నెలమి సదా హృదబ్జమున నేమరకుందును సిద్ధరాముడా !



---

శ్లో॥ "అంకోలం నిజబీజ సంతతి, రయస్కాంతోపలం సూచికా,
సాధ్వీ. నైజవిభుం లతా క్షితిరుహాం సింధు స్సరిద్వల్లభం
ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదార విందద్వయం
చేతోవృత్తి రుపేత్య తిష్ఠతి సదా సా భక్తి రిత్యుచ్యతే"

ఆది శంకరాచార్యులు

క్రిందరాలిన స్వీయమగు విత్తనములు ఊడుగ చెట్టును, సూది
అయస్కాంతమును, పతివ్రత నిజభర్తను, లత వృక్షమును, నది
సముద్రమును ఎట్లు పొందుచున్నదో అటులనే
పశుపతియొక్క పాదకమలములను సదా చేరియుండు చిత్తవృత్తియే
భక్తియని చెప్పబడు చున్నది.



# నివేదన

## "పుష్పదంత"

---

## 5

ప్రభూ! ఏమి యభిన్నత నీకును నాకు? నేనన్న ప్రత్యభిజ్ఞానమే నాకు చావదే ఎన్ని జన్మములెత్తితినో, ఇంకను 'నేను' మిగిలియే యున్నదే! నేనును నీవునెంత యొకటి యన్నను రెండు ప్రత్యేకపు టూహాలు, పృథక్ శబ్దములు ఏర్పడియే యున్నవే! శివా! ఈద్వయము అద్వయము అగుటెట్లు?

నాది యనుకొనిన సర్వమును నీ యందర్పితమగుచో ఓ మహాదేవ నీవు నేను నొక్కటి యగుదుమా? అట్లగుచో అదే మహాయజ్ఞము కానేరదో? స్వామీ! చేతిలోని యొడిసెలవలె నీ చుట్టును నన్నెట్లు త్రిప్పుకొనుచున్నావు! బంధమో, అనుబంధమో, నీకును నాకును నడుమ నేమోయున్నది. నీలో నేనేకమగుమాట ఎప్పటికో అటుంచుము. అంతవరకు నేనెట్లు నిన్ను సేవించుకొందును. ?

## 6

ఓహో ఎట్టి విచిత్రములైన ఊహాపథముల మనస్సు పరువిడుచున్నది? రాజు అనుగ్రహించెనని ఏనుగు నెత్తి కెత్తుకొన జూచునట్లు, నేనేమి నీతో అభిన్నత నరయుటయేమి? నీవు ప్రభుడవు, నేను నీ దాసుడను. నా ప్రాణములు వెలకట్టుకొని సేవావసరమును ప్రతీక్షించుటలో జీవించుచున్నవాడను.

ఆత్మేశా! ఒక్కమాట చెప్పుదునా? అద్వయానందమేమో, అది ఎట్టిదో నాకు సమ్యగనుభూతమగు విషయము కాదు. ఒకవేళ అదియే మహోత్కృష్టమైనది కావచ్చునుగాక! అది విశ్రుతము నిరంతము నిన్ను ధ్యానించుట. సేవించుట యందుగల మహదానంద మున్నదే అది విజ్ఞాతము, ఇదిచాలదా నాకు?

# కిరాతలీల

## విద్వాన్ బి. చిదంబరశాస్త్రి

ధర్మ తత్పరుడైన మానవునకు ధర్మమువలె అర్థకామములును, అనివార్యము అని యుద్బోధించి భీముడు విరమించగనే ద్రౌపది యిట్లు నుడువసాగెను: అమోఘ శస్త్రవిద్యా పారంగతుడవైన విజయా! అతి భీషణంబైన ఘోరారణ్యములకు ఏకాకివై యేగుచుండుటచే మనస్సు కలత నొందుచున్నను దివ్యోపాసనా సిద్ధిచే విశ్వాతీతమగు మహద్భాగ్యమును బొందనుంటివన్న సంతుష్టి కలుగుచుండెను. నీవంటి ప్రతిభావంతుని కనిన వీరమాతయగు కుంతీదేవి నీ జననము వలన నెయ్యది యాసించెనో అట్టి నీ యభిలపించు సర్వస్వమును నీకు సిద్ధించును. భిక్షావృత్తిచే జీవించు భాగ్యశాలికి నమోవాకములు. ఎవ్వడును క్షత్రియ కులమున మనవలె హేయమగు జన్మ నొందకుండును గాక! మేము భోగముల నభిలషించిగాని ధనమును కోరిగాని, జీవితములను ఆశించిగాని నిన్ను దూరప్రవాసమున పయనింప జేయుటలేదు. నాడు రాజసభామధ్యమున నీచుడగు దుర్యోధనుడు నన్నుజూచి పరిహాసించుచు పలికిన హేయ సంభాషణము నేటికిని నా హృదయ మర్మమును భేదించుచు దుఃఖకారణమగుచున్నది. మాయొక్క సుఖదుఃఖములను. రాజ్య వైభవములును, జీవిత మరణములును నీయందే సమీకరింపబడినవి. కుంతీకుమారా! నాకు రక్షకుడవు కమ్ము. భారత! నీకు స్వస్తియగునుగాక! మహాబల! అవిఘ్నమగు విజయ పరంపరకై శీఘ్రముగా పయనింపుము. ఆ భగవంతునకు నమస్సహస్రములు. ధనంజయా! ఆ కాళీ, లక్ష్మి సరస్వతులు పయనించుచున్న నీకు రక్షకు లగుదురుగాక! నేనును నీవు తిరిగి చేరువరకు అష్టవసువులను, ఏకాదశరుద్రులను, ద్వాదశాదిత్యులను, విశ్వేదేవతలను శాంతి కొరకై సర్వకాలములును సేవించుచుందును. అంతరిక్షమందలి సకల దేవతల వలనను, పంచభూతముల వలనను నీకు రక్ష కలుగుచుండును గాక! అనుచు మంగళములను దీవించుచున్న ద్రుపదరాజు పుత్రి వాక్కులకు కించిదుద్వేజితుడైన ప్రార్థుడు ముందు నిలిచిన ధౌమ్యాది మహర్షి గణంబునకును, ధర్మజాదిభ్రాతలకును ప్రదక్షిణ నమస్కారము లొనరించి వారి శుభాశీర్వచనంబుల నందికొనుచు రుచిరధనుర్ధారియై ఇంద్రకీల మహా పర్వతమును గురించి పయనించెను.

మనోతీత వేగంబున పయనించుచు మార్గమధ్యమందలి పర్వత పంక్తుల నెల్ల దాటి సకల దేవతా నివాసమై పుణ్యవంతమైన మహోన్నతమగు దివ్య

హిమవ త్పర్వతము నొక్కదివసంబున అధిగమించి దివారాత్రములను నిద్రాహారములను మాని వాయువువలె గంధమాదన పర్వతమును గడచి అతిశీఘ్రమున మహాద్రిని చేరికొనెను. అచటి తాళతమాల శాల్మల్యాది మహావృక్షములచేత సమాకీర్ణంబైన సానువులు ఒండొంటిపై దొంతరలుగా పేర్చబడినట్లు మహోన్నతములై యాకసము నందుకొనుచుండ అందలి సింహశార్దూలాది క్రూర మృగంబులచే కడు భయంకరంబైనను, మందార పారిజాత కోవిదార చంపకాది తరుజాలంబుల నాశ్రయించిన చకోరశతపత్ర కోకిల శుక కలవింకాది మధుర కూజితంబులచే శ్రోత్ర రమ్యంబై కుముద కల్హార పుండరీకాది సముచ్చయ సమావృతంబులైన సరోవరంబులచేత మనోహరంబై యర్జునుని సంకల్ప సాధనకు కడు యోగ్యములైన దివ్య ప్రదేశంబులతో నొప్పుచుండెను. అచటి లోకాతీతమైన శోభకు ముగ్ధుడైన యర్జునుడు తనకు సర్వవిధముల నుపయోగమయిన యొక్క ప్రదేశమును ఎన్నుకొని వాస యోగ్యముగా నొనరించుకొనుటకు యత్నించుచు అందు నొక్క వృక్షమూలమున నాసీనుడై బ్రహ్మ తేజస్సుచే వెలుగొందుచున్న యొక వృద్ధ తపస్విని పరికించి యాతని మానవాతీతమగు దివ్య తేజస్సుకు కించిత్తు చకితుడై సమీపించి నమస్కరించగా వృద్ధ తపస్వి యాతనితో నిట్లు సంభాషించెను: "నాయనా! నీ వెవరవు? ఎచ్చట జన్మించితివి? ఎట కేగుచుంటివి? ఇమ్మహాపర్వతము కామ క్రోధాది షడ్వర్గంబున వర్జితులైన శాంత స్వభావులగు మహర్షి గణంబులకు సేవ్యంబై క్రూర స్వభావములైన శరభ శార్దూలాది ఘోర మృగంబులును వైరభావమన్న నెద్దియో యెరుంగక సహజ శత్రువులైన మృగాది సాధు జంతువులను సైతము అన్యోన్యముగా ప్రేమించుచు ప్రకృతి సుందరతను ప్రకటించుచుండ దర్శనమాత్ర భయంకరములైన వికృత బాణతూణీరంబులను ధరించి యెవ్వని ప్రాణ ఘాతుకంబునకు ఒడిగట్ట నుంటివి. ఇచ్చోటు ఐహిక సుఖంబుల జిక్కువడిన వానికి సేవ్యముగాదు!" అని పలికినంతనే అర్జునుడు "మహాత్మా! నేను ఉత్తమమైన మానవజాతికిజెందిన క్షత్రియ కులంబున కుంతీదేవికి మహేంద్ర వరప్రసాదంబున పాండవ మధ్యముడనుగా జనియించిన వాడను. నన్ను అర్జునుడని యందురు. కేవల రాజ్యకాంక్షియై మత్తుడైన దుర్యోధనుడను కౌరవరాజు మాయందు శత్రుభావము నాపాదించికొని దుశ్చింతనాపరుడై మాయచే మా సర్వస్వమును కొల్లగొట్టుటయె గాక మమ్ము స్వరూపనాశము జేయ ప్రయత్నించుచున్నాడు. అందుకు ధర్మైక పరాయణుడగు నా యగ్రజన్ముడగు ధర్మరాజు కడుదూరము నాలోచించి రాగల విపత్తునుండి తప్పుకొనుటకు వలయు దివ్యాస్త్రంబులను దేవేంద్రుని యుపాసించి సిద్ధింప జేసికొనుటకై నన్ను నియోగింప తన్నిమిత్తమున నిచటికి చేరియుంటిని. ఈ నా ధనుర్బాణంబులు అవసరంబున నాత్మరక్షణకై వినియో

గించుకొన నుద్దేశింపబడినవే కాని వేరువిధమున గాదు" అని కపట వేషధారి యగు వృద్ధ తపస్వితో పలికినంతనే మాయారూపమున నున్న యా దేవేంద్రుడు అర్జునుని బహు విధములుగా పరీక్షించి యాతని దృఢ సంకల్పమునకు సంతసించి నిజ స్వరూపమున ప్రత్యక్షమై "కుమారా, ధనంజయా ! నీ యభీష్టిత మెయ్యదియో నే నెరుగుదును. కృత్స్నమ్ములైన యస్త్ర సంచయమును నీవు పొందవలయునన్న జగదేక పూజ్యుడగు నా మహేశ్వరుని యుగ్ర తపస్సున మెప్పించి యాతని యుదార కరుణా రస ప్రసాదంబును బడసినగాని నీకు లభ్యములుగావు. అందుకు పినాకపాణియగు శివుని దర్శించుటకు తపంబు జేయు"మని తన్మార్గంబు నెల్ల యుపదేశించి యదృశ్యు డగుటయు, అర్జునుడును కడు నుత్సాహమున వెంటనే మునివృత్తి నవలంబించినవాడై క్రమాభివృద్ధిని నిరాహారియగుచు తానెవ్వరయినదియు ఎవ్వని గురించి యెందుకు తపించునదియు నెరుంగక తదేక పరాయణత నొక వత్సరంబు మహేశ్వరుని దర్శించుటకై దివ్యతపం బొనర్చుచుండెను. ఆతని దివ్య నిష్ఠాక్రమంబున నుద్భవించిన తేజః పుంజము అంతకంతకు విజృంభించుచు పరిసరంబులకు వ్యాపించుచుండ శతవృద్ధులగు మునీంద్రులు అట్టి పరిణామతను పరికించి యింకను ఉపేక్షించినచో లోకములకెల్ల వ్యాపించి దహింప జేయగలదేమో యన్న భయంబున యద్దాని నివారింప నమ్మహేశ్వరుని వేడుకొందుమని కైలాస నగంబు జేరచని యందు నొక్కచో ప్రమథగణంబు లెల్ల పరివేష్టించి కొలుచుచుండ బ్రహ్మ విష్ణ్వాది సురేశ్వరులతో లోకవృత్తంబు నరయుచు దేవీ సహితుడై సుఖాసీనుడై యున్న పరమేశ్వరుని సందర్శించి సాష్టాంగ నమస్కృతు లొనర్చి యిట్లు విన్నవించుకొనిరి : దేవదేవా ! భూలోకమందలి ఇంద్రకీల పర్వతంబున పాండవ మధ్యముడగు పార్థుడు ఘోర తపంబున మహా తేజోవంతుడై దిక్కులనెల్ల ప్రజ్వలింప జేయుచున్నాడు. ఆతని యభీష్టిత మెయ్యదియో మేమెరుగము. కరుణాళువై యాతని రక్షించి మమ్ముల సంతృప్తుల జేయుమని వేడికొనుటయు, మహాదేవుడు వారి నుద్దేశించి "మునీంద్రులారా! పార్థుని కొరకై మీరు విచారించవలదు. పూర్వజన్మంబున బదర్యాశ్రమమున కల్పాంతములు తపోనిష్ఠా పరులగు నర నారాయణులలోని నారాయణుడు కృష్ణుడుగా, నరుడు పాండవేయుడుగా లోకకళ్యాణార్థము మన్నిదేశమున భూలోకమున నవతరించిరి. పాప సంకల్పితమైన భూభార నివారణార్థమై మూకాసుర వధ నాందిగా నేడే యాతని యభీష్టితంబు నొసంగుదు మీరరుగుడని యాజ్ఞాపించి తక్షణమే మేరువువలె మహోన్నత రూపంబున కిరాత వేషంబు ధరించి యగ్నివలె ప్రజ్వలిత తేజంబున వెలుగుచు క్రూరనారాచంబుల ధనువును ధరించి లోకమాత పరమేశ్వరి భిల్లుని రాణిగా ప్రమథ గణంబులును కోయవారై

తన్ను పరివేష్టింప అనేక స్త్రీగణ పరివృతుండె యా తపోవనమును ప్రవేశించెను. అంత పూర్వవైరము నిమిత్తముగా మూకాసురుండను రాక్షసుడు అర్జునుని సంహరించుటకు మాయచే ఘోరసూకరాకారంబును పొంది యాతనిపై లంఘించుటకు పొంచుకుచుండ నద్దాని దూరముననే పరికించిన పార్థుడు తద్రూపు కపటవృత్తంబును గ్రహించి వెంటనే గాండీవమున బాణంబు సంధించి సూకరముపై బడ విసరెను. అదే సమయంబున ప్రక్కనే పొంచి యున్న కిరాత వేషధారియగు పరమేశ్వరుడుకూడ యొక్క బాణము వేయ ఏకకాలమున నిరువైపుల నుండియు రెండు బాణంబులును మాయా సూకరమును గుచ్చుకొని చచ్చి పడియుండెను అంత నిరువురును దానిని సమీపించి నాచే మర్దించె గావున నియ్యది నాయది యంచు క్రమంబుగా వాదించిన కొండిగట్టిరి. అందు నర్జునుడు కిరాతుడు పలికిన పరుష భాషణములకు క్రోధియై శరపరంపరల నాతనిపై గురిపించుచుండ నించుకయు చలింపక పరమేశ్వరుడు వానినెల్ల తనయందు లీనమొనర్చుకొనుచుండెను. అట్లు బాణానుసంధాన మెల్ల వృథ యగుచుండ వరుసగా విజృంభించుచు తన నేర్చిన సకల శస్త్రాస్త్రంబులను ప్రయోగించియు ప్రయోజనంబు గానక విభ్రమాశ్చర్యములచే చకితుడై గాండీవాక్షయతూణీరములతో సహా సర్వమును గోలుపోయి యిట్లు వితర్కించుచుండెను. 'తొల్లి యనేక రణరంగములలో కలిగిన విజయ పరంపరచే విజయుండని ప్రఖ్యాతిబడసిన నేను నాడు ఖాండవ దహనంబున దేవేంద్రునంతవానితో పీగివోక యుంటిని. ఈతడు సామాన్య కిరాతుడు కాడు. లోకైక పూజ్యుడగు నా పరమేశ్వరుడు దక్క నన్నిట్లు వశ్యుజేయ మరియొక సమర్థుడెవ్వడు! ఐనను ఎదురుపడిన పినాకితో నైనను యుద్ధము జేయుట క్షత్రియ ధర్మమని, నా యగ్రజుని యాజ్ఞ. విల్లంబులు లేకున్న ముష్టియుద్ధంబున దలపడుదు'నని నిశ్చయించి యొక్కపెట్టన కిరాతునిపై లంఘించి యగ్నికణంబుల గ్రక్కు క్రోధంబున నుద్రిక్తుడై మైమరచి యనేక ముష్టిప్రహారంబు లొనర్చుచుండెను. అంత కిరాతరూపి యాతని బలసంపన్నత తెలియగోరి యొక్క త్రోపున ద్రోసిపుచ్చుటయు, ఆ యూపునకు ప్రార్థుడు శరీరమెల్ల రక్తసిక్తమై యుచ్ఛ్వాసలుడిగి మూర్ఛిలి వెంటనే తెలివొంది సర్వరక్షకుడైన యా పరాత్పరుని శరణు వేడుదునని ప్రక్కనున్న మృత్తికచే లింగాకారము సిద్ధము జేసి దానిపై పుష్పమాలలుంచుటయు, ఆ పూలదండ అటగల కిరాత వేషధారియగు శివుని కంఠంబు నలంకరించుటయు జూచి అతిహర్షంబున లేచి మాటిమాటికి పాదంబులపై వ్రాలి మ్రొక్కుచు "భగవన్! దేవదేవ!! అపరాధినై నిన్నుగా తెలిసికొనజాలక ఘోరమగు తప్పిదమును చేసితిని. ఈ నా జన్మజన్మాంతరములను క్షమించని దోషంబులనెల్ల సహించి నన్ను మన్నించు"మని వేడికొనుటయు ఆ భవానీధవుడు నిజరూపం

బున ప్రత్యక్షుమై యాతని చేరదీసి "వత్సా! నాతో యెమరై నిలిచి పోరాడ జాలిన నీ ధైర్య సాహసంబులకు కడు సంతసించితిని. నీ యభీష్టితమును కోరుకొమ్మ" నిన పార్థుడు ముకుళితహస్తుడై "భక్తతత్పరా! యుగాంతము సంప్రాప్తమైనపుడు కృత్స్నమగు నీ జగజ్జాలము నెల్ల భీమపరాక్రమంబున సంహరింప సమర్థమై బ్రహ్మ శిరోనామము గల రౌద్రమై ఘోరమగు నా దివ్య పాశుపతాస్త్రమును నాకై యనుగ్రహింపుము. అద్దాని బొంది రాగల కురుయుద్ధంబున భీష్మద్రోణ కృపాకర్ణాదులచే సమీకృతమగు సర్వసేనానివహంబును జయించగలను. కట్టి వరంబు నాకు ప్రసాదించు"మనుటయు, లోకప్రియంకరుడైన శంకరుడు "ఫల్గుణా! అటులనే నీకా యస్త్రంబు నొసంగుదును. దానిని ధరించి ప్రయోగోప సంహారములకు నీవు సమర్థుడ వగుదువు. దీని రహస్యమును దేవేంద్రాదు లెవ్వరును తెలియరు. తొందరపడి సామాన్యుని యందు దీనిని ప్రయోగించరాదు." అని దాని రహస్యము నెల్ల యుపదేశించి మరియు బహువిధములగు నస్త్రములను అనుగ్రహించి అంతర్హితుడాయెను. అర్జునుడు తన నిమిత్తముగా పరమేశ్వరుని దివ్యలీలయగు కిరాతలీల చిరస్థాయిగా వెలుగొందగలదని కలిగిన మహద్భాగ్యమునకు మిగుల సంతుష్టుడాయెను.

సర్వం శివమ్



# చందా దారులకు మనవి

శైకమతా మానులలో మే మెరిగిన చాలామంది యడ్రసులను తెలిసికొని మూడు మాసములనుండియు మాపత్రికను పంపు చుండుట చూచిన కొందర రభిమానులు తమంతటకోరి పత్రికను బడయుచుండుట మా కెంతయు ప్రోత్సాహ కారణమగు చున్నది. అట్టివా రెల్లరు తిరుగు పత్రిక వెలువడు లోపున తమశక్తి ననుసరించి మహారాజ పోషకుల మొదలు చందా దారులవరకు కలమూల్యమును శైవ మహా పీఠ కార్య స్థానమునకు వెంటనే పంప గలరని ప్రార్థించు చున్నాము.

— సంపాదకులు.

# దక్షిణ కైలాసం

రచన ; విద్యాభాషాప్రవీణ మూలంపల్లి చంద్రశేఖరశర్మ B.A.,

అదియొక రమ్యమైన స్థలము. ఇరువైపుల రెండు కొండలు. ఆ కొండలతో పోటీ పెట్టుకొని పెరిగిందా! అన్నట్లున్నది ఒక గోపురం. ఆ గోపురాన్ని ఎంతసేపు చూచినా తనివితీరదు. ప్రతి యంతస్థునా చిత్రించిన దేవతా ప్రతిమలు మేరుపర్వతాన్ని అధివసించిన సాక్షాద్దేవతా బృందమా యన్నట్లున్నవి. ఆ గోపురం ముందుగానే ఒక నది ప్రవహిస్తున్నది. ఆ రెండు కొండల ప్రక్కగా ప్రవహిస్తున్న ఆ నది నిజంగా శివ జటలనుండి ప్రవహిస్తున్న భాగీరథిని జ్ఞప్తికి తెస్తుంది. ఆ నది మాహాత్మ్యం వర్ణనాతీతం. ఒకానొక ముని శివాలయం నిర్మించాలని అనుకున్నాడట, ఆ నదీతీరాన్నే. కాని ధనం కావాలిగదా! ఆలోచిస్తూ కూచున్నాడు. మదిలో తదేక శివాలయ నిర్మాణ ధ్యానంలో, అమకోకుండానే నదిలో ఇసుకంతా ప్రోగుచేస్తున్నాడు. చిత్రమేమిటంటే ఆ ఇసుకంతా బంగార ఇసుకగా కుప్పకుప్పలుగా ప్రోగుపడుతున్నది. తన చేతులను తానే నమ్మలేకపోయాడు ముని. బీదవాళ్ళందరు ఆ ఇసుకను కొంత తమకు పెట్టుమన్నారు. ముని మాత్రం చేతికి వచ్చినంత ఇసుక తీసి అది బంగారురూపం ధరింపగానే దైవ ప్రభా వానికి మనస్సున కేలు మొగుడుస్తూ ప్రతివానికిస్తూనే యున్నాడు. ఈ విధంగా నది ప్రసాదించిన బంగారు యిసుకను గ్రామ ప్రజలందరికి సమర్పించి శివాలయ నిర్మాణానికి వారివారి కాయకష్టాన్ని ధారపోయమన్నాడు మునీశ్వరుఁడు.

ఆ యూరిలోనున్న శిల్పులంతా ఏకమైనారు, ఈశ్వర భక్తితో ముని తలంచిన ఆలయ నిర్మాణాన్ని ప్రారంభించారు.

జ్ఞాన శక్తిస్వరూపిణియైన జ్ఞాన ప్రసూనాంబిక అ శిల్పు లందరికి దివ్య జ్ఞానాన్ని ప్రసాదించింది. శిల్పుల జ్ఞానశక్తికి అచటి కొండ శిలలన్ని తమంత తామే శిల్పులనుకున్న యాకారాన్ని దాలుస్తున్నాయి. వాళ్ళ ఉలి, సుత్తులు కేవలము నామాకార్థమే యైనాయి. చక్కని విశాల ప్రశాంతమైన ప్రాకారం తయారైంది. ఆహా! దివ్యమైన ప్రాకారం!! ప్రవేశింపగానే మానవుని మనస్సు ప్రశాంత ప్రదోషకాలంలో నంది, భృంగి మొదలగు వారితో నాట్యమాడనున్న నటరాజమూర్తి దివ్యస్థలానికి దీసికొని పోతుందా అన్నట్లున్నది ఆ ప్రకార మార్గం. ఆ మార్గంలోనే పాతాళ గణాధిపతి స్వయంగానే వెలసాడు. బహుశః పాతాళవాసులు నిర్విఘ్నంగా ఈ స్థలాన్ని ప్రవేశించుటకు కాపలా గాస్తున్నాడేమో!

ఆ తరువాత దివ్యమైన కల్యాణ మంటపం తయారైంది. ఎక్కడ చూచినా స్తంభాలపై తొండాలతో నల్లిబిల్లిగా నల్లుకొని ఉంటాయి మద కరీంద్రాలు. ఆ మంటపంలో చిత్రించిన దివ్యశిల్పాలే కళ్యాణం చూడ్డానికి క్రిక్కిరియగా వచ్చిన దేవతల్లాగ కనబడ్డాయి. వాటిని చూస్తే రాతి శిల్పాలని యెవ్వడూ అనుకోడు. అట్లాఉంది శిల్పుల సజీవ శిల్పం. దాని వెన కాలే అన్నశాల నిర్మింపబడింది. దాన్నిచూస్తే కాశీలోని అన్నపూర్ణాదేవి తన వంటింటి నిక్కడే నిర్మించుకుందా ? అనిపిస్తుంది. జగదేక కుటుంబులగు పార్వతీ పరమేశ్వరుల వంటిల్లు ఆమాత్రం పెద్దగా లేకపోతే, భోజనశాలలు ఆ మాత్రం విశాలంగా లేకపోతే జగమంతా అక్కడ ఎట్లా భోంచేస్తుంది?

ఆలయ సింహద్వారం తయారైంది. ఆ ప్రక్కనే ఒక నల్లరాతి విగ్రహం స్వయంగానే బయల్పడింది. ఎత్తైన విగ్రహం. పొడుగాటి ముక్కు, తీర్చిదిద్ది గంభీరంగా ఉన్న కనుబొమ్మలు, కొద్దిగా క్రూరంగా ఉన్నా భక్తి భావాన్ని వ్యక్తపరిచే మిడిగుడ్డుగల కన్నులు, కండలుదేరి యినుప శరీరమా అన్నట్లున్న దేహం, ఆ పొడుగాటి చేతిలో గంభీరంగా ధరించిన ధనుస్సు, కుడిచేతిలో వాడితన్నాన్ని వేడితనాన్ని యిప్పుడు సైతం చూపుతూన్న బాణం, వీపున అమ్ముల పొది-వీటన్నిటితో తళతళ లాడుతున్నదా విగ్రహం, ఆ విగ్రహం ముందుగా ఒకదారి వెళ్తున్నది. అది ఆ కొండపైకి తీసికెళ్తున్నది. ఆ కొండపైన ఒక ఆలయముంది. అక్కడ గూడ ఇదే విగ్రహం. ఆ ఆలయం దగ్గరుండి నాల్గువైపులా చూస్తే అపరిమితమైన ఆనందం కలుగుతుంది. ఒకవైపు వంక వంకలుగా ప్రవహిస్తున్న నది, మరోవంక పట్టణంలోని మిన్నంటే సౌధరాజాలు, మరోవంక నలువైపులా పర్వతాల్తో చుట్టబడి రమ్యంగా ఉన్న ఒక దివ్యమైన సరస్సు కనబడ్డాయి.

ఆ సరస్సును చూస్తే మంచు పర్వతాల్లో ఉండే మానస సరస్సు ఇంత రమ్యంగా ఉండదనే అనిపిస్తుంది. బహుశః ఆ సరస్సు ఆధానుష్కుని కాట పట్టియిన స్థలమై యుంటుంది. దివ్యమైన కనక కమలాలతో అమృత మయమైన జలాల్తో చుట్టూ కాపలాకాస్తున్న పర్వతాల్తో ఆ సరస్సు ప్రస్తుతం మనకే ఆనంద నిలయమైతే ఆ ధానుష్కుని కాలంలో ఎట్లాఉండేదో ఊహించాలి. ఆ సరస్సును చూడగానే ఎప్పుడూ అక్కడే ఉండి తపస్సు చేసికొందామా అనిపిస్తుంది.

ఆ సరస్సునుండి వచ్చే మరొకదార్లో కొండ నానుకొని కొండ దిగువునే కొండను తొలచిరే శిల్పులు కొంతమంది శివుని నాట్యమంటపం చిత్రించారు. శివతాండవం, పార్వతి లాస్యం ఇంకా ఎన్నో శివ విలాసాలు కొండ రాతికి చిత్రింపబడ్డాయి. ఆ మంటపం పైన పంచముఖేశ్వరుని యాలయం నిర్మింపబడింది. ఆ ఆలయాన్ని అనుకొని వరుసగానున్న కొండరాతికి శిల్పులు

ఎన్నో శివతలలు చిత్రించారు. అందులో కొన్ని పూర్తి నిర్మాణం జరిగినవి. మరికొన్ని యర్ధ నిర్మాణము జరిగినవి మరికొన్ని రేఖామాత్ర నిర్మాణము జరిగినవి. ఈ త్రివిధ శిల్పాల్ని చూస్తే అప్పటి శిల్పులు క్షణంలో కోటి శిల్పాలను చిత్రించేవారని మనం సులభంగా ఊహింపవచ్చు ఆ శిల్పాలను చూస్తే ఎంతో రమ్యంగా కనుపిస్తాయి. శిల్పుల లక్ష్యం చూస్తే ఆ కొండరాతినంతా ఎల్లోరా అజంతాలవలె శిల్పమయం చేయ తలచి యుండేవారేమో అనిపిస్తుంది.

ప్రధానాలయానికి వెలుపల శిల్పంకన్నా ఆలయాంతర్భాగంలో ఉన్న శిల్పం వర్ణింప నలవి కానిది. యావద్భారతంలో అంతటి శిల్పాల గంభీరమై యాకర్షణీయమైన దేవాలయము లేదనే నిశ్చయంగా చెప్పవచ్చు. ఆలయం ప్రవేశింపగానే దక్షిణామూర్తి చిన్ముద్రతో శిష్యుల సందేహాలే కాక మన సందేహాలను కూడ నివారిస్తూ ప్రత్యక్షమౌతాడు. చుట్టూ మహామునులు దేవతలు ప్రతిష్ఠించిన శివలింగమూర్తులు కన్నుల కెంతో ఆనందాన్ని కలిగిస్తూంటాయి. చివరకు ఆలయాన్ని నిర్మించిన శిల్పిగూడ తన విగ్రహాన్ని శివ పాద సన్నిధిలో నిర్మించుకొని ధన్యుడైనాడు.

ఒకవైపున ఆదిశంకరులు స్థాపి దివ్యమైన స్ఫాటిక లింగజ్యోతిలా వెలుగుతూంటుంది. ఎక్కడ చూచినా ఎత్తైన స్తంభాలు, వాటిపై ఏనుగుల తొండాలు, ఇంకా పెద్ద పెద్ద శిల్పాలు మనస్సులో ప్రశాంతతను కల్పించి మానవునకు సాజా జీవత్కైలాసవాసానందాన్ని గలుగజేస్తాయి.

గర్భాలయంలో ప్రవేశించగానే దివ్యమైన జ్యోతిర్వలయాలు అచటి లింగాన్ని వాయులింగంగా వ్యక్తం జేస్తున్నాయా అన్నట్టు మెల్లిగా కదుల్తూంటాయి. కర్పూరాభిషేకోదక పరిమళం ఆలయమంతా ఆవరించి భక్తుల హృదయంలో ఒక నూతనోత్తేజాన్ని కలిగిస్తుంది. బ్రాహ్మణోత్తముల వేదఘోషలు ఆలయమంతా మార్మోగి ఆలయం ముందు ప్రవహించి సువర్ణముఖి నదితోపాటు తరందితము లౌతాయి.

లింగం బాగా ఎత్తైంది. పరిశీలించి చూస్తే ఆ లింగం ప్రక్కభాగాన ఏనుగ కోరలు, క్రిందభాగాన సాలీడు, పైభాగాన సర్పము కనపడ్తాయి. వీటివల్లనే ఆ ఈశ్వరునికి కాళహస్తీశ్వరుడని పేరువచ్చింది. గర్భాలయంలో కూడా ఆ ధానుష్క విగ్రహం కనుబడుతుంది. అతడే కన్నప్ప. పూర్వజన్మలో అర్జునుడు. సాలీడు, సర్పము, ఏనుగు వీనికి సంబంధించిన కథ అందరికీ తెలిసినవే. కాని యాలయం ఎవ్వరికీ బాగా తెలియదు కావున ఒకమారు వెళ్ళి విశేషంగా పరిశీలించి యానందించండి. ఇదే దక్షిణ కైలాసం.

శ్రీ శివాయ గురవేనమః

# శైవ మతమునకు శ్రీ శృంగేరి సంభావన

## శ్రీ శివలెంక సుబ్బారావు

---

మన శైవమతము 1008 శ్రీ జగద్గురు శ్రీ శృంగగిరి మఠాధ్యక్ష పరమ హంస శ్రీ శ్రీ శ్రీ అభినవ విద్యాతీర్థ శంకర భగవత్పాదులచే శ్రీవారు తెనాలి మకాములో సమాదరింపబడిన సమాచార మొకింత నిందు మూలమున ప్రచురింప బడుచున్నది.

జగద్గురు శ్రీవారిని తెనాలిలో మన శైవమత ప్రముఖులలో నన్యతములైన శివయోగి శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారును, శ్రీ ఇవటూరి సానందారాధ్యులవారును సందర్శించుట తటస్థించెను. శ్రీ సానందులవారు శ్రీవారి సన్నిధిలో సంక్షిప్తముగ మన శైవమతోత్కర్షమును గురించి ప్రస్తావించుటయు, యోగి శ్రీ నాగలింగ శివారాధ్యులవారి యాధ్యాత్మిక రచనలలో నుత్కృష్టములైన బ్రహ్మపథము, శ్రీమన్నీలకంఠ భాష్య శివ చింతామణి ప్రభా వ్యాఖ్యా గ్రంథములను జగద్గురువులకు స్వయముగనే సమర్పించుటయును గూడ తటస్థించెను. శ్రీవారీ గ్రంథములను స్వపావన హస్తములతోడనే యందుకొని కించిదవలోకనముచే స్థాలీపులా కన్యాయమున నేతద్గ్రంథ ప్రాశస్త్యమును గుర్తించినవారలై రచయితలు లింగీభూతు లగుటచే తమకు తద్దర్శనావకాశము కలుగదాయెను గదాయని సుహానుభూతిని వెల్లడించిరి.

ఇక శ్రీ జ్వాలాపతిశాస్త్రిగారిచే స్వదత్త కావ్యసమస్యా పూరణమును గావింప జేసి,మిగుల నానందించి యొక యర్ధఘంటకాలము శ్రీ శాస్త్రిగారితో శైవమతగోష్ఠి నిగూడ సల్పియుండుట తటస్థించెను. శ్రీ శాస్త్రిగారికి ప్రేమ పూర్వకాదరముతో నొక పండిత శాలువనుగూడ సదక్షిణాకముగా ప్రదాపరోనము చేసిరి.

ఇట్లు మహాప్రామాణికులును, తపశ్శీలురునగు శ్రీ శృంగగిరి జగద్గురువులు మన శైవమతమును సన్మానించుట మనకు బహుశుభావహ సంఘటనమని మన మెంచవలసియున్నది. శ్రీ మదుత్తరాదిద్వైత పీఠస్థులు మొదలగు ఘనపురుషులే కొందరు శైవమతమున గల ఆర్షానార్ష విభాగమును తెలియకుండిరని ఇటీవల శ్రీవారలతో ముచ్చటించిన కొందరు విమర్శకులు చెప్పిరి. సర్వమత సర్వజాతి చరితముకు కూలంకషముగ నెఱింగి యుండవలసిన బాధ్యతాయుత జగద్గురు. పదపట్టభద్రులగు శ్రీ శృంగగిరి స్వాములవారు మన

యార్ష శైవమత మనూచాన సంప్రదాయ విశిష్టమైనదనియు, నీయది నీలకంఠ భాష్య పరిపోషితమైన చక్కని శ్రౌత సంప్రదాయ మనియును సెలవిచ్చి, యోగిశ్రీ నాగలింగ వ్యాఖ్యా సనాథీకృతమైన భాష్యప్రతినే స్వహస్తముతో మన ఆరాధ్యశ్రీల వలన నందుకొనుట మన శైవమునకు పరమశుభావహ మనుటలో నతిశయోక్తి యుండదుకదా.

ఇట్లు జగద్గురు సమ్మానితమైన మన శ్రౌత శైవ సంప్రదాయమును మనవారు చక్కని సముల్లాసముతో నిర్దుష్ట సాంప్రదాయిక విజ్ఞానానుష్ఠానముల సేకరించి సముచితౌన్నత్యమునకు దెచ్చికొనుట స్వీయులకు శ్రీ పరశివానుగ్రహ కారకమగుటయే గాక అస్మచ్చాతుర్వర్ణ్య శిష్యసంతాన సంతారణమునకు సైత మెంతయు సహకరించును గదా !

శివం భూయాత్

# శ్రీ సిద్ధరామేశ్వర స్తవము

సాహిత్య విద్యా ప్రవీణ తిగుళ్ళ వేంకటేశ్వర శర్మ, B. O. L.

పరమేశా! కరుణారసంబొలుక నాపై నీ కటాక్షద్వయిన్
బరపం జాలుర! జేసికంటినిటు విప్పంబోకురా! నేను దు
ష్కర దర్పమ్మున నీదుపైఁ గవియఁగాఁ గందర్పుఁడన్ గానురా!
శరముల్ గావివి పూలుమాత్రమె గిరీశా! సిద్ధరామేశ్వరా!

నటరాజా! భవదీయ నాట్యసమయాంతమ్మందు నీచేత ను
త్కట ధాటిన్ పదునాల్గు మారులుగ ఢక్కన్ బట్టి మ్రోగింపఁగా
నిటలాక్షా! వెలికతురాలు వెడలెన్ నీఢక్కలోనుండి త్వ
త్పటుతన్ మెచ్చుగ నేరి శక్యమగు దేవా! సిద్ధరామేశ్వరా!

శర్వా! నీవని కేమనంగవలె విశ్వశ్రేయముం గోరి యా
శర్వాణిన్ గొని పెండ్లియాడుమని పుష్పాళ్ నీపయిన్ జల్ల నా
గీర్వాణేశ్వరుఁ డంపవచ్చు మరు బుగ్గిన్ జేసి తేలా పయిన్
శర్వాణిన్ గయికొంటి వేలనొ గిరీశా! సిద్ధరామేశ్వరా!

కనుచూపులే లేని జనుపాంధుఁ డైనను
మూఁడుకన్నులఁ దాల్చు మోముపైన
తలపైన వెండ్రుకల్ మొలువనియట్టి ఖ
ర్వాటుఁడు తల జటా జూటమొందు
తలనిండ స్నానమే తప్పి చేయనివాఁడు
తలనుండియే గంగ తరలఁ జేయు
విషజంతువుల జూచి వెఱఁగొందు భీరువు
హాలాహలమె కంఠమందుఁ దాల్చు

సూర్యునొక కొంతసేపైనఁ జూడలేని
వాఁడు— భాస్కర చంద్ర వైశ్వానరులను
లోచనత్రయమునఁ దాల్చి చూచు, నీదు
సేవఁ జేసిన మాత్రనే సిద్ధరామ!

## 20

అరుణోదయమ్మున నవగాహనము సేసి
        యర్చింపలేదని యలుగఁ బోకు
మారేడు దళముతే కోరితెమ్మన్న నీ
        మాటయే విననని మండిపడకు
బూదియేచాలు నాపూజకు నని యన్న
        నదియైన నీయలేదని యలుగకు
నీరైనఁ బోయురా! నీచేతులారగా
        ననినన్నుఁ జూడఁగాఁ గినుకపడకు

    ఏమిలేకున్న నన్ను దర్శించి పోర!
    అన్నమాటను పాటింప వనకుదేవ!
    నేను జేసెడి పనులన్ని నీదు పాద
    సేవయే కద! కావుమో సిద్ధరామ!



# శైవసిద్ధాంతము

## కీ॥ శే॥ మహామహోపాధ్యాయ శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారు

ద్వైతము, అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతాద్వైతము. శివాద్వైతము అను వానిలో శైవు లవలంబించిన సిద్ధాంతము అద్వైతమని కొందఱును, ద్వైతా ద్వైతమని కొందఱును, విశిష్టాద్వైతమని మఱికొందఱును, నభిప్రాయ పడుచున్నారు. ఇంక గొందఱు శైవ సిద్ధాంత మిదియని నిర్ధారణచేయనే వీలులేదని యెంచుచున్నారు. మరికొందరు శైవసిద్ధాంత మిదియని నిర్ధారణ కానిది భాష్య మిదియను నిర్ధారణంబును కానేరదని యుద్దేశపడుచున్నారు, కావున నీనిర్ణయం బావశ్యకమని తోచెడిని.

విద్వన్మణులారా,

ఈ యంశమున నాలోచింపగా పూర్వకాలమున శైవము, వైష్ణము మొదలగువానినే ప్రధానమతములనుగా నెంచినట్లును, ద్వైతాద్వైతాదు లుపాసనాధర్మములగుట నైచ్ఛికములుగాననీని నప్రధానమతములుగా నెంచి నట్లును, కనబడు చున్నది.

కావుననే శైవము, వైష్ణవము మొదలగు ప్రతి ప్రధాన మతమునందును ద్వైతాదు లవాంతరమతములుగా నున్నట్లు పెక్కు నిదర్శనములు కలవు, అది యెట్లన,

మొదట మొదటిదగు శైవ మతమునందు జూడుడు,

శ్రీ శివాగమములయందు, పతిః, పాశః, పశుశ్చేతిపదార్థత్రిత యమ్మతం అని ద్వైతమే సిద్ధాంతము చేయబడి యున్నది. దానిని బట్టి శ్రీ మల్లికార్జున పండితులవారు శివతత్త్వసారమునందును, శ్రీహర దత్తా చార్యులవారు శ్రుతిసూక్తి మాలయందును,అద్వైతమును ఖండించి ద్వైతమునే సిద్ధాంతము చేసియున్నారు. దీనింబట్టి శైవపూర్వాచార్యులు ద్వైతమునందు సమ్మతిని కనబరిచినట్లు స్పష్ట మగుచున్నది.

ఇదిగాక శ్రీశివపురాణములయందు అద్వైతము కన్పట్టుచున్నది. ప్రభు లింగలీల మొదలగు గ్రంథములయందు అద్వైతానుభవము నిరూపింప

బడి యుండినట్లు లింకే గ్రంథమునందును కన్పట్టదు. దీనింబట్టి శైవ పూర్వా చార్యులలో కొందరభావము అనుభవాద్వైతమునంద భిరుచి కలిగియున్నట్లు తెల్లమగుచున్నది.

ఇది యిట్లుండ శ్రీకంఠ శివాచార్యులవారు బ్రహ్మ సూత్ర భాష్యము నందు విశిష్టాద్వైతం సాధయిష్యామః అని విశిష్టాద్వైతమును నిరూపించి యున్నారు. దీనింబట్టి విశిష్టాద్వైతమునందును శైవ పూర్వాచార్యులలో కొందరు అభిమానము కలిగియున్నట్లు విశదమగుచున్నది.

ఇట్లే వైష్ణవ మతమునందును నామతమునకుపరమ ప్రమాణము లయిన పాంచరాత్రాగమములయందు ద్వైతమే సిద్ధాంతము సేయబడియున్నది. అయినను శ్రీ విష్ణు పురాణములయందు అద్వైతమే కన్పట్టుచున్నది. వైష్ణవ మత పూర్వాచార్యులలో కొందరక ద్వైతాభిమానములేనిది విష్ణుపురాణముల యందు నద్వైతము నిబద్ధమై యుండనేరదుగదా. అట్లైనను, శ్రీరామాను జాచార్యులవారు శ్రీభాష్యమునందు విశిష్టాద్వైతమును సిద్ధాంతము చేసి యున్నారు.

దీనింబట్టి శైవ వైష్ణవాది మత పూర్వాచార్యుల యుద్దేశ మేమియని యాలోచింప వలయును. వారు జ్ఞానలోపముచే యథేచ్ఛముగా నట్లు నిర్ణ యించిరని వచింప వీలులేదు. పూర్వాచార్యులు సామాన్యముగా జ్ఞానపరి పూర్ణులని యే యంగీకరించి తీరవలయును. అట్లుగాకున్న వీరిలో కొందరే జ్ఞాన పూర్ణులనియు నిర్ణయింప నయుక్తముగాన నందరు జ్ఞాన శూన్యులేయని యంగీకరింపవలసి వచ్చునుగాన దానింబట్టి మతములకే యప్రామాణ్యము వచ్చును. కావున పూర్వాచార్యుల యాశయ మిదియని యంగీకరింపక తప్పదు. ఏమనిన

ద్వైత భావముతోగాని, అద్వైత భావముతోగాని, లేక విశిష్టాద్వైత భావముతోగాని యే భావముతోనైనను శివునినే ప్రధానముగా నుపాసింప వలయునని శైవ పూర్వాచార్యుల యాశయము. అట్లే విష్ణునే ప్రధానముగా నుపాసింప వలయునని వైష్ణవ పూర్వాచార్యుల యాశయంబు నగునని యేర్పడు చున్నది. దీనింబట్టి శైవ వైష్ణవాదులు ప్రధాన మతంబులును, ద్వైతాదు లుపాసనా ధర్మంబులుగాన నవియట్లు ప్రధానమతంబులు కావ నియు నిశ్చయమగు చున్నది.

దాననే శైవవైష్ణవాది మతములకు పరస్పర భిన్నములగు నాచార విశేషములు ప్రమాణ సిద్ధములై యున్నవిగాని యట్లు ద్వైతాది మతములకు నాచార విశేషములు గన్పట్టుటలేదు. దీనింబట్టి శైవవైష్ణవాదులే ప్రధాన మతములనియు, ద్వైతాదుల ప్రధానమతములనియు, నిరూఢమగుచున్నది.

పూర్వకాలమున, నీభావమే స్థిరమైయుండి రానురాను కొంత కాలమునకు నీ భావము మార్పునొంది ద్వైతాదులే ప్రధాన మతములనియు శైవ వైష్ణవాదులే అప్రధాన మతములనియు నెన్నవలసి వచ్చుటకు కొన్ని కారణములేర్పడియెను. అందు శ్రీ శంకరాచార్యులవారి మత సంస్కరణము ప్రధాన మయినది.

అది యెట్లనిన, శ్రీ శంకరాచార్యులవారు అద్వైతమే ప్రధాన మతమనియు శైవవైష్ణవాదులే అప్రధాన మతములనియు సిద్ధాంతము చేసియుండిరి. వారి కామార్గము నవలంబించుటన్న నింకొండు మార్గము కార్యసాధకము కాదు.

ఏలన, వారు సిద్ధాంతము సేయు కాలమున శైవాది షణ్మతములును నెక్కువ ప్రచారమున నున్నవి. దీనికి ఆనందగిరి కృత శంకర విజయమే నిదర్శనము. వారు తమ మతమునకు శైవాది షణ్మతములలోనిదగు నేదేనొక నామము నిర్దేశింప వీలులేదు. అట్లేని కడమ యైదు మతములవారునువిరోధింతురు. అప్పుడన్ని మతములవారిని సమాపర్జనము చేయుటకు వీలులేక పోవును. కావున సర్వ మతస్థులను స్వమతమున జేర్చుకొనుటకు నాయా మతములకు బాధకముగాని సామాన్య నామకరణము గావించుటయే యావశ్యకము. దానంజేసి స్వమతమునకు నద్వైతమనియే నామకరణము గావింపబడియెను. అద్వైతమను పేరు సామాన్యముగ భేదమనుదానినే నిర్మూలనము చేయును గాన, మతభేదములను పాటింప నియ్యకుండుట వింతగాదు. దీనిం బట్టి యీ పేరు మతభేదముల నణచి సకల మతములను సమరసము చేయ ననుకూలముగా నున్నది,

అట్లేని ఈపద్ధతి నప్పటివారెట్లు విశ్వసించిరని యడుగుదురేని లోకోపకారమునకై యట్టు లంగీకరింపవలసివచ్చెను. ఏలన,

శ్రీ శంకరాచార్యులవారు స్వమత సిద్ధాంతము సేయునాటికి నీలోకమంతయు శైవ వైష్ణవాది మతకలహములచే నల్లకల్లోలముగా నున్నది.ఎట్లన

శివయను శబ్దమును వైష్ణవులుచ్చరింపరు. విష్ణు అను శబ్దమును శైవులు వినరు. శైవులు విష్ణుని పూజింపరు. వైష్ణవులు శివునివంక జూడరు. వైష్ణవులను శైవులు గ్రామములోనికి రానీయరు. శైవులను వైష్ణవులు దేశమునుండి వెడలనడతురు. లోకమిట్టి సంకట స్థితియందుండి సంస్కరణము నపేక్షించుచుండెను. ఆయదనున శ్రీ శంకరాచార్యుల వారవతరించి శివకేశవులకుభేదములేదని యుపదేశింప నారంభించిరి,

వారికి స్వసిద్ధాంతమునుబట్టి యెందును లేని భేదము శివకేశవులయెడ నెట్లుండును? అంతదనుక మతకలహములచే విసుగు నొందియున్న వారికి నీవాదము మిగుల రుచింప జొచ్చెను. దానింబట్టి తండోపతండములుగ జనులు చుట్టు మూగిరి, అప్పుడాచార్యులవారు వారికిట్లు బోధించిరి.

శివుడనినను, విష్ణుఁడనినను నొక్కఁడే. ఇద్దఱకు భేదములేదు. కావున శివుని, కేశవుని, శక్తిని, గణపతిని, గ్రహపతిని నందఱను పూజింపుఁడు. అట్లుగాక, వీరిలో నొక్కనియందు మీకెక్కుడు భక్తికలదేని నద్దేవుని నడుమనిడి తక్కువారిని పరివారములోఁ జేర్చుడు, అని బోధించిరి. ఆబోధ జనులకు తృప్తికరముగా నుండెను,

దేవతలు మనము కల్పించినవారేగాన వారిలో నెవ్వని ప్రధానపీఠ మెక్కించినను, మరియెవ్వరిని పరివారమున నిల్పుండ బెట్టినను ఇదియంతయు మన యధికారములోనిదే యని వారి యూహ.

అది యెట్లయిన నుండుగాక, ఎక్కువ మతాభిమానముగల యాకాలమున నీబోధ ప్రజల కెట్లు రుచించెనని యడుగుదురేని ప్రజలకుగల మతాభిమానము, దేవతాభిమానము అద్వైత బోధతో నస్తమించి యుండెను. అద్వైత సిద్ధాంతమునందు తత్త్వము నిర్గుణమేగాని సగుణము కానేరదు. వ్యవహారమున సగుణ మంగీకరింపఁబడినను అది యుపాసనకొఱకు కల్పింబడినదేగాన ఎంతమాత్రము సత్యమైనదిగాదు. దీనింబట్టి జగము యొక్క నామరూపములవలె దేవునియొక్క నామ రూపములవలె దేవునియొక్క నామ రూపములును కల్పితములేగాని నిజము కానేరవు. ఇట్లు శివకేశవాదుల యొక్క నామములు, రూపములును కల్పనములై నిజము కానప్పుడు ఈ నిజము తెలిసిన వారికి దేవతలయొక్క నామముల మీదగాని, రూపములమీదగాని, వృథాభిమాన మెట్లుండును? ఇఁకనద్దేవతలనామరూపములనుగూర్చి కలహమేల ప్రవర్తించును?

ఈకారణమున శైవవైష్ణవ సంఘాది మహానదులు చాలవఱకు అద్వైత మహాసముద్రమునందస్తమించినవి.

వెనుకఁజెప్పిన విధమున పంచాయతనమునందు శివుని ప్రధానముగా నుపాసించినది శైవము, విష్ణుని ప్రధానముగా నుపాసించిన నది వైష్ణవము. ఇట్టులివి యన్నియు నద్వైతమున నంతర్భూతములు. అద్వైతమున ప్రధానమైనది. ఇట్లు అద్వైతము ప్రధాన మతమనియు, శైవము, వైష్ణవము మున్నగునవి యైచ్ఛికములుగాన నవియట్లు ప్రధానములుకావనియు నప్పు డేర్పడియెను.

దానినిబట్టి కొంతకాలము గడచినమీద నవతరించిన శ్రీ రామానుజా చార్యులవారు స్వమతమునకు విశిష్టాద్వైతమని నామకరణము గావించిరి. వారి కదియు నావశ్యకమయ్యెను. ఏలన, తమ మతము వైష్ణవమని చెప్పి నంత మాత్రమున నద్వైతమునకు ప్రతిద్వంద్వి కానేరదు. వైష్ణవంబును అద్వైతమునకు నంతర్భూతమై బాధకము కానందున వైష్ణవమనగనే అది మాకు నిష్టమేయని యద్వైతులను మోదింతురుగదా? అట్లు గాక విశిష్టాద్వైత మనునెడ నద్వైతు లంగీకరింపరు. అప్పుడద్వైతమును ఖండింప ననువగును. కావున స్వమతము ప్రధానముగా వైష్ణమే యయినను విశిష్టాద్వైతమను నామకరణము గావించు కొనుట వారికి విధియయ్యెను.

తరువాత మధ్వాచార్యులవారు వెల్వడి తమ మతము రెండిటికి వేరుగా ద్వైతమని సిద్ధాంతము సేసిరి. అట్లుగానిచో వారికి మతమే ఏర్పడక పోవును. ఏలన, వారిది వైష్ణవమతమే కావున వైష్ణవమనఁగనే రామానుజ మతముననె యంతర్ధానము చెందియుండునుగదా? ఇట్లు మధ్వాచార్యులది వైష్ణవమతమే యయినను వేరుగా తమ మతము నిలువఁబెట్టుకొనుటకు తమ మతమునకు ద్వైతమని నామకరణము గావించికొనుట యావశ్యకమయ్యెను.

ఈవిధమున పెక్కు కారణములచే ద్వైతాది మతములె ప్రధానముగను శైవవైష్ణవాది మతములె యుపప్రధానములుగను పరిణమించుట సంభవించెను. శైవము ప్రధానమతమే యైనను తరువాత జరిగిన మార్పునుబట్టి శైవుల మతము ద్వైతమా అద్వైతమా? అనుశంక అవకాశము కలుగుచున్నది. ఇంక యేగ్గాక నిజమునుబట్టి యిట్టి శంక కవకాశములేదు. అయినను తక్కు మతముల వారితో బాటు శైవులదియు ద్వైతమో అద్వైతమో అను నిర్ణయము అవసరమను భావము కొందఱకు గలదుగాన వారి యాశయమును బట్టియు, ఇప్పటికి దొరికిన ప్రమాణములను బట్టియు నిట్లు నిర్ణయింప వలసి వచ్చుచున్నది.

శైవులంగీకరించిన సిద్ధాంతమునకు శివాద్వైతమని పేరు.

ప్ర॥ అదియెట్లు? శ్రీ శివాగమములయందు ద్వైతమే సిద్ధాంతము సేయబడి యుండెననియు శ్రీ మల్లికార్జున పండిత స్వాములవారి చేతను శ్రీ హరదత్తాచార్యులచేతను అద్వైతము ఖండించి ద్వైతమే సిద్ధాంతము సేయ బడియెననియు మీరు చెప్పియుంటిరిగదా? ఇక శివాద్వైతము శైవుల సిద్ధాంత మెట్లగు ?

ఉ॥ శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు అద్వైతమును ఖండించినది నిజము. అయినను వారు ఖండించినది శుద్ధాద్వైతముగాని, శివాద్వైతము కాదు.

ప్ర॥ ఈ యంశము మెట్లు తెలియును?
ఉ॥ శివ తత్త్వసారము,
క॥ తనకంటె వేరెయీశ్వరుడన లేడని పలుకునట్టి యద్వైతవిమూ
ఢునకును లోకాయతునకు వినఁగా భేదమ్ముగలదె విష్ణువరేణ్యా!
అని యనేక విధముల శుద్ధాద్వైతమును ఖండించి కొనకు,
క॥ అద్వైతైకస్థితి నీయద్వైతముకాన యీశ్వరాద్వైతము స
ర్వాద్వైతమనగ వేరు జగద్విపరీతమగు తత్త్వగతిగలదె శివా॥

శాస్త్రములయందు జెప్పబడు నద్వైతము ఈశ్వరాద్వైతమనగా శివా ద్వైతమేయనియు సర్వాద్వైతమనగ శుద్ధాద్వైతము అయ్యది శివాద్వైతము. కంటె వేరు భిన్నమైనదనియు నిర్ణయించి యున్నారు.

ప్ర॥ అగుగాక వారు శుద్ధాద్వైతమును ఖండించి సిద్ధాంతమును జేసినది ద్వైతమేయని చెప్పియుంటిరి. తిరిగి వారు శివాద్వైతము నెట్లు సిద్ధాంతము నేసి యుండిరి,

ఉ॥ శ్రీ మల్లికార్జున పండితులవారు మొదట నిరూపించిన ద్వైత సిద్ధాంతమునకును, కొనకు దెలిపిన శివాద్వైతమునకును నెంతమాత్రము భేదములేదు, అట్లు భేదముండునెడ స్వవచనవ్యాఘాతముగా వారలేల చెప్పియుందురు? కావున పూర్వాచార్యుల వాక్కునందు విశ్వాసముంచవలయు గాని సంశయము పెట్టికొనగూడదు. అట్లు సంశయము పెట్టుకొనినవానికి శ్లో॥ సంశయాత్మా వినశ్యతి నష్టము కలుగుననియు చెప్పబడియున్నది,

ప్ర॥ శివాద్వైతమని పేరేల పెట్టవలయును? కేవలమద్వైతమనిన జాలదా?
ఉ॥ చాలదు. అదియేలన- శుద్ధాద్వైతము శ్రీమల్లికార్జున పండిత శ్రీహారదత్తాదులచే ఖండింపఁబడియున్నది గాన నది శైవుల సిద్ధాంతము కాదు, కావున శివాద్వైతమే శైవుల సిద్ధాంతమని యంగీకరింపవలయును.

ప్ర॥ ప్రభులింగలీలయందును మఱికొన్ని శైవమత గ్రంథములయందును శుద్ధాద్వైతము నిరూపింపఁబడియుండఁగా నది శైవుల సిద్ధాంత మెట్లుగాదు?

ఉ॥ శైవమత గ్రంథములయందుఁ జెప్పఁబడినది శివాద్వైతమే. అట్లు గాక కొన్నిచోట్ల శుద్ధాద్వైత సిద్ధాంతము ప్రతిపాదింపఁబడియున్నను అది శైవ పూర్వాచార్యులచే ఖండింపఁబడియున్నదిగాన శైవుల సిద్ధాంతమని యంగీక రింపగూడదు.

ప్ర॥ శైవమత గ్రంథములయందు కొన్నిచోట్ల శుద్ధాద్వైతమును నిబంధించినవారును శైవపూర్వాచార్యులేగాన వీరియందు విశ్వాసముంచి శుద్ధాద్వైతమునే యేలగ్రహింపగూడదు?

ఉ॥ శుద్ధాద్వైతము కొన్ని గ్రంథములయందు శైవ పూర్వాచార్యులే నిబంధింది యుందురుగాక. అయినను శైవమతప్రతిష్ఠాపనా పరమాచార్యులగు శ్రీ నీలకంఠాచార్య, శ్రీ హరదత్తాచార్య శ్రీ మల్లికార్జున పండిత ప్రభృతులు శుద్ధాద్వైతమును నిరాకరించి యున్నప్పుడు దానిని స్వసిద్ధాంతముగా గ్రహింపగూడదు.

ప్ర॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారే శైవమతప్రతిష్ఠాపకులని యేల గ్రహింపగూడదు?

ఉ॥ శుద్ధాద్వైతమును నిరూపించినవారు మధ్యకాలికులు శివపురాణములలో గొన్నిటియందు శుద్ధాద్వైతము కలదని దానినేనమ్మిన వారు తమగ్రంథములయందు చేర్చియుండవచ్చును. అట్లుగాక అద్వైతబోధ లోకమంతయు నిండి సర్వమతస్థులను నావరించియున్నది గాన మధ్యకాలికులు కొందరు అద్వైతానుభవమున నాసక్తిగలవారై యుండి యద్దానిని తమ గ్రంథముల యందు జేర్చినను చేర్చియుండవచ్చును. అంతమాత్రమున వీరి వాక్యములనే నమ్మి శైవమత మూలాచార్యులుచేసిన సిద్ధాంతమును త్రోసివేయనగునా? కూడదు.

ప్ర॥ అట్లని వీరిగ్రంథములను ప్రమాణములుగా నెట్లుతీసికొనవచ్చును?

ఉ। కడమ యంశములయందు ప్రమాణములుగా బాగుగ గ్రహింపవచ్చును.

ప్ర॥ అదియెట్లు? ఇది అర్ధజరతీ న్యాయముకాదా?

ఉ॥ కాదు అదియెట్లనిన ఆపస్తంబుడు ఆశ్వలాయనుడు మొదలగు ఋషులందరు ద్వైతమునె సిద్ధాంతముచేసి అద్వైతమును ఖండించియున్నారు. అయినను అద్వైతమతస్థులు ద్వైతసిద్ధాంతాంశమున వారి గ్రంథములయందు ప్రామాణ్యబుద్ధి లేకున్నను కర్మములజెప్పు తక్కిన యంశములయందు ప్రామాణ్యబుద్ధి లేకుండునెడ బ్రాహ్మణ్యమునకే హానివచ్చుననియెంచి ఆ యంశమున పరమప్రామాణ్యబుద్ధి నుంచియే యున్నారు. అట్లు మధ్యకాలికులు చేసిన శైవమత గ్రంథముల యందును శుద్ధాద్వైతమును నిరూపించినచోట నప్రామాణ్యంబును, కడమయంశములయందు పరమప్రామాణ్యంబును నుంచిననేమి బాధకము? ఏమియు బాధకములేదు.

ప్ర॥ ద్వైతాద్వైతమే శైవుల సిద్ధాంతమని యేల గ్రహింపగూడదు?

ఉ॥ పూర్వాచార్యులట్లు దెలిపియుండిన బాగుగ గ్రహింప వచ్చును. పూర్వాచార్యులే గ్రంథమునందైనను ద్వైతాద్వైతమును సిద్ధాంతముచేసి యుండలేదు. ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనియు జెప్పియుండలేదు. కావున ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతముగాదు.

ప్ర॥ అదియేమి ? శ్రీపతి పండితస్వాములవారు శ్రీకరభాష్యమున ద్వైతాద్వైతము సిద్ధాంతము చేసియుండిరికాదా?

ఉ॥ శ్రీకరభాష్యమున ద్వైతాద్వైతము కలదన్నమాట నిజమే. అయినను ఆ భాష్యము పేరుగాని, దానియందగు ద్వైతాద్వైత సిద్ధాంతము పేరుగాని శైవ పూర్వాచార్యులలో నొక్కనిచేనైన నొక్కచోనైన నుదాహరింపబడియుండని కారణముననను దోషభూయస్త్వమును బట్టియు అనభ్యస్తమగు శైలినిబట్టియు నాభాష్యము కేవలము నవీనమని పెక్కువిధముల నిరూపింపబడియున్నదిగాన దానిలోనిదగు ద్వైతాద్వైతము శైవుల సిద్ధాంతమనుట సమంజసముకాదు. శైవ సంఘమునకు కీర్తిదాయకంబునుగాదు.

ప్ర॥ శైవుల సిద్ధాంతము శివాద్వైతమని మాత్రము పూర్వికులలో నెవ్వరుచెప్పిరి. క్రొత్తగ మీరిప్పుడు పేరుపెట్టిన నెవ్వరంగీకరింతురు?

ఉ॥ శైవుల సిద్ధాంతమునకు శివాద్వైతమను పేరు మేముపెట్టినదికాదు. సిద్ధాంత శిఖామణి మామందల వీరభద్రసుధీరచితమైన హైయంగవీన వ్యాఖ్యానమునందు. శ్లో॥ శివాగమై శ్శివాద్వైతరహస్యైః పారమార్థికైః। కథ్యతే శివసిద్ధాంత తంత్రంషట్స్థల నిర్ణయం॥ అని కలదు. శ్లో॥ శివాద్వైత పరిజ్ఞాన పరమానందబోధితం॥ ఆ పరి.

అని మొదలుగా శైవసిద్ధాంత గ్రంథములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని వ్యవహరింపబడి యున్నది. దానింబట్టి ప్రాచీనులు శివాద్వైత కల్పలతిక ఈ మొదలగు గ్రంథములయందు శైవుల సిద్ధాంతము శివాద్వైతమని నిర్ణయించియున్నారు. దానింబట్టి మధ్యకాలికులును విద్వత్కవీంద్రులునైన శ్రీ ములుగు పాపయారాధ్యుల వారును పరమశివాద్వైత పండితుండ అని వ్రాసికొనియున్నారు. కావున శైవుల సిద్ధాంతము శివాద్వైతమనుట శైవపూర్వాచార్య సమ్మతమే,

ప్ర॥ శివాద్వైతమే యగుగాక. అద్దానిని ప్రతిపాదించు భాష్యమేది?

ఉ॥ శ్రీ నీలకంఠభాష్యమే బ్రహ్మసూత్ర భాష్యములలో శివాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించునది యగును.

ప్ర॥ అది శ్రీకంఠభాష్యము కాదుగదా?

ఉ॥ కాదని యెవ్వరు చెప్పిరి. రెండు నొక్కటేయగు

ప్ర॥ దీనికేమి ప్రమాణము.

ఉ॥ రెండు వేర్వేరనుటకే ప్రమాణముకావలయుగాని రెండునొక్కటి యనుటకు నే ప్రమాణముతోను పనిలేదు. అయినను సాత్విక బ్రహ్మవిద్యా విలాస నిరసనమను గ్రంథమున.

సీ॥ పరమశివాద్వైత పరనీలకంఠాఖ్య
ఘనభాష్యకారు శ్రీకంఠుఁబొగడి॥ అని యున్నది.

దీనింబట్టి నీలకంఠభాష్యమును రచించినది శ్రీకంఠయోగియేయనియు. ఆ భాష్యము శివాద్వైతమునే ప్రతిపాదించుననియు శైవమత గ్రంథకర్తల యొక్క దృఢనిశ్చయమేయని యేర్పడియెను.

ప్ర॥ భాష్యములు రెండు నొక్కటియే యగుగాక. అందు విశిష్టాద్వైతము సిద్ధాంతము చేయఁబడినట్లు ప్రసిద్ధముగానుండ నాభాష్యము శివాద్వైతమును ప్రతిపాదించుచున్నదని యెట్లు విశ్వసింపవలయు?

ఉ॥ సాత్విక బ్రహ్మవిద్యావిలాస నిరసనకారుఁడు మొదలగు ప్రాచీన శైవపండితులయొక్క మాటనుబట్టియే. మరియు విశిష్టాద్వైతమనుమాట శివాద్వైతమను దానికి సమానార్థకమేగాని భిన్నార్థకము కానేరదు.

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ నీలకంఠభాష్యము ద్వితీయాధ్యాయమున చిదచిత్ప్రపంచ విశిష్టశ్శివపవాద్వితీయః కారణం కార్యంచ భవతీతి విశిష్టశివాద్వైతం అని కలదు. దీనింబట్టి విశిష్టశివాద్వైతమన్నను విశిష్టాద్వైతమన్నను నొక్కటియేయని తెలియుచున్నది. శ్రీకంఠభాష్యము శివాద్వైత ప్రతిపాదకమని శైవపండితులు నిర్ణయించినదేగాక విమతపండితులగు శ్రీహాలాస్యనాథశాస్త్రిగారును శ్రీకంఠభాష్యముయొక్క యుపోద్ఘాతమునందు శివాద్వైతపరమని వ్రాసియున్నారు. ఇట్లు స్వమతపండితులును విమతపండితులును నేకగ్రీవముగాఁ జెప్పిన్నయర్థమందును మీ సంశయము దీరదేని ఇఁక నద్దానిఁదీర్ప బ్రహ్మకైన నలవిగాదు గాన నింతటితో ముగించుచున్నాము. దీనిఁబట్టి శైవులవలంబించిన సిద్ధాంతము శివాద్వైతమే యనియు దానిం బ్రతిపాదించునది శ్రీకంఠ భాష్యమే యనియు నీ యర్థము పురాతనాధునాతన సకల శైవపండిత సమ్మతమనియు నిర్ణయింపఁబడియెను.

---

శ్రీ గణేశాయనమః

# అష్ట గ్రహ కూటారిష్ట యోగ విచారం

శ్రీ నిర్మల అంబయ్య సిద్ధాంతిగారు

---

శ్లో॥ స్వభజనరత విఘ్నధ్వాంత విధ్వంస భానుః
కమలజ కమలేశాద్యైస్సుత స్వేష్ట సిద్ధ్యై
విలసే దలఘు శుండాదండ సంతాడితారిః
దితిసురిసుతా యా నందనో మంగళం వః॥

భారత ప్రజలకు దెలియజేయుట యేమనగా—

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥

ఏ యుగమందైననుగాని— అధర్మము ప్రబలినచో ధర్మరక్షణ కొరకు భగవంతుడు అవతరించే లక్షణములు కనుపట్టుచున్నవి. విమర్శించి చూడగా ఈ సమయమందుకూడా ధర్మాచరణకు అనేక సంకటములు కలుగుచున్నవి. ప్రజలు ధర్మముల నొదిలి కర్మభ్రష్టులై సంచరించుచున్నారు. దేశములో దైవారాధన లోపించుచున్నది.

సీత, సావిత్రి, అనసూయ, అరుంధతి ఇత్యాది పతివ్రతలయొక్క ధర్మాచరణలు నామమాత్రమైనా జ్ఞాపకం లేకుండా పోవుచున్నవి. ఇదివరలో ఆచరించిన సత్ప్రవర్తనలపై అశ్రద్ధ మెండగుచున్నది. సమాజవాదము, సామ్యవాదము— వీటి ద్వారా జడవాదముల ప్రభావము మిక్కిలి శ్రద్ధతో నంతట ప్రచారమగుచున్నది. పెద్ద పెద్ద శిక్షాలయములయందు నాస్తికులను జన్మింపచేయుటకై అనేక కర్మాగారములు సిద్ధమగుచున్నవి. ఎప్పుడు ఈశ్వరుడనువాడు లేడో, అప్పుడు పరలోక పాప పుణ్యవిచారములు ఎక్కడివి? తర్వాత కృతజ్ఞత, నీతి, ప్రభుభక్తి— ఇవి స్వప్నతుల్యము లాయెను. దేశములో కొన్నిచోట్ల చోరత్వము, అత్యాచారము, ధన హరణము, మోసము, అనాచారము వ్యభిచారము, భ్రష్టాచారము, బలాత్కారము ఇత్యాది ఘోరకృత్యములు ప్రబలుచున్నందున దీనత్వము, దారిద్ర్యములచే ప్రజలు పీడింపబడుచుండిరి. తినుటకు అన్నము. కట్టుటకు బట్టలేక డబ్బునకు కటకటపడుచున్నారు. ఇన్ని

అపశకునములు పరిణమించుచుండగా ఇంకేమి గలుగనున్నదో! ఇట్టి అనియంత్రిత, ధర్మ విచారవిహీన స్థితి వినాశమునకే సంకేతమని దెలియుచున్నది.

## రానున్న కూటారిష్ట యోగములు

1961 ప్లవనామ సంవత్సరములో— అశ్విన బ॥ 13, నవంబరు 6వ తేదీ లగాయతు డిసెంబరు 8 వరకు తులారాశియందు చతుర్గ్రహ కూటము.

కార్తీక బ॥ 11 డిసెంబరు 3వ తేదీనుండి డిసెంబరు 15 వరకు వృశ్చిక రాశియందు చతుర్గ్రహ కూటము.

మార్గశిర బ॥ 10 సోమవారము 1-1-1962 నుండి మకరరాశియందు చతుర్గ్రహ కూటారంభము.

పుష్య శు॥ 1 ఆదివారము 7-1-1962 నుండి మకరరాశియందు పంచగ్రహ కూటారంభము.

పుష్య శు॥ 12 బుధవారము 17-1-1962 నుండి షష్ఠగ్రహ కూటారంభము.

పుష్య బ॥ 3 మంగళవారము 23-1-1062 నుండి మకరరాశియందు సప్తగ్రహ కూటారంభము.

పుష్య బ॥ 13 శనివారము 3-2-1962 నుండి మకరరాశియందు అష్టగ్రహ కూటారంభము.

మాఘ శు॥ 1 సోమవారము 5-2-1962వ రోజున మకరరాశియందు అష్టగ్రహ కూట నివృత్తి.

మాఘ శు॥ 5 శుక్రవారము 9-2-1962వ రోజున సప్తగ్రహకూట నివృత్తి.

మాఘ శు 8 సోమవారము 12-2-1962వ రోజున మకరరాశియందు షష్ఠగ్రహకూట నివృత్తి.

మాఘ శు॥ 14 ఆదివారము 18-2-1962వ రోజున మకరరాశియందు పంచగ్రహకూట నివృత్తి.

మాఘ బ॥ 13 ఆదివారము 4-3-1962వ రోజున మకరరాశియందు చతుర్గ్రహకూట నివృత్తి.

## జనన ఫలము

సప్తగ్రహ అష్టగ్రహ కూటములందు జన్మించిన వారికికూడా అరిష్టము. ధనుర్మకర మిధునలగ్నములయందు జన్మించిన శిశువులకు బాలారిష్టయోగము.

మేషలగ్నమునకు మాత్రము రాగయోగముండును. అష్టమ వ్యయాధిపతి సంబంధముచే యోగభంగమని గ్రహించవలెను.

## చతుర్థ పంచగ్రహకూట ఫలములు

శ్లో॥ ఏకరాశౌ యదాయాతి చత్వారః పంచఖేచరాః
ప్లావయన్తి మహీం సర్వాం రుధిరేణ జలేన వా॥

ఏకరాశియందు నాలుగుగాని, ఐదుగాని గ్రహములు చేరినచో భూమి యందంతట జలమయమైనను, రక్తమయమైనను కాగలదని యుండగా 6 7, 8 గ్రహములు ఏకరాశియందు వచ్చుటచే ఎంత పెద్ద అరిష్టయోగమో ఊహించుట కష్టము.

## సప్తగ్రహకూట ఫలము

శ్లో॥ సప్తగ్రహైః యదైకస్థ గోలయోగ స్తథా భవేత్
దుర్భిక్షమ్ రాష్ట్రపీడాచ తస్మిన్ యోగే నృపక్షయః

సప్తగ్రహములు ఏకరాశిగతులైనపుడు గోలయోగ మనబడుచున్నది, ఈ యోగఫలము దుర్భిక్షము, అనావృష్టి లేక అతివృష్టి, రాష్ట్రపీడ, రాజులకు అరిష్టము కలుగును.

## అష్టగ్రహకూట ఫలము

అష్టగ్రహకూటము ఇదివరలో ఎప్పుడు రానందున ఇట్టి యోగమందు అనేక ఉపద్రవములు కలిగి, ప్రజలు అతివైరములచే రోగపీడితులై నశించుచుందురు.

## నవగ్రహకూట ఫలము

మకరరాశియందు రవి, చంద్ర, కుజ, బుధ, గురు, శుక్ర, శని, కేతువు లుండి తొమ్మిదవ గ్రహమగు రాహువుయొక్క సంపూర్ణదృష్టిచే చూచుట వలన నవగ్రహ కూటమని కూడా అనుకొనవచ్చును.

ఈ యోగారంభమునకు ముందు వెనుక ఆరుమాసముల వరకు ఈ అరిష్టయోగ మగుపడుచుండును. అనేకారిష్టములు గలుగుచుండును. ఈ యోగము ఘోరమగు వినాశనమునకే సంజ్ఞగా గనబడుచున్నది. గడచిన మహాభారత యుద్ధమునందు గూడా ఇన్ని గ్రహములు ఒక జోటికి రాలేదు.

క్రీ. శ. 1934 జనవరిలో బీహారు రాష్ట్రములో భయంకరమైన భూకంపము వచ్చియుండెను. ఆ సమయమునందుకూడా సప్తగ్రహకూటము

మాత్రమే యుండెను. ఈ సమయముననో! సమస్త గ్రహములు ఏకరాశియం దుండుటచే, అష్టగ్రహకూట ఫలము జ్యోతిశ్శాస్త్రములయందు, ఒక ప్రకారమైన ప్రళయకాలమని గుర్తెరుగవలయును. దీనినే "వినాశాయచ దుష్కృతాం" అను గీతావాక్యము స్పష్టముగా కనబడుచున్నది, ఇదియేగాక ఇంకను అనేకములైన దుర్యోగములు జ్యోతిశ్శాస్త్రరీత్యా గనబడుచున్నవి. రెండవది- సాధన అనుష్ఠాన పురుషులయొక్క వాక్యములు, స్వప్నములు. వివిధములైన సంకేతములు కనబడుచున్నందున, తొందరలోనే కొలది సంవత్సరములలో అనగా శకే 1885 సంవత్సరమున పుష్యమాసము క్షయమగుచున్నది. శకే 1903వ సంవత్సరమున మార్గశీర్షమాసము క్షయమగుచున్నది, ఈ క్షయ మాసముల మధ్య సంవత్సరములలో జగత్తునందు విశేషమైన పరివర్తనము గాగలదని స్పష్టముగా గోచరించుచున్నది.

ఇటువంటి కఠిన సమయమునందు మేము ప్రత్యేకముగా వ్యక్తు లందరికి చెప్పుట ఏమనగా- మనయొక్క, మనదేశము యొక్క క్షేమము గావలయునను సంకల్పముచేత, ఈ ఘోరమైన అష్టగ్రహారిష్టము నుండి తప్పించుకొనుటకు భగవదారాధన కన్న వేరే యుపాయము కనపడుటలేదు.

కనుక ప్రతి మనుజుడు దుష్కర్మలు చేయుటయందు మనస్సుపోనీక, పుణ్యకర్మలు జేయుటకై దృఢసంకల్పము గలవారై దృఢ ప్రయత్నశీలురు గావలెను.

ఈ రీతిగనే అందరు ఆచరించినచో, ఈశ్వరుని కృపవలన మన భారత దేశమునకు ఉపకారము చేసినట్లగును. ఈ అష్టగ్రహ కూటారిష్టము మన ఆంధ్రదేశమునకేకాగ మొత్తము భూమండలమునకే అరిష్టయోగము గలది. దీనికి ప్రమాణములు అనేకములు గలవు. గ్రంథ విస్తర భీతిచే వ్రాయనైతిని. జలమయమైనను లేక రక్తపాతమైనను, జగత్తంతట కాగలదని కనబడుచున్నది; 5 లేక 6 గ్రహములు ఏకరాశికి వచ్చినచో ఇట్టి ఫలము గలుగునని యుండెను. అష్టగ్రహకూట ఫలము ఎంత అరిష్టసూచకమో చెప్పనవసరము ఉండదు.

5 లేక 6 గ్రహములు సంవత్సరములో ఏదో ఒక మాసమునకు వచ్చినట్లుకాదు. ప్లవనామ సంవత్సరమందు అశ్విన, కార్తీక, మార్గశీర్ష, పౌష, మాఘాది ఈ 5 మాసములయందు ఈ యోగ ముండుటచే, అవగా ఈ కూటములు క్రమముగా చతుర్గ్రహ కూటము, పంచగ్రహ కూటము, షష్ట గ్రహ కూటము, సప్తగ్రహ కూటము, అష్టగ్రహ కూటముగా 5 మాసములయందును వచ్చుట మహాదరిష్టయోగ మనబడుచున్నది.

## గ్రహ యుద్ధము

పంచ తారాగ్రహములగు కుజ, బుధ, గురు, శుక్ర, శనులు ఏకరాశి గతులగుటచే గ్రహయుద్ధ మనబడును. ఇది కూడా అరిష్టసూచకమని గుర్తెరుగ వలయును.

## గ్రహయోగజన్య ఫలాని

శ్లో॥ రవీందు శుక్రేజ్య శశాంకపుత్రా
యద్యేకరాశౌ సహితా భవంతి
మేఘాః ప్రవర్షంతి మహార్ఘతా
స్యాత్ప్రజావినాశో దిశి నైరుతాయాం॥

## గ్రహపీడా పరిహార కృత్యము

శ్లో॥ దేవబ్రాహ్మణ వందనా ద్గురువచః సంపాదనా త్ప్రత్యహం
సాధూనా మపి భాషణా చ్ఛ్రుతిరవ శ్రేయస్కథా కర్ణనాత్
హోమా దధ్వరదర్శనా చ్ఛుచిమనో భావాజ్జపాద్దానతో
నో కుర్వంతి కదాచి దేవ పురుష స్యైవం గ్రహపీడనమ్॥

తా॥ దేవ బ్రాహ్మణ వందనము, గురు ఆజ్ఞా పాలనము ప్రతి రోజు సాధు సజ్జన సహవాసము, వేదపాఠము, పురాణ శ్రవణము, హోమము, యజ్ఞ దర్శనము, మన శ్శుచిత్వము, నవగ్రహ జపము, పంచాక్షరీ-అష్టాక్షరీ-గాయత్రీ పునశ్చరణ, గోదాన, భూదాన, అన్నదానములు మొదలగు సత్కర్మ లాచరించువారికి అష్టగ్రహ కూటారిష్టము గలుగనేరదు.



# భగవంతుడున్నాడు

## సిద్ధశ్రీ

కొద్దిరోజులక్రితమే జరిగిన యీ క్రింద వ్రాయబోవు సంఘటనను పరికించిన వారిలో కొందరికి మాత్రము విచిత్రముగా దోచవచ్చును. కాని ఈ స్థాణు జంగమాత్మకమైన సకల ప్రపంచమునే యొక యాటవస్తువునుగా జేసికొని, దానియందు నిరంతర సుఖ దుఃఖాదులచే వ్యామోహితులగుచున్న జంతుకోటుల యొక్క అనుభవములను నిమిత్తముగా విలాసపడుచున్న పరమేశ్వరుని లీలలు వర్ణనాతీతములు. ఆతని సంకల్పమును ఊహించుటకు నలవికానిది. ఒకడు పరమ దరిద్రుడై కూటికి గుడ్డకు లేక నిరంతరము కష్ట పరంపరలచేత కుళ్ళి కుళ్ళి విలపించుచుండ మరియొకడు జీవితావధి కోటీశ్వరుడై నిరవిచ్ఛిన్న సుఖ సంపత్తులచేత తులతూగుచున్నాడు. ఒకడు సంతాన విహీనుడై దుఃఖించుచుండ మరియొకడు బహు సంతానవంతుడై సంతృప్తి నొందుచున్నాడు. ఒకడు క్షయాది రోగజాలములచేత పీడింపబడుచుండ మరియొకడు పరమారోగ్యవంతుడై సుఖించుచున్నాడు. ఇట్లు ప్రపంచమున జన్మనెత్తిన ప్రతి మానవుడును ఏదేనియొక సుఖ దుఃఖములచేత తనయాయుష్షు ముగియు వరకును సుఖపడుటయో దుఃఖపడుటయో జరుగుచునే యున్నది. ఇట్లు జరుగుచుండుటకు మానవునికంటె యతీతమగు నేదియో యొకశక్తి కలదని విశ్వసించవలెను.

అట్లుగాక మానవుడు దరిద్రుడగుటకును ధనవంతుడగుటకును సంతాన హీనుడగుటకును, సంతానవంతుడగుటకును, అనారోగ్యవంతుడగుటకును ఆరోగ్యవంతుడగుటకును మానవుని యొక్క ప్రయోజనకారియగు మేధా సంపత్తియే మూలకారణ మగుచున్నది కాని కంటికి కనపడక, మనస్సునకూ ఊహింపరాక యుండి మానవునకంటె అతీతుడగు భగవంతుడున్నాడను మాటలను మేము నమ్మజాలమని పలుకు కుశాగ్ర బుద్ధుల కిదియొక సవాలు వంటిది.

మాయావృతమగు ప్రపంచమున నిమగ్నుడగు మానవుడు కేవలము అధఃపతితుడు కాకుండ నుద్ధరించుటకు భగవంతుడు చిత్ర విచిత్రములైన మార్గములను సృష్టించి యుండెను. వీని రహస్యమును తెలిసిన యనుభవజ్ఞులగు మహర్షులు తదుపాసనా బలమున తాము తరించిరి. అంతమాత్రమున సం

తృప్తి పడక మూఢజనుడున్ను తరించుటకై వలయు సులభ సాధనములను కొన్నింటిని సేకరించిరి. అట్టివానిలో భగవంతుని మనన ధ్యానరూపము లగు మంత్ర యంత్ర పద్ధతులు నొక ముఖ్యసాధనము. "దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం" అనికదా యాస్తికుని సిద్ధాంతము.

భగవంతుడును స్వేచ్ఛ ననుసరించి తన యంశచే నాయా స్థలముల యందు వెలయుచు సేవకుని సకలబాధా నివారకుడై లోకమునకు తన యాస్తిక్యము నెరుకపరచు చున్నాడు. వీనినే పుణ్యక్షేత్రములనియు, దేవాలయములనియు వాడుచున్నాము. వీనిలో "స్వయంభూ మందిరము'' లనియు, మరికొన్ని యుపాసకుని యుపాసనాబలముచే సిద్ధి నొందింపబడిన యంత్ర ప్రతిష్ఠితములగు "దివ్య మందిరము''లనియు చెప్పబడు చున్నవి.

అతి పురాతన కాలమున నొక మహర్షియొక్క తపస్సునకు సంతుష్టి నొంది ప్రత్యక్షమైన మహేశ్వరుడు ఆ మహర్షి యొక్క కోరిక ననుసరించి సామాన్య మానవునకు కూడ సకలాభీష్టముల నొసంగుచు చిరకాలము నిలుచుటకై స్వయంభువుగా నవతరించిన దివ్యక్షేత్రము శ్రీ సిద్ధ రామాలయము. ఇచ్చోట ప్రతినిత్యము జరుగుచున్న యనేక సంఘటనలనుండి యొకదాని నిట పొందుపరుచు చున్నాను ఇట్టి ప్రత్యక్ష నిదర్శనములచేత ఋజువైననేగదా యల్పబుద్ధి మనస్సు దివ్యభావము నొందుచున్నది.

శ్రీశైలము, దాక్షారామము, కాళహస్తుల యందలి త్రిలింగములు ఎల్లలుగా గలిగిన దేశము తెలుగుదేశము. కృష్ణా, గోదావరీ మొదలగు పవిత్ర నదులచే పుణ్యవంతమైన యాంధ్ర రాష్ట్రమునకు సకల సంపత్తులచే తుల తూగుచున్న రాజధాని భాగ్యనగరమన్న పేరుగల హైదరాబాదు నగరము. ఆ పట్టణమునకు నరువదిమైళ్ళ దూరమున (స్టేషన్) "బిక్కనూరు'' అనునొక గ్రామము కలదు. ఆ గ్రామమునకు నొక మైలుదూరమున ప్రశాంతమైన ప్రదేశములో నొక చిన్న కొండపైన 'శ్రీ సిద్ధరామేశ్వర స్వామి' యాలయము కలదు. అచ్చోటు వచ్చిపోవు జనంబులచే నెల్లపుడును త్రొక్కిస లాడబడుచు కొలచినవారి యాపత్తులెల్ల తొలగిపోవ నవ్వారి మ్రొక్కుకొను మ్రొక్కులచే నిరంతరము సంక్షుభిత మగుచుండును. అందు విశ్వకళ్యాణ సంధాయకమై దివ్య మహిమాన్వితమైన యొక్క స్వయంభూ లింగము బహు ప్రశాంతమై యొప్పుచుండును. అచ్చటికి పండితుడును పామరుడును, ఆస్తికుడును, నాస్తికుడును వీరు వారననేల ఆ కరుణామయుని మహిమ దెలిసిన ప్రతి మానవుడును ఎపుడో యొకప్పుడు వెళ్లి కోరికలను సిద్ధింప జేసికొను చున్నాడు. అట్టివారిలో నొకరికి కలిగిన యనుభూతినే

యుట పొందుచు చున్నాను. ఈ దివ్యక్షేత్రమునకు సుమారు నూరుమైళ్ల మేరకు "మంగళవారముపేట" యనునొక గ్రామము కలదు. అది సంగారెడ్డి జిల్లాయందలి నారాయణ్ ఖేడ్ తాలూకాకు చెందినది, ఆ గ్రామమున ఆస్తిక మతావలంబియై యార్యవంశ జాతికి జెందిన "చారము శంకరయ్య" యను శ్రీమంతుడుండును ఆతడు శారీరక ధర్మ సంబంధములగు నిత్య కృత్యముల నడుపుకొనుచుండియు పారమార్థిక ధర్మ విచారణలయందు ఆసక్తి కలిగియుండును. ఆతనికి సర్వవిధముల ననురూపవతియగు భార్య సౌభాగ్యమ్మ. ఆ దంపతులకు నెట్టి కొరతలు లేక సర్వోపభోగంబులచే కాలము చల్లగా గడిచిపోవుచుండెను, కాని విలాసియగు పరమేశ్వరుడు ఊరకుండడు గదా! ఆయన భార్య సౌభాగ్యమ్మ యొక్కనాడు నిత్యకృత్యముల నెరవేర్చుకొని ప్రశాంత వాతావరణములో శయనించియుండ నర్ధరాత్రివేళ హఠాత్తుగా నామెకు శిరోవేధ సంభవించెను. వెంటనే ప్రక్కనున్న భర్తను లేపి తనకు తలయందు విపరీతమగు నొప్పి కలుగుచున్నదనియు దానికి వెంటనే తగిన యుపశాంతి కలుగని యెడల భరించలేననియు చెప్పగనే యాదుర్దాపడిన భర్త తనయింట గలిగిన నాయా మందులను ప్రయోగించి లాభించక పోగా బాధ మరియు మిక్కుటమగుచుండెను తక్షణమే గ్రామమందలి వైద్యుని రావించి యాతనితో విశ్వప్రయత్నము చేయించుచుండినను బాధ యతిశయించుచునే తెల్లవారెను. అంత నా వైద్యుడు నానేర్చిన విద్యనెల్ల సాధించితిని. ఇంక నీయమను ఏదయిన నగరమునకు కొనిపోయిన మంచిదని సెలవిచ్చి వెళ్ళిపోయెను, పాపము, కలత పడుచున్న ఆ యమాయకుడు చేయునది లేక ధనికుడగుటచే రాజధానియగు హైదరాబాదునకే చేరికొనెను. అచ్చట పేరుగాంచిన పెద్ద డాక్టరులనెల్ల మార్చుకొనుచు నా రోగముతో సాముచేసెను 'తుదకు సివిల్ సర్జనులు కొందరు ఈ వ్యాధి నివారణకు వలయు సాధనములు మదరాసు నగరమున నున్నవి కావున నచటికి కొనిపోవుట యుత్తమమని సలహా యిచ్చిరి. ఏ రూపమునను తనభార్య బాధ దప్పించుట ఆతని తలంపు కావున నచటికి పయనించి యందలి స్పెషలిస్టుల నెల్ల నేదోవిధమున పరిచయము చేసికొని మితిమీరిన ధనవ్యయముతో కాలము గడువ వారితో నసాధ్యమనిపించుకొనెను. భోగ్యమును తారుమారు చేయుటకు మానవు డెంతవాడు. ఇట్లు కాలము, ధనమున్ను వ్యర్థమగుచుండ తనకు బాధవల్లను తన నిమిత్తము అన్నిపాట్లు పడుచున్న భర్త యొక్క యాయాసము వల్లను విసుగుజెందిన యాయిల్లాలు మానవాసాధ్యమయిన యీ వ్యాధికి భగవంతుడే నివారకుడనియు కనుక తమ కులదైవమగు సిద్ధ రాముని సేవింతుమనియు భర్త నంగీకరింపజేసి తిరుగు ప్రయాణమున నచటికి చేరిరి. అచ్చట నియ్యది నిత్య నియమములుగా నుండెను. శక్తి

ననుసరించి మహాన్యాసము చేతను, రుద్రాభిషేకము చేతను శివలింగము. నర్చించి తీర్థప్రసాదముల స్వీకరించుట. ప్రతి నిత్యము ఉదయాస్తమయముల యందు నియమముగా ఆలయమునకు ప్రదక్షిణము నొనర్చుట. ఆతడు రెంటిని యాచరించుటకు పదకొండు దివసముల దీక్షను పూని సక్రమముగా పూర్తిచేసికొనెను. బాధ యుపశమించక పోవుటయేగాక యెన్నడులేని తీవ్రతరమగు నవస్థ సంభవించెను. నాటిరాత్రి యామెపడు బాధకు ప్రక్క వారును నిద్రాహారములు మాని యచట చేరిరి. అర్థరాత్రి వరకు మైక ముననున్న యామెకు హఠాత్తుగా లేచి కూర్చుండి చూచువారలకు కడు నాశ్చర్యమును కలిగించుచు నీక్రింది విధమున జెప్పసాగెను. తానొక విశాలమైన ప్రశాంతమగు ప్రదేశమున పయనించి యుండ యొక మహాస్త్రీ యుడు ఆధునిక వేషమున వచ్చి నా తలకు నాపరేషన్ జేసి యందుండి యొక కీటకమును బైటకుదీసి నాకు చూపించుచు దీనివల్లనే నీకింతటి బాధ కలుగు చుండెను, ఇకముందు నీకి యవస్థ యుండదని చెప్పి వెళ్ళిపోయెను ఇప్పుడు నాకెంతయో సుఖముగా నున్నదనిచెప్పి తన శిరోభాగము జూపెను. ఆహా! యెంత యాశ్చర్యము! ఎప్పుడో కోసి మాసిపోయిన దానివలె రెండం గుళముల పొడవుగల యొక్కమచ్చ చూచినవారి కందరకును కనపడెను. అది నేటికిని కలదు. ఇట్టి చిత్రాతి చిత్ర కార్య సంఘటనా ధురంధరుడై సులభ సాధ్యుడగు మహేశ్వరుని దివ్య లీలలను కాదనుటకు నెవ్వరకు సాహసము కలదు. ఇంకను ఇట్టి సంఘటనలను ముందు ముందు. మనవి చేసికొందును.



# భారతీయుని యాదర్శము

— ఆదర్శవాది

ఆహారము, నిద్ర, భయము మొదలగు ధర్మములు పశువు, పక్షి, మృగము ఆదిగాగల సర్వ జంతువులకును సాధారణములైనను సభ్యత, అసభ్యత అన్న విచక్షణ కలిగి ఇది చేయవచ్చు, నిది చేయకూడదను పరిజ్ఞానముచే ప్రత్యేకించబడుచున్నాడు మానవుడు. స్థూలముగా విచారించి చూచినచో నాతని ఇట్టి ప్రవర్తనమునకు రెండు ముఖ్యాధారములుగా కనుపట్టుచున్నవి. ఒకటి యాతనికి పరమ సుఖమును చేకూర్చి యున్నతాదర్శముల నాతని ముందుంచి నడిపించగల యనేక ధర్మమార్గములు. మరియొకటి కేవల శరీరపోషణమాత్ర పర్యవసితములై నిత్యజీవితమున నడిపించు విధానములు. అందు మొదటిది ఈ కనపడు చరాచర ప్రపంచమును సృష్టించి, యద్దానిని పోషించుచు తుదకు లయము నొందించగల సర్వసమర్థుడగు పరమేశ్వరు డొకడు కలడనియు, నిరంతరధ్యాన తపోనుష్ఠానాదులచే నాతని ప్రసన్నుని జేసుకొనిన మానవునకు జరామరణ దుఃఖభరితమగు సంసారమునుండి విముక్తి కలిగి మహదానందము నిచ్చు సుఖము సంప్రాప్తించుచున్నదని పారమార్థికమును బోధించుచున్నది. రెండవది— ప్రత్యక్షముగా కనుపడు నీ జడపదార్థము ఆకాశము, వాయువు, అగ్ని, నీరు, పృథివి యను పంచభూతములు నిమిత్తములుగా అణు సమ్మిశ్రమున నేర్పడియుండెను. దీనిని మించిన మరియొద్దియును లేదు. కావున నిట్టి ప్రపంచమున సాధకుని సాధించు సాధనా సంపత్తిచేతనే యాతని వలయు కోరికల ననుభవించుటలోనే సకల సుఖములు కలవు. కావున శారీరకములైన కామాదుల ననుభవించుటయే సుఖమును, అట్టి పదార్థములు లభించనపుడు దుఃఖమును కలుగుచున్నదని ఐహికమును చెప్పుచున్నది. ఇచట ముందు నైహికవాదమును కొంత విచారించి చూతము. శరీరపరిపోషణకై యభిలషితములైన యాహార శయన కామాదులను ప్రయత్నపూర్వకముగా సాధించికొని యనుభవించినచో మనస్సు కడు సంతృప్తిని పొందుటయే కదా సుఖమని చెప్పబడుచున్నది. స్థూలదృష్టితో చూచినయెడల నిది యత్యుత్తమమైన సిద్ధాంతముగా కనుపడుచున్నది. కనుకనే నేటి నవనాగరికులమని చెప్పుకొనుచున్న కొందరు సోదర మహాశయులు అట్టి మూలసిద్ధాంతమున ప్రమాణబద్ధులై శారీరక సుఖసాధనా రూపములైన బహువిధ ఆర్థిక విధానములను సృష్టించుకొనుచున్నారు. తదనుగుణములైన సామాజిక వ్యవస్థలను కూడ నిర్మించుకొనుచున్నారు. కాని ఇట్టి యాపాత మధురములై కనబడుచున్న సుఖసాధనా విధానములు ఎప్పుడు, ఎందు కలుగుచున్నవి. అనేక విష

యములచే నిండికొనియున్న ఈ జగత్తునందు అనేక రూపములైన కోరికల ననుభవించుటకు మూలకారణమగు ధనములేదే యని దుఃఖపడుచున్నాడు. ఒకవేళ నట్టి ధనమును వివేకవంతమైన బుద్ధి నుపయోగించి యనంతమగు ధనమును సంపాదించె ననుకొందము. అప్పుడును వాని మనస్సు దుఃఖపడు చునే యున్నది. ఏలనన అతనికి మిక్కుటమగు ధనము కలిగియున్నప్పుడు లోకాతీత సౌందర్యము కలిగి సంగీత సాహిత్య నాట్యశాస్త్రాది సకల విద్యా పారంగతయై తన కెప్పు డెయ్యది కావలయునన్న సకలమును చేకూర్చుచు నామోపభోగ్య యగు నొక భార్య కావలయును. అంతవరకును దుఃఖము పాయుటలేదు. అతడు ధనవంతుడు వివేకవంతుడు కనుక జగత్తునెల్ల గాలించి తన కనురూపవతి, యనుకూలవతియగు నొక భార్యను పొందెననుకొందము. కాని దుఃఖము మాత్రము తీరలేదు. తాను విశ్వప్రయత్నముచేసి ఎక్కడ నెవ్వరికి లేనంత ద్రవ్యము సంపాదించెను. అట్టి ఐశ్వర్యము తన జీవితానంత రము పరులపాలు కావలసినదేనా? అద్దాని ననుభవించుటకు తన యాత్మసంజ నితమైన సంతానము కావలయును. అది కలుగునంతవరకు దుఃఖించు చున్నాడు, దోషరహితమైన తన శరీర సంసర్గముచేతనే యట్టి సంతానమును పొందెననుకొందము, అతని మనస్సు సుఖపడుటలేదు. అన్నింట నప్రమత్తుడై నడుచుకొనుచుండినను అధికారుల చేజిక్కి చికాకు పరుచబడుచుండెను. అట్టి అధికారము తనకు లేనందువల్లనేగదా ఇట్టి చిక్కులు సంప్రాప్తమగుచుండెనని దుఃఖించుచున్నాడు. పోనీ తన ధైర్యవీర్యములచేత నట్టి యధికారమును సంపాదించినను అనివార్యమగు దుఃఖము అతనిని వదిలిపోవుటలేదు. అదియే మానవాసాధ్యమై యవిజ్ఞాతమగు మరణభయము. తానెంత ధనవంతుడయ్యు సంతానవంతుడయ్యు, అధికారవంతుడయినను ఎప్పుడు ఎక్కడ ఏ రూపమున తనకు మరణము సంప్రాప్తమగునో ఇట్టి ఐశ్వర్యాదులెల్ల తనకు కాకుండా ఏమయి పోవునో! కావున నిట్టి ప్రమాదగర్భితమైన భయంకర మరణావస్థను తప్పించుకొనజాలకుందునుగదాయని విలపించుచునే యున్నాడు. ఇట్లు నిరం తర నిర్విరామ నిర్విచికిత్సా దుఃఖపరంపరలలో తల్లడిల్లుచున్న మానవుని మానసమునకు ఆత్మానందమును చేకూర్చగలిగి సంపూర్ణ సుఖము నీయగలిగిన దేది? ధనాపేక్షితములయిన విషయములా? సంతానాపేక్షితమయిన ధనమా? అధికారాపేక్షితమయిన సంసారమా? లేక చిరాయురపేక్షిత మయిన అధికారమా? ఇందేదియును సుఖమును చేకూర్చుటలేదు. కావున అనిశ్చితమగు ప్రపంచమున నాభాసారూపములయిన సుఖము లాతని మనస్సు నకు విశ్రాంతి నిచ్చుటలేదు. కనుకనే శారీరక సుఖోపకరణములు మానవుని జీవిత పరమ లక్ష్యములని చెప్పు నైహికవాదము సిద్ధాంతము కావుట లేదు. పోతే ఏది నిజమయిన సిద్ధాంతమో విచారించుట బుద్ధిమంతుని లక్షణము. ★

# శ్రీ వీరభద్రోదాహరణము

విద్వత్కవి, శ్రీ మల్లంపల్లి వీరేశ్వరశర్మగారు.

---

(2 వ సంచిక తరువాయి)

### షష్ఠి

16 వక్షస్స్రజ్మధుమత్త బంభర విభాస్వద్భద్రకాళీశ్వరీ
వీక్షాలేపన గంధ సంకుమదముల్, హారంబదంశాగ్రధా
రాక్షోణీధర చిత్రగైరిక కృతి భ్రాంతి న్విరాజిల్లు, తే
పాక్షీ భర్తకు, వీరభద్రునకు. ద్రుహ్యాద్వైరి సంహర్తకున్.

### కళిక-ద్విరదగతి

17 కనకగిరిసారునకు, ఖండిత విపక్షునకు
మునిహృదయచారునకు, ముదిత స్వపక్షునకు
జలనిధి గభీరునకు, జలజాప్త నేత్రునకు
కలికలుషహారునకు, గంకాళ నేత్రునకు
కాలకాలాగ్ని దృగ్ఘర చంద్రహాసునకు
ఫాలేందు చంద్రికా భవ్యదరహాసునకు
కాలాగ్ని రుద్రునకు, గళ్యాణ భద్రునకు
పాలిత బ్రహ్మాండ పరమ చిన్ముద్రునకు.

### ఉత్కళిక

18, తానిలా మూర్తియై
తాను రసమూర్తియై
తన దాన యనలుండై
తనదాన యనిలుండై
తానభ్రభాసియై
తాన సోమాసియై
తనరు ఖర కిరణునకు
తనరు సిత కిరణునకు.

## సప్తమి

19. శివనిందాశ్రుతిరుష్ట దక్షతనయాచిచ్ఛక్తి యోగాగ్ని సం
భవతేజమ్మున, నాగమ ప్రథితతాత్పర్యంబునన్ దక్ష యా
గవనానీదమునో విశేషమున, భగ్న బ్రధ్నదంతమ్మునన్
గవనారామ వసంతసీమను, జగత్కల్యాణ ధామమ్మునన్.

### కళిక-వృషభగీతి

20. భక్త జనతా భవ్య కవితా
వరవసంత విజృంభణమ్మున
రిక్త భక్తి జడాశయాళీ
గ్రీష్మ భీష్మ విజృంభణమ్మున
భక్తవాంఛిత దానలీలా
వర్షకాభ్ర విజృంభణమ్మున
భక్తిపూత హృదభ్రవీధీ
భరిత శారద జృంభణమ్మున
మధురభక్తి సమగ్రజన హే
మంత వేళా జృంభణమ్మున
శిథిల మానస భవి వనానీ
శిశిరకాల విజృంభణమ్మున
సర్వజగతీ జనన భృతి హృతి
కాండ వీణా జృంభణమ్మున
సర్వశత్రు విదాహ దోహల
చటుల హాస విజృంభణమ్మున.

### ఉత్కలిక-హరిణగతి

21. ఏడు జలధులు నింకఁగ్రోలుచు
నేడు నగములు దూలవ్రాలుచుఁ
చుక్కలన్నియుఁ జెమట చుక్కలు
దిక్కులన్నియు నడుసుఁ ద్రొక్కులు
కన్ను లుమిసిన రవ్వలగ్నులు
కన్నసురలు భయాబ్ధిమగ్నులు
గాఁగఁబొల్చు మహామహమ్మున
రాగదూర సుఖావహమ్మున.

## సంబోధన

22. శా. శ్రీ కాళీస్తన గంధసంకుమద సుస్నిగ్ధాత్మ దోరంతరా
లోకద్రోహి వనీ కుఠార కరుణాలోకామృతా సేచనా।
శ్రీ కళ్యాణ నిదాన భక్తజనతా। శ్రీకంఠ ఫాలేక్షణా।
రాకానాథ సహస్రసుందరముఖా। రావయ్య భద్రేశ్వరా !

## కళిక

23. జయ కాళీకానాథ
జయ సర్వసురనాథ
జయ భక్త వలపేళి
జయశత్రు దంభోళి
జయ సర్వతోభద్ర
జయ జగత్ప్రియ రుద్ర
జయ భక్తి సంసాధ్య
జయ వీరనారాధ్య

## ఉత్కళిక

24. శ్రితకల్పము
కృతిశిల్పము
శ్రుతిరూపము
స్మృతిరూపము
స్థాపించిన
దీపించిన
భవదీపమ్ము
శివరూపము.

## సార్వవిభక్తికము

25. నీవే మూలము నిన్నె నమ్మి కొలుతున్, నీచే సనాథుండ, నీ
కై, వేడ్కొలిదె, లేఁడు దేవుఁడెట నీకంటెన్, గృతుల్ నీకుమ
ద్భావం బెప్పుడు నిల్చు నీ యెడన, భద్రా! నీవు నా వాఁడవై
ప్రోవన్వాంఛిత మొందునుం గలుగునే, పుణ్యైకలభ్యాకృతీ.

## అంకితాంకము

### హరిణగతి

26. అఖిల జగము క్రియాత్మకంబగు
నఖిల క్రియలు త్వదన్వయంబగు
నవియు నాఱేడయ్యె నెనిమిది
మొగి విభక్తులు మూర్తు లెనిమిది.
నలరు నీవయి యాత్మ యొకఁడుగ
వెలయు మధుర కవిత్వ మింపుగ
ప్రతివిభక్తియు భవత్రిశుద్ధిగ
రతిని నవగతి రగడల డరఁగ.

# దండకము

శ్రీ వీరభద్రా। జయశ్రీవినిద్రా। కృపాశ్రీసముద్రా। నమత్సర్వగీర్వాణ మూర్ధాళి జాగ్రత్ప్రసాదాబ్జ రూపాంఘ్రిముద్రా। శివజ్ఞానమూర్తీ జగచ్చక్రవర్తీ। నమచ్చిత్తవర్తీ। విఖండీకృతార్తీ। శివద్రోహియౌ దక్షు శీర్షమ్ము ఖండించి, దుర్భాష యౌ భూష నాసం దెగంగోసి, యాదిత్యు దంతంబులన్ రాలఁగాఁదన్ని, యవ్విష్ణుచక్రంబు డాకాలికిన్ గండపెండారమై యొప్పఁగా, సప్తజిహ్వచ్ఛి దాదీప్తబాహాసివై, కాలకాలుండవై, యాశరున్నీ శరచ్ఛిన్ను గావించుచున్, బాళి, దాఁబాళిగా, వాయుహస్త ద్వయీభంగ శృంగారివై, యర్థపుండర్థిగా, శూలినీపాలిగా, నింద్రుమైఁ చంద్రుమై, వేటాడి తూటాడి, జృంభించి నీవేకవీరుండవై యేకభద్రుండవై, తూస్తమూఢ భృగున్ శాస్తిగావించి, బ్రహ్మోత్తమాంగంబు నీపైఁడి పళ్లెంబుగా, నెల్ల బ్రహ్మాండముల్, వింతకై బంతులై వారాన్నిధుల్ దీర్ఘికాపాళులై హేలగా లీలగా నెల్లలోకమ్ము నీ వేలు గాథాకథల్, మాతృవిద్రోహి శిక్షా స్మృతుల్, సుస్మృతుల్, సుశ్రుతుల్, సుశ్రుతుల్, నిత్యశబ్దార్థముల్ సత్యలోకార్థముల్, చెప్పఁగా, నొప్పగా వర్ణనల్ సేయఁగా శక్తులెవ్వారు? నివ్వాళి దీపాళి తారాళి, సాంబ్రాణి ధూపాళి శ్యామాంబు భృత్పాళి, గంధాక్షత శ్రేణి నక్షత్రరించోళి, కర్పూరఖండంబు గ్లాబింబ ఖండంబు, వీటికరండంబు పాటీరశైలంబుగా, భూతిపాత్రంబు, ప్రాలేయగోత్రంబు, బాలార్కబింబంబు నీభక్తబృందంబు సద్భక్తి నీకిచ్చు నీరాజనంబయ్యె, కాళీమనః పద్మకేళీరిరంసా మహోత్సాహ హంసా। ప్రభో విశ్వతఃపాద। భోవిశ్వతోబాహ। భోవిశ్వతో వక్త్రి। భోవిశ్వతఃకర్ణ। భోవిశ్వతో నేత్ర। మాంపాహి, మాంపాహి మాంపాహి శంభో।నమస్తేఽస్తు శంభో।నమస్తేఽస్తు శంభో నమస్తే. శ్రీ శ్రీ

# శైవమత ప్రకాశిక చందా వివరములు.

సంపాదకులు

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | రు॥ | 116–00 |
| రాజ పోషకులు | | 50–00 |
| ప్రధాన పోషకులు | | 25–00 |
| పోషకులు | | 10–00 |
| అభిమానులు | | 5–00 |
| చందాదారులు | | 3–00 |
| విడిపత్రిక | | 0–25 |

## గమనిక

కొన్ని అనివార్యకారణములచేత మూడు, నాలుగు సంచికలు ఒకటిగాచేసి ప్రకటింపనైనది.

— *సంపాదకుడు.*

కృష్ణాపత్రిక ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాదు - (ఆం. ప్ర.)

# శైవమత ప్రకాశిక



## శ్రీ శైవ మహాపీఠము

1 - బి. పద్మారావునగరు, సికింద్రాబాదు.

పబ్లిషరు : శ్రీ పేట చిదంబరశాస్త్రి

# విషయ సూచిక



---

## మతము లన్నియును శివపారమ్యము జెప్పుచున్నవి.

శ్లో॥ త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవమితి
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మదః పథ్యమితిచ
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషాం
నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ.

ఓ మహేశ్వరా! భూమియందు ప్రవహించు నదులలో గంగాదులైన కొన్నింటికి సూటిగను, యమునాదులు మఱి కొన్నింటికి అట్టి గంగను జేరి తద్ద్వారాను, సముద్రము శరణ్యమైనటుల, వైదికము, సాంఖ్యము, యోగము, పాశుపతము, వైష్ణవము, అన్న వీభిన్నములైన నానామార్గములలో ఇది యుత్కృష్టము, ఇయ్యది యిష్టమని తమతమ యభిరుచి ననుసరించి సేవించుచున్న మానవులకు నేరుగనో, వక్రముగనో తుదకు నీవే పొందదగినవాడ వగుచున్నావు.

— పుష్పదంత గంధర్వుడు.

---

᱿

# శైవమతప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు
సచిత్ర మాసపత్రిక

సంపాదకులు— కందుకూరి వీరబసవరాజు

| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>25–8–61<br>శ్రావణ పూర్ణిమ | సంచిక 5 |
| --- | --- | --- |


## నేటి శైవుని విధి

శైవము, వైష్ణవము, శాక్తము, స్మార్తము అన్న భిన్నభిన్నములైన మతములెన్నియున్నను, నాదేవుడు శివుడు,నామతము శైవమతము, నా యాచారములు, శైవాచారములు నేను పూర్ణశైవుడనని సంతృప్తి నొందుచు కాలము వెళ్ళబుచ్చుచున్నంత మాత్రమున నది శైవాభిమానము గాదు. అది సంకుచితభావమే యగును. ఎవని యత్నము విశ్వకల్యాణమునకు నుద్దేశింపబడినదై యట్టి ప్రయత్నమువలన సకల జనమున్ను ఉన్నతాదర్శమునందు నిమగ్నమై యుండునటుల జేయుటకు జాలుచున్నదో యాతడే ధన్యజీవి. ఆతని సంకల్పమును సుశ్లాఘ్యమైనది. ఒకనాడు భారతీయు డిట్టి యుదారవంతమైన యాశయమున మసలినవాడగుట చేతనే యాతని యాదర్శము ఫలవంతమై మన కారాధ్య దైవమైనాడు. పండితుడై మానవుని యొక్క కర్తవ్యమును కూలంకషముగా చర్చించి తదౌన్నత్యమునందు ప్రవర్తించునటుల పురికొల్పుచుండ మహానాయకుడై విశ్వశ్రేయస్సు నభిలషించి తానాచరించిన దానినే ప్రజ యాచరించునటుల జేయ జూచినాడు. వ్యాసాది మహాపండితులును శ్రీ రామాది మహానాయకులును అగ

స్త్యాది మహర్షులును, మన కెంతటి యాదర్శమూర్తులై రి? వారంతటి జగత్పూజ్యతను గాంచుటకు ప్రధాన కారణము వారి నిష్కల్మష హృదయ పరివర్తనమే కాదా? వ్యాసమహర్షి అష్టాదశ పురాణముల యందు భిన్నభిన్నములగు మార్గముల నవలంబించినటుల గనుపట్టు చున్నను, ఆతని ధ్యేయము శివపరాత్పరత్వమునే చెప్పుచుండెను. జన సామాన్యము తమతమ యభిరుచుల ననుసరించి తత్వనిర్ణయమునందు ప్రత్యేకాభిమానమును జూపుచుండ నట్టివారు దైవసత్తాకమునందు ప్రమాణ బుద్ధులై యుండుటకు సంతసించి వారి యాస్తిక ధర్మమును కాపాడుట యాతని విధియై యుండెను. కొన్నిచోట స్థూలముగా శివేతర దైవతములయొక్క జగత్కారణత్వము నంగీకరించుచున్నటుల గనుపట్టుచున్నను వైశిష్ట్యమును శివునియందే వ్యాపింప జేసెను. ఆది శక్తిని శివుని భార్యగా జెప్పెను. గణపతిని, కుమారస్వామిని శివకుమా రులనుగా జేసెను. విష్ణువును మాటిమాటికి నవతరింపజేసి శారీరకధర్మ, ముల నిమగ్నుడై యుండుట నిరూపించుటయేగాక యిట్టి యవతార ములచేత కలిగిన దోషమును పోగొట్టుకొనుటకు శివోపాసన జేయించెను. విష్ణువు సహస్ర కమలార్చనచేత శివుని మెప్పించి లోకసంరక్షణార్థము. చక్రమును బడసియుండ, మత్స్య కూర్మ వరాహాద్యవతారములయందు నాయాయి పేరులచేత శివలింగ ప్రతిష్ఠ జేయబడుట వర్ణించెను. శివు నకు జగద్రక్షణావసరంబుల నయోని సంభవాదులైన లీలల ప్రాదుర్భా వములను నుతించెను. శ్రీరామచంద్రుని యభిమతమైన మతమేదియై యుండెనో! దానిని నిరూపించుటకు ప్రచుర గ్రంథప్రామాణ్యము మనకు చిక్కకుండినను ఆతడు బహుకాలము దక్షిణాపథమున నివసిం చిన దినములలో అగస్త్యుని యుపదేశమువలన శివోపాసనా నిరతుడై యుండినటుల మాత్రము మన మూహించ వచ్చును. ఇంతియేగాక శివ భక్తాపచారము వలన కలిగిన ఘోర పాపమునుండి విముక్తుడగుటకు రామేశ్వర దివ్యక్షేత్రము నందు శివలింగ ప్రతిష్ఠ జేసియుండెను. ఈ రామేశ్వరము ఉత్తరమునందలి కాశియంతటి ప్రాశస్త్యమును వహించు టకు నాతని విశుద్ధ సంకల్పమే కారణమేమో! ఒకనాడిట్లు సామా న్యుడు మొదలు మహారాజువరకు పామరుడు మొదలు మహర్షివరకును పరమాత్మయన శివుడే యని, తన్నిరతులై భరతదేశమున శైవమును

విజృంభింప జేసిరి. అట్టి శైవము నేడు నామమాత్రమై నిలచియుండ దానిని పూర్వోన్నత దశకు కొనితెచ్చుట నేటి శైవుని ముఖ్య శిక్ష కాదా! ఆత డీక్రిందివి ముఖ్య సూత్రములుగా నడుము కట్టవలెను. శివుడే పరతత్త్వ వాచ్యుడు. శ్రుతిస్మృతి పురాణాదులు శివు నెట్లు స్తుతించుచున్నవి, శైవమెప్పుడు పుట్టినది, దాని విజృంభణము, శైవాచారములు, వాని వైశిష్ట్యము, శివోపాసనా పద్ధతులు. శివభక్తులు వారి జీవిత చరిత్రములు, శివస్థల మాహాత్మ్యములు శైవ మితర మతముల యందెట్లు సమన్వయ పడుచున్నది. మున్నగునవి, యాస్తికరతుడైన ప్రతి పండితుడును వ్యక్తిగతముగను పత్రికల మొఖమునను జన సామాన్యమునకు సులభ బోధ్యములై వానియందు ప్రసక్తు లగునటుల నొనర్చుటకు యత్నించుచుండు గాకయని ఆశించుచున్నాము. ★



# గమనిక

మా పత్రికకు చందాలు పంపువిషయమై లోగడ సంచికలో అభ్యర్థించి యుంటిమి, అందుకు అభిమానులందరు ఈ రాగలసంచిక చేరులోపున సికిందరాబాదునందలి మా శైవపీఠ కార్యస్థానమునకు నేరుగాగాని మణియార్డరు ద్వారాగాని పంపి మాచే రసీదును తెప్పించుకొనగలరని కోరుచున్నాము.

శైవ మహాపీఠము
1. B. పద్మరావు నగర్
సికిందరాబాద్.

# భగవతో నామ నవరత్న ప్రకాశః

శతావధాని, జ్యోతిర్విద్యా విశారద,

## శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రిగారు

---

(1) శ్రీ శాదిస్తుత సర్వమంగళ గుణగ్రామైకసీ మన్మహాన్.
బ్రహ్మాండాఖిల జీవసృష్ట్యవన నాశోద్యోగమూర్తి త్రయ
మర్త్యాఽమర్త్య నిశాచరాది సకలాభీష్టార్థ ముక్తిప్రద
శ్రేష్ఠా శ్చే దిశతేర్హణా కృతిమతిం శంభోకృపాంభోనిధే.

(2) నిత్యాలింగిత సర్వమంగళతయా ర్ధాంగీకృతంచాత్మనో
దాంపత్యం కమనీయతాం మధురతా మన్యోన్య సంభావితాం
లోకైక స్తవనీయ పుణ్యాచరతా మాచిద్యం తరానూహ్యతాం
భక్తానాం హృదయే ప్రబోధయతి భో శంభో కృపాంభోనిధే.

(3) సేవాతత్పర భక్తమానస మనస్సంచారహంస ప్రభో
అజ్ఞానాంధ జనాఽ జవం జవమహాంభోరాశి నావ్యోత్తమ
త్వన్నిర్హేతుక జాయమానకరుణా సారామృతాస్వాదనాఽ
నందాత్మాక మిమం ప్రసీద్య కురు మాం శంభో కృపాంభోనిధ

(4) సారూప్యం [illegible]పదర్శనా కృతివిధౌ సందృశ్యతే ప్రత్యహం
సాలోక్యం తవపంచవర్ణ జపతస్సామీప్య మాజన్మతః
నిత్యం సద్గురు జంగమార్చనవిధౌ సాయుజ్యమేతన్మహా
బ్రహ్మాండం తవ దేహభావన తయా శంభో కృపాంభోనిధే.

(5) కాన్యాజ్జంతు చయస్య చోత్తమగతి స్స్యాత్తైఃకథం లభ్యతే
కోదాతా వదతీతిచాత్మని సదా సంచింతయద్భ్యః పరం
శంభోః పాదయుగం వినా కిమపి నాస్తీతి స్ఫుటంభూతలే
మౌనీంద్రైః శ్రుతిభిః ప్రబోధితమితి శ్రీకంఠకంఠోదితం.

(6) శ్రీ కళ్యాణ గుణైకధామ మభవం శంభుం వదంత్యాగమాః
తద్రుద్రేశశివాది శబ్దవిషయేఽ జ్ఞానావలిప్తాత్మనః
కేచిస్స్వార్థపరా అపార్థ మవదన్ తేభ్యో నమ స్సర్వదా
తేషాం దేవగణోపి వంద్య ఇతిమే సద్భక్తి పుష్పాంజలిః

(౭) అద్వైతం తదుపాసనా విధి విధౌ ద్వైతం సపర్యావిధౌ
తస్యానుగ్రహ సత్ప్రసాదహిత భోగప్రాప్తకాలావధౌ
భూయాద్భక్త జనస్యసాధిత విశిష్టాద్వైత సిద్ధిః పరా
త్రీణ్యేతాని విరుద్ధధర్మ విషయానీతి ప్రసంగ త్కథం.

(౮) నేత్రే తద్వపురావలోకనవిధౌ కర్ణేచ గాథాశ్రుతౌ
జిహ్వాం నామషడక్షరే పఠనకృత్యే మే శిరః పాదయోః
పూజాయాంచకరౌ ప్రదక్షిణ విధౌ పాదౌ చరత్వామనః
సోహం నిత్యశివోహ మిత్యనుభవానందో భవామి ప్రభో.

(౯) శబ్దాయే ప్రచలంతి సర్వధరణీ భాషాసు సర్వాస్వపి
సర్వేతే గిరిజా స్వరూప ఇతిలోకేసుప్రసిద్ధః ఖలు
అర్థశ్శంకర రూప ఇత్యపిచ తేషా మాగమోపాదితః
శబ్దార్థద్వయ తుల్యభాసితతనూ శ్రీ పార్వతీ శంకరౌ॥

(10) అర్ధాంగీకృత దంపతీత్వ విషయో యస్మిన్ భవేత్సార్థకః
సోయం సృష్టివినాశ రక్షణవిధౌ సంలక్ష్యతే పండితైః
సోయం భక్తజనార్చనార్హతనునా లింగ స్వరూపోభవత్
సృష్టేః పూర్వతనుత్వబోధకకళా సంశోభిత స్సర్వదా.

(11) ఆత్మైకః ఖలు నిర్గుణ స్సఇతి వాదేసామరస్యం కథం
కేచిత్వాం సగుణం వదంతి యదిచే త్రైగుణ్యమేతజ్జగత్
విశ్వేశే భ్రమ తద్గుణ స్థితిమతి ర్ద్వైభిన్నరూపాంతరౌ
సోయం సగ్గుణ ఇత్యలం ప్రకృతి కర్తృత్వంచయుక్తం భవేత్.

(12) ఢక్కాయాం పరమేశ్వరస్యనిజనృత్తాంతేసురైస్సేవితే
సూత్రాణీవ చతుర్దశాహ్వయ మహావిద్యాస్సజాయంతిహై
ఆఖ్యాతం భువితన్న సత్యమితికిం కేచిద్బ్రువంతీతిచేత్
కింబ్రూమ స్స్వకపోల కల్పిత వచః పర్యాప్తతే త్యుచ్యతే.

(13) యావంత్యాత్ర చతుశ్శృతి ష్వపిసు వర్ణానీవ వర్ణానియైః
తావంతీహ శివాహ్వయాని పఠితానీతి ప్రసిద్ధిశ్శృతౌ
తస్మాన్ముక్తి మవాప్నువంతి మనుజా ఇత్యప్యశేషం జగ
త్సాహిత్యం శృతిగర్భసం జనితమే వాతః పరంకిం వదేత్.

(14) ముక్త్వావక్త్రిముపేక్షితోప్య ఇతిసచ్ఛబ్దోమహాన్ జాయతే
తస్యార్థఃఖలు శంకరోభవతి నందీశేన సంబోధితః
సోయం స్యాజ్జనకోఽఖిలాక్షరసమామ్నాయస్య తస్మాచ్ఛివః
భూయాదక్షర ఇత్యనన్య విషయ శ్శబ్దో యథార్థాక్షరః

(15) యోవైశేషిక ధర్మ ఇత్యభిమతోన్యాయే పదార్థస్మృతిః
సాంఖ్యేఽత్యంత సమస్త దుఃఖ విరతిః యోగేతు తత్రస్థితిః
జైమిన్యాం నిజకర్మణోఫలమతో వైయ్యాసికీయేమతే
బ్రహ్మేతి ప్రమితో విశాల హృదయై రీశాన శబ్దాచ్ఛివః.

(16) భూతానాం హృదయే స తిష్ఠతి సదా జీవాంతరాత్మేశ్వరః
గత్వాతం శరణం సుఖీభవ మహాభక్తార్జునేతి స్వయం
కృష్ణేన ప్రతిబోధితో నరవరః పార్థోఽర్చయిత్వాచ యం
ప్రాపోద్యుద్ధజయం యశ శ్శివసమో భూత్వా స మోక్షంగతః.

(17) అస్తీతి ప్రతిబోధితో జగతియైః కైర్వాపి వస్త్వాత్మనా
తిష్ఠ త్యేవహివస్తునోభవతి రూపం నామ యత్కించితః
తద్రూపం శుభదం శుభంభవతి బ్రహ్మాండ స్యనామాపితత్
లోకక్షేమకరైక మంగళగుణ శ్శ్రీత్వప్రబోధీత్యలం.

(18] ఏవంతస్య శివస్య మంగళ గుణగ్రామైక సీమ్నః పరం
రూపం నామవిశిష్ట లక్షణమితి బ్రహ్మేఽచ్యుతేంద్రాదిభిః
మౌనీంద్రైర్దృఢదీక్షయా కృతజపే న జ్ఞాత మిత్యత్యంతతో
వేదైర్వేద శిరోభిరాగమవచోభిః సత్యరాద్ధాంతితః.

(19) సత్తాయామితి సుస్ఫుటార్థహిత భూధాతోర్హి యోఽర్థోమహాన్
శక్త్యాయశ్చిద చిద్విశేషయుతయాయుక్త శ్శివోవ్యజ్యతే
సబ్రహ్మాది పిపీలికాంతతనునా జీవాత్మ నాచాత్మనా
వేదాంతేషు విభాసితో భవ ఇతి ప్రఖ్యాత శబ్దాత్మనా.

(20) హింసాయామితి యచ్ఛృధాతు మహితార్థోవ్యజ్యతే సౌఖ్యదః
కాలాశాసుమబాణ మృత్యుహనన ప్రఖ్యాత శార్యోదయః
నిద్రాతీత సుషుప్తి నిశ్చలవిరామ స్స్వస్థ సౌఖ్యప్రదః
విఖ్యాతోహి స శర్వ ఇత్యమృతభావో నామరూపామృతః.

(21) ఈశానః ఖలు పంచభూత జగతోభూతస్య భవ్యస్యచే
త్యాఖ్యాతశ్రుతి భిశ్చ భారవహతా సంరక్షణాఖ్యాం స్వయం
భూతానాంచ చతుర్దశప్రముఖ విద్యానాంచ సర్వాత్మనా
సర్వాధీశ్వర తాధిశక్తి మహితో య స్సర్వభావోర్చితః.

(22) విష్ణుబ్రహ్మ ముఖామరాశ్చ పశవో లోకా స్సమస్తా ఇమే
తేషామిష్టపతి స్స్వయః పశుపతి స్తస్మా జ్జగచ్ఛ్యాపకః
లింగాంగద్వయసామరస్య విహితానుష్టాని నామాత్మనా
దత్తే జ్ఞానమతోధికం పశుపతిత్వం యాంతి తేని౽భీష్టదం

(23) కైవల్యోపనిషత్ప్రబోధిత మహత్వస్నిగ్ధ విజ్ఞానదో
రుద్రాధ్యాయ ఇతిప్రసిద్ధ విషయఃతస్మిన్ సముద్భాతియః
భక్తానాం మధుకష్టసంస్మృతిరుజం విద్రావయన్నాత్మనో౽
భీష్టార్థం ప్రదదాతి మోక్షమ పర రుద్రస్స శబ్దోమహాన్

(24) విష్ణ్వాదిత్రిదివేశ భీతివిషయో హాలాహలః పావకః
సర్పాస్త్రోయదధయో గజోగజరి పుశ్శాలా దిముఖాగ్ర్యాయుధాః
దృష్ట్వాయం పరభీతిబాధితధియా స్తుత్వానమః పూర్వకం
సేవంతే సతతం విభాతి మితరాముగ్రస్స శబ్దోమహాన్.

(25) భీషోదేతిదివాకరో హిమకర శ్చేంద్రాదయ స్స్వర్గజాః
ఆత్మోద్యోగవిధిం యథావిధి భియాకుర్వంత్యలం సంతతం
మృత్యుర్మృత్యు భియాహినోతి సకలాన్ జంతూన్ శివస్యాజ్ఞయా
శబ్దోయం ఖలుభీమ ఇత్యభిమతో వేదాగమోద్ఘాటితః.

(26) యశ్చానంత విభూతిమత్వ మభవస్యాలం వదేద్వైదికః
భక్తస్యేహ సకృద్విరుక్తి కథనాచ్ఛంభూ రుణీస్యాత్పరే
దేవేషూత్తమ ఏకఏవహి మహాదేవస్సశబ్దోమహాన్
విశ్వాధిక్య మహోప్రబోధయతి స జ్యోతిస్స్వరూపోజ్జ్వలః.

(27) శ్రీతేలింగవిలాస మంగళతనౌ యస్మిన్ శివేతజ్జగ
త్సర్వం యస్యవశీకృతం దిశతి భక్తానా మభీష్టాని వై
శాంతో వేదసమస్తవర్ణ నిజనామాంక ప్రసిద్ధోదితః
సర్వాగణ్య శమస్తమంగళ గుణగ్రామైక సీమాశివః.

(28) యస్యానంత సహస్రకోటి శుభనామాన్యుత్తమానీత్యలం
సర్వాణ్యప్యమృతస్య తత్ర నవరత్నానీవ సంశోధ్యతైః
ఆచార్యైః కథితాని శంభునవనామాన్యేకదాయః పఠే
ద్భక్త్యో ముక్తి ముపేయివాఞ్ శివసమో భూయాదితి ప్రస్ఫుటం.

(29) వేదేషు త్రిషు మధ్యమాయతి యజుర్వేదోహి తస్మిన్మహా
కాండోయశ్చ చతుర్థ ఇత్యభిమతస్తస్మిన్నివిభాతిస్ఫుటం
రుద్రాధ్యాయ ఇతిప్రసిద్ధ విషయస్తస్మింశ్చ పంచాక్షరీ
తస్యాంతశ్శివశబ్ద ఏవతరళస్యా ద్రత్నహారే యథా.

(30) ఏకస్యాన్యసురస్యనామ కిమపి శ్రుత్యంతరే వర్తతే
ఏత్త్యత్వేవననుః ప్రపూర్వక మతస్సప్రత్యయం సాధకం
ముక్త్యైస ప్రణవం యదన్యవిషయో మోహాత్మనాదృశ్యతే
భక్తాభీష్ట శుభంకరో భువి శివోనామ్నాపి రూపేణచ.

(31) యన్నామాంతర నిత్యసంస్మరణ దీక్షాలభ్య ముక్తిప్రదం
యన్నామాక్షర యుగ్మలభ్య శివజీవైకత్వ విజ్ఞానదం
యన్నామ ప్రణవస్య సార్థకతనుం స్థూలంవదం త్యాగమాః.
తన్నామ శ్రుతిసుప్రసిద్ధ శివశబ్ద శ్శబ్దిత స్సర్వతః

(32) లీలామాత్ర మిదైంకదా శివ ఇతిప్రస్తౌతియఃకోపినా
కైలాసాచల శంభుసన్నిధి నివాసీస్యాత్స ఇత్యుచ్యతే
వేదైర్వేద శిరోభిరత్ర కిము వక్తవ్యం తథానేతియే
జల్పంత్యల్ప ధియా భియాకృత పురాకర్మేతి తేషా మలం.



# శివాద్వైత విశిష్టత

శ్రీ ఇవటూరి సానందారాధ్యులుగారు
( మాజీ శైవమత ప్రకాశికా సంపాదకులు. ప్రచారకులు )



(కొంతకాలము క్రితము బాపట్ల తాలూకా యందలి పొన్నూరుగ్రామములో నొక పండిత సమావేశము జరిగియుండెను. దానికై యాహ్వానింపబడి విద్వదగ్రగణ్యులతో నేనును అచటికి చేరియుంటిని. నాడు యాదృచ్ఛికముగా మత వైశిష్ట్యము జర్చించుకొనుసెడ సభాపతి గారికిని నాకును జరిగిన సంభాషణము నీదిగువ పొందుపరుచుచున్నాను.)

సభాపతిగారు:—సానందారాధ్యులవారు! మామతము అద్వైతము. మీమతము శివాద్వైతమని చెప్పుచుంటిరి. శివాద్వైతమనగా అద్వైతము కాదా?

నేను:—శివాద్వైతమనగా అద్వైతముకాదు, విశిష్టాద్వైతము.

సభా:-శివాద్వైతములోని 'శివ' శబ్దమును తీసివేయుచో అద్వైత శబ్దము మిగులునుకదా! మీమతమును అద్వైతముగాక, విశిష్టాద్వైతమనుట యెట్లు?

నేను:—'శివమద్వైతం చతుర్థం మన్యంతే' అనుశ్రుతినిబట్టి కేవలము అద్వైతమని చెప్పలేదు. శివమను విశేషణ పదమున్నందున మామతమునకు శివాద్వైతమని పూర్వాచార్యులు నామకరణము జేసిరి.

సభా:—శివమనగా మంగళ ప్రదమైనది అనికదా యర్థము. అట్టితఱి శివాద్వైతమనగా మంగళప్రదమైన యద్వైతమనికదా చెప్పవలయును. మా అద్వైతము మాత్రము మంగళప్రదము కాదా?

నేను:—మీమతము మంగళ ప్రదమైనను కాకున్నను, మామతము మంగళప్రదమైనదే యని మాపూర్వాచార్యుల మతానుసారము మేము భావించుచున్నాము. ఇచట 'శివ; శబ్దము మంగళ ప్రదమైనదను నర్థమును మాత్రమే కలిగియుండలేదు. ఇక విశేషమైన వేఱొకయర్థమును కలిగియున్నది.

సభా:—ఆ విశేషార్థమేమి?

నేను:—'మాతాచ, పితాచ, పితరౌ,' అనెడి ఏకశేషవృత్తిననుసరించి పితృ, శబ్దమునకు తల్లిదండ్రులని యర్థముకలదు. అటులనే 'శివాచ, శివశ్చ శివౌ,' అనెడి ఏకశేషవృత్తి ననుసరించి 'శివ, శబ్దములో శివాశివులు అనగా పార్వతీ పరమేశ్వరులనెడి యనాది దంపతుల యర్థము ఇమిడి

యున్నది. అందువలన శివాద్వైతమనగా పార్వతీ పరమేశ్వరులతో కలసిన యద్వైతమని మామతాచార్యులు తెలిపియుండిరి. కాని కేవలా ద్వైతమని చెప్పియుండలేదు.

సభా:-మీమతము నిర్గుణముకాదా?

నేను:-నిర్గుణమే.

సభా:-మీరును, మేమును నిర్గుణమతస్థులమేకదా! అప్పుడుభయులది యొక్కటే మతముకాదా?

నేను:-వేదోక్తమైన నిర్గుణ శబ్దమును మన ముభయుల ముపయోగించు కొనుచున్నాము. నిర్గుణ శబ్దమాత్రముచేత, శబ్దసామ్యమేగాని యర్థసామ్యము మన యుభయమతములకును లేదు.

సభా:-అదియెట్లు?

నేను:-మీమతమున నిర్గుణమనగా 'న విద్యంతేగుణాః,యస్మిన్, తత్, నిర్గుణం', అనువ్యుత్పత్తినిబట్టి, తత్వము గుణరహితమను నర్థమును దీసికొంటిరి. దానినిబట్టి మీరు చెప్పు బ్రహ్మతత్వమునందు నెట్టిగుణములును లేనట్లు స్పష్టమగుచున్నది. అందువలన మీబ్రహ్మతత్వము సకల ధర్మరహితము అనియే మీమతస్థులెల్లరు నేటివఱకు వాదించుచున్నారు. మానిర్గుణ బ్రహ్మతత్వమట్టిదికాదు: 'నిర్గతాఃగుణాః యస్మాత్, తత్, నిర్గుణం,' అను వ్యుత్పత్తినిబట్టి యెందుండి గుణములు బహిర్గతములగుచున్నవో అది నిర్గుణ బ్రహ్మతత్వమని మామతాచార్యులు శ్రుతి సూత్రార్థము లను ఆధారముచేసికొని సరియైన యర్థమును నిర్ణయించిరి. కనుక నే నిర్గుణమనగా అనంత కల్యాణ గుణసంపన్నమైనది బ్రహ్మతత్వమని మా మత సిద్ధాంతము.

సభా:-నిర్గుణశబ్దమునుబట్టియే వ్యుత్పత్తి భేదమునుబట్టి మా బ్రహ్మతత్వము సకల ధర్మరహితమై యుండగా, మీబ్రహ్మతత్వము సకల ధర్మ రహిత మయ్యెను. మీ బ్రహ్మతత్వము సకలధర్మరహిత మనుటకు ప్రమాణ మును కనుబఱుపగలరా?

నేను:-ఆఁకనుబఱుపగలము.

సభా:-శ్రుతి సూత్రములలో కనబరచుడు?

నేను:-'యతో వా ఇమాని భూతాని జాయంతే, యేనజాతాని జీవంతి,యత్ప్ర యంత్యభిసంవిశంతి తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి,' అను శ్రుతినిబట్టియు, 'జన్మాద్యస్యయతః' అను బ్రహ్మ సూత్రము ననుసరించియు, ఈ

భూతములు దేనినుండి పుట్టుచున్నవో దేనియందు బ్రతుకుచున్నవో, దేనియందు లయమును పొందుచున్నవో. దానిని బ్రహ్మయని తెలిసి కొనుము అని విశదమగుచున్నది. తత్వము సకల ధర్మరహితమైనచో, అనగా గుణరహితమైనచో భూతములు పుట్టుట, బ్రతుకుట, తిరిగి లయించుట యను శ్రుతి సూత్రార్థము వ్యర్థమగును. అట్లుగాక, బ్రహ్మ తత్వము సకలధర్మ రహితమని యంగీకరించినచో, అనక గుణములు కలదియని జెప్పినచో, భూతములు పుట్టుట, జీవించుట, లయించుట, యనునర్థము సరిపడును. అందువలన మా మతాచార్యులు శ్రుతి సూత్రానుసారముగ బ్రహ్మతత్వము. సకలధర్మ రహితమని సిద్ధాంతము చేసియుండిరి.

సభా:—మా మతాచార్యులు, బ్రహ్మయందు జగత్తు పుట్టుటగాని, లయించుట గాని లేదనియు, జగత్తు బ్రహ్మయందు కల్పింపబడినదనియు జెప్పు చున్నారుకదా! దీనిని మీరెందుకు విశ్వసించరు?

నేను:—మీవారు బ్రహ్మయందు జగత్తు కల్పితమని చెప్పుదురుగాక, అది ప్రమాణసమ్మతము గానందున మా వారు అంగీకరించ లేదు.

సభా —ఏల ప్రమాణ సమ్మతము కాదు?

నేను:—ఆ ప్రమాణమేదో చెప్పినయెడల అది నిజముగ ప్రమాణమైనచో నంగీక రించుటకు సిద్ధముగా నే యున్నాము.

సభా.—'ఆభాసమాత్రౌ జీవేశౌ,' అను శ్రుతి ప్రామాణ్యమును మా యా చార్యులు చెప్పుచుండిరికదా!

నేను:—అది ప్రమాణమైనచో శ్రుతిసూత్రములతో, నేల విరోధించవలెను?

సభా.—శ్రుతి సూత్రములతో నెట్లు విరోధించెను?

నేను:—'ఆభాసమాత్రౌ జీవేశౌ,' అను నర్థముగల బ్రహ్మసూత్రము నొకటియు లేదే? ఎట్లు సూత్రసమ్మతమగును? 'యతోవా ఇమాని భూతాని జాయంతే, యని సర్వమతస్థులచేత నంగీకరింపబడిన శ్రుతి ననుసరించి భూతములు, బ్రహ్మతత్వమునుండి పుట్టుట, బ్రతుకుట, లయించుట, మున్నగు నర్థజాతమను స్పష్టీకరించుచుండ, దానికి విరుద్ధమగు నర్థము గల 'ఆభాసమాత్రౌ జీవేశౌ,' అను వాక్యమెట్లు ప్రమాణముగా గ్రహింపనగు.

సభా:—అయితే'ఆభాసమాత్రౌ జీవేశౌ,'అను వాక్యము శ్రుతివాక్యము కాదా?

నేను:—అది శ్రుతివాక్యము కాదనియే మా మతస్థులేగాదు, వైష్ణవులు, మాధ్వులు మున్నగువారుగూడ నిర్ణయించిరి. 'యతో వా ఇమాని

భూతాని జాయంతే, అనునది శ్రుతి వాక్యమని సర్వమతస్థులచే నంగీకృతమైనది. అట్లు మీరు చెప్పిన ఆకాసమాత్రౌజీవేశా, అను వాక్యము సర్వజనాంగీకారమును పొందనందున, దానిని శ్రుతివాక్యమని మీ మతస్థులు భావించుకొనవలెనేగాని యితరులట్లు భావించరు.

భా:—ఇతరులు భావించనంత మాత్రమున నది శ్రుతివాక్య మెట్లుకాదు ?

ను:—మీరు చెప్పు శ్రుతివాక్యము ఇతర శ్రుతివాక్యార్థముతో కలియక విరోధించుచున్నందున అది శ్రుతివాక్యమే కాదని నిర్ణయింపక తప్పదు. ఇతర శ్రుతివాక్యములతో విరోధములేక ఏక వాక్యతయందు నిలిచిననాడే, మీ శ్రుతివాక్యము ప్రమాణమగునుగాని, లేనిచో నప్రమాణమని భావింపక తప్పదు.

భా:—అప్రమాణ వాక్యమును మావారు ప్రమాణముగా దీసికొందురా ?

ను:—మీ మతముదగు, కేవలాద్వైత సిద్ధాంతమును నిలుపుకోదలచి అందుకు తగిన శ్రుతిసూత్ర ప్రామాణ్యము లభించనందున క్రొత్త శ్రుతులను, క్రొత్త సూత్రములను మీ పూర్వులు కల్పించినారని మా పూర్వాచార్యులేగాదు, పరమత పూర్వాచార్యులుగూడ నట్లే నిర్ణయించిరి.

భా:—మా పూర్వులు కల్పించినట్లు మీ రెట్లు చెప్పగలరు ?

ను:—మా పూర్వాచార్యుడగు, నీలకంఠ శివాచార్యులు, బ్రహ్మసూత్రములు 545 యనియే నిర్ణయించి వానిపై సూత్రభాష్యమును వ్రాసియుండిరి. మాయాచార్యులకు తరువాతి వారగు మీ శంకరాచార్యుల వారు 555 సంఖ్యగా బ్రహ్మసూత్రములను నిర్ణయించి, దానిపై శంకర భాష్యమును వ్రాసియుండిరి. వారి తరువాతివారగు శ్రీ రామానుజాచార్యులవారు నీలకంఠునిమాదిరి 545 సూత్రములే బ్రహ్మసూత్రములుగా గ్రహించి దానిమీద శ్రీ భాష్యమును వెలయించిరి. వారి తరువాతివారగు శ్రీ మధ్వాచార్యులవారు 569 యని బ్రహ్మసూత్రములను పెంచి వ్రాసినారు. దీనినిబట్టి బ్రహ్మసూత్ర సంఖ్య వివిధ మతాచార్యులు హెచ్చుతగ్గులుగా గ్రహించినందున సూత్ర సంఖ్యాభేదము కనుపించుచున్నది. అటులనే శ్రుతులలోగూడ, తమ తమ సిద్ధాంతానుకూలముగ శ్రుతులనుగూడ నిర్మించుకున్నట్లు తెలియుచున్నది.

భా:—సూత్ర సంఖ్యా భేదమును వివరించి చెప్పితిరి. శ్రుతిభేద మెట్లు చెప్పెదరు ?

నేను.—మీ మతస్థులు తప్ప తక్కిన మతస్థులు అంగీకరింపని 'అభాసమాత్రో జీవేశా' అనునది శ్రుతియని మేమెట్లు అంగీకరింపగలము ? అట్లే మాధ్వులు, కాఠరాయణము, మాఠరాయణమను శ్రుతులను నిర్మించు కొనినట్లు మీవారు చెప్పుటలేదా ?

సభా:—అయితే మా మతము శ్రుతి సూత్ర సమ్మతముగాదా ?

నేను:—కాదనియే, మా పూర్వాచార్యులు, మల్లికార్జుపండితులు పాల్కురికి సోమనాథుడు, మొదలుకొని మొన్నటివరకుగల మహోపాధ్యాయ బ్రహ్మ శ్రీ ముదిగొండ నాగలింగ శాస్త్రి గారివరకు గల మా మతాచార్యులందురు ఏకగ్రీవముగ, కేవలాద్వైతము శ్రుతిసూత్ర సమ్మతమని అంగీకరంపలేదు.

సభా:—మీ మతమున మీకెంత ప్రవేశమున్నదో కనుగొనుటకు మిమ్ములనిట్లు ప్రశ్నించితిని. నాకు గురువులును మీకు పితృతుల్యులును నగు శ్రీ లో॥ ఇవటూరి నాగలింగశాస్త్రిగారు మీరు చెప్పినట్లే చెప్పినారు. మీ జన్మ సార్థకము. అందువలననే మిమ్ములను గురుతుల్యునిగా భావించితిని మీ మతానుసారము. మీ వాదము నిర్దుష్టమైనది. మీరు గొప్ప శ్రుతపాండిత్యమును సంపాదించినారు. సామాన్యులెవ్వరును మీకు సమాధానము చెప్పజాలరు.

నేను:—అయ్యా ! నేను కించిజ్ఞుడను. మీరో ఉద్దండులైన విద్వదవతంసులు జ్ఞాన సముద్రులగు మీరెక్కడ ? అల్పజ్ఞుడనగు నేనెక్కడ ! నా సమాధానములందు దోషములున్నచో మన్నింపుడు.



# ఆత్మార్పణము

శ్రీ బి. చిదంబరశాస్త్రి

ఉ॥ నీ వొక దివ్యవైభవ విసర్జిత సర్వజగన్నియంత్రణ
వ్యాపృత నిత్యమూర్తివి తదంతరవర్తి సమస్త సేవనా
భావుడ నేను కల్గ డెడబాటుల నీకును నాకు నెయ్యెడన్
భావిత సేవ్యసేవకుల భావము వర్ధిల సిద్ధరాముడో!

చం॥ హృదయ మహార్ఘ్య పీఠమున అంచితభావ సుమంబులన్
బదింబదులుగ సేకరించి రసబంధుర సుందరకీర్ణవాస నా
స్పదములు విస్తరిల్లగ భవత్పద మావహనంబు జేతు నే
ర్పొదవగ సర్వవైభవపు భోగము లందుము సిద్ధరాముడో!

ఉ॥ ఈ సకలంబు దివ్యతరమై వెలుగొందు మదంతరంగ సిం
హాసనమందు జక్కనగు నాసలు పోసిన రత్నరాశులై
భాసిల గూర్చికొందు బహుభంగుల మీదగు నిత్యవాసి తా
భ్యాసము జేసి సర్వవిభవత్వము నందుము సిద్ధరాముడో!

ఉ॥ సిద్ధ సరస్స్రివన్మధు రసేరితధారలు మేళవింప సం
వృద్ధ భవత్పదాబ్జపు సువాసన దోగిసలాడు భావనా
బద్ధ మదంతరంగ మదబంభర మల్లలనాడ ఝుంకరింప సం
సిద్ధము జేతు పాద్య మభిషేకముగా గను సిద్ధరాముడో!

ఉ॥ చక్కని కాంతిలో బొలుచు చంద్రుడు నా హృదయంబు దానిలో
పొక్కిన భాసమే యమృతపున్ సొనయై కరడొందు వెన్నెలల్
పెక్కు గుణాలు సారమున పెంపగు క్షీరము ఖాదులై కడున్
జొక్కగ మీ పదంబుపయి సోకగ జేతును సిద్ధరాముడో!

ఉ॥ పొంగుచునున్న నా హృదయపున్ సురవాహిని మీ పదంబు జే
రంగ దలంపు గల్గి బహుళంబుగ నాకసమంటి గాలితో
సంగతమై మహోగ్నులకు జాలి ధరాంతరముల్ వసించి మీ
యంగము జూచు తానమునకై గ్రహియింపుము సిద్ధరాముడో!

ఉ॥ జ్ఞానపు వెల్గు ధేను వది పాకిన పిడ్డెలు గోమయంబు సు
జ్ఞానద వేదపంచితము చాడుచు నాహృదయంబు పాత్రలో
పూని తయారొనర్చుకొను భూతి సమస్తమునందు నొప్పెడున్
దాన మహేశ్వరత్వము పసంబయి వెల్గగ సిద్ధరాముడో!

ఉ॥ అందము జెంద నా హృదయ మాపుని లోపల చాళ్లుచాళ్లు రూ
పొందిన భావపుష్పములు పుంజము పిప్పికొనంగ నల్లు నా
నంది రసంబుధార కలశంబున మత్తిలుచుండి మీ పదం
బందున పెట్టుకొందు సుఖవంతముగా గను సిద్ధరాముడో!

చం॥ అదియొక మానవత్వవన మందున బండిన బిల్వవృక్షమున్
హృదయము సాత్వికాదిక గుణత్రయమున్ బరితాపదాకలన్
త్రిదళములై చిగుర్చుకొని దివ్యరసంబు గలంచుచుండ మీ
పదము నలంకరింతు భవబంధము వాయగ సిద్ధరాముడో!

ఉ॥ పూతము నాదుచిత్తమున పొంచి వసించిన యాసలందు మే
ల్జాతుల పాపసంచయము జ్ఞాన మహాగ్నిని పెట్టి దివ్యసా
ఖ్యాతభవద్రతిన్ భ్రమరకీటవిధంబును దోప రూపడన్
జూతు సువాసనన్ బొలయుచుండగ నీవయి సిద్ధరాముడో!

చం॥ వెలయును గాక యీ యఖిలవిశ్వము నీవగు నాత్మతత్త్వ మం
దలమిన చిన్మరీచికటుల తానను భావముతోడ జ్ఞానమున్
కళిక వికాసమంద శిఖ కప్పురమున్ బలె యంత యింతయై
వలపు కరుంగ దీపపు నివాళుల నెత్తెద సిద్ధరాముడో!

ఉ॥ ఖాద్య మదెద్ది సర్వగతికంబుగ ఖాది యెవండు సత్యసం
వేద్యభవన్మహత్వ పరివిస్తృత విశ్వమునందు నిత్యసం
పాద్య మదెద్దియో భువి యవాచ్యతరంబగు సత్ఫలంబు నై
వేద్యము జేతు నాహృదయ వేదన దుల్లగ సిద్ధరాముడో!

ఉ॥ శ్రీలలితంబు సత్త్వగుణశీలము పారితసుద్ధమౌక్తికా
వాలము లోల తారహిత వాసన మూలము నైన దివ్యతాం
బూలము చర్వితంబగు విభో రససుందరమై మదీయ చి
త్తాలయమందు త్వత్పదవిహారము గల్గగ సిద్ధరాముడో!

ఉ॥ నాజని ధన్యమై యలరు నన్ను మహోన్నత భావరశ్మితో
రాజిలు నాత్మభాస్కరుని రమ్యపుకాంతులు వెల్గులీనలో
బూజులుగొన్న యంధతమ పుంజము పోకడవెట్టు దివ్యనీ
రాజన మిచ్చికొందు భవరాశి దొలంగిన సిద్ధరాముడో!

ఉ॥ ఎన్నగ నిట్టిదంచు వచియింపగరాని యమూల్య విజ్ఞతా
పన్న సదాత్మపోషితము భాగ్యవిశేషిత మానవత్వ మ
త్యున్నతమైన దక్షిణగ నొసగెద నీకయి దేవదేవ సం
పన్నమహోజ్జ్వలంబగు భవత్కృప మందగ సిద్ధరాముడో!

ఉ॥ నీవు మదాత్మ దేవిమతి నేస్తులు ప్రాణము లిల్లు దేహమౌ
నావిషయోపభోగరచనం బది పూజ సమాధి నిద్ర యో
దేవ ప్రదక్షిణంబు లిలదిర్గుట స్తోత్రము లన్నిమాట లే
యేవిధి నాచరింతు నదియెల్ల త్వదర్చన సిద్ధరాముడో॥



# శ్రీ ఆది శంకరుల వారి అద్వైత మత సామరస్యము

శ్రీ శివలెంక లింగయ్యా అయ్యావారు.

శైవ మనాదిమతము. అది శంకరుని మతము. అది వేదములతో బాటు ఏర్పడినది శ్రు॥ "వేదశ్శివ శ్శివోవేదః" అను ధర్మమునుబట్టి శివుడే వేదము వేదమే శివుడని తెలియుచున్నది. మన శాస్త్రమునుబట్టి వేదములు 195,58. 86,020 సం॥ క్రిందట బుట్టినట్లు తెలియుచున్నది.

షుమారు 1200, సంవత్సరముల క్రిందటివరకు శైవసిద్ధాంతములు శైవ సాంప్రదాయములె నాలుగు పాదముల నడుచుచుండెడివి. దరిమిలాను శైవ యువకులుగా నున్నవారు స్వేచ్ఛగోరినవారై శైవ ధర్మములను ధిక్కరించి భిన్నసాంప్రదాయముల బురస్కరించుకొని భిన్నభిన్న మతములను లేవదీసిరి. దేవతకొక్క మతముచొప్పున ప్రవక్తలు తయారుచేసినారు.

బ్రహ్మసూత్రములు ప్రజలకు, సరిగాబోధపడని కారణమున నిట్టిదుస్థితి యేర్పడుచున్నదని శ్రీ నీలకంఠ శివాచార్యులవారు శృతిసూత్ర బద్ధముగా నీలకంఠ భాష్యమును వ్రాసియుండిరి. మతసిద్ధాంతములయందు వెగటుగలిగి భిన్న సాంప్రదాయముల యందు చెలరేగినవారికి భాష్యము ప్రయోజనకారి కాలేదు.

రాను రాను శ్రీ శంకరాచార్యులవా రుద్భవించు నాటివరకు కొన్ని వందల మతములై ఆసేతు శీతనగపర్యంతము శాంతికి భంగముగలిగి దేశము ప్రమాదస్థితిలో నుండెను. అత్తరి శ్రీ శంకరాచార్యులవారు ఈ దుస్థితిని గ్రహించి దేశమునకు శాంతినిచేకూర్చ సమకట్టినారు. అతి చమత్కారముగా రాజీపద్ధతులను గుదిర్చి అందరి దోషములను వారిపాండిత్యముచేతను, కార్య దీక్షతచేతను కాలపరిస్థితినిబట్టి కలహముల నైజమునుబట్టి సిద్ధాంతములు సర్వ సమ్మతములుగా నుండునటుల నేర్పాటు జేసిరి. మతకలహములలో చెలరేగిన వారినందరిని యొకేమతమునందు చేర్చి వారియుద్రేకముల నణచివేసిరి.

పరిష్కార విధానము— భేదాభిప్రాయములచేత కలిగిన కలహము లగుటచేత భేదమజ్ఞాన కల్పితములను సిద్ధాంతము ప్రబోధించినారు. మత ములును అభిప్రాయ భేదములచే కలిగినవగుటచేత మతములు కూడ అజ్ఞాన కల్పితములేయని నిరూపించినారు. మతమున కొక్కదేవు డేర్పడియుండుట

చేత దేవునకు నామరూపములు కల్పితములని బ్రహ్మపదార్థ మొక్కటియే యనియు యది నిర్గుణమనియుసిద్ధాంతీకరించిరి. మోక్షమునకు కర్మోపాసనము లు సాధనములు కావన్నారు. అనుభవజ్ఞానమే మోక్షసాధనమన్నారు.అనుభవజ్ఞాన సాధనకు యతులకే యధికారము కలదు. గృహస్థులు కేవలము కర్మోపాసనలకే అర్హులన్నారు.

మోక్షముకొరకు శృతులయందు చెప్పబడిన "అమృతస్య దేవధారణో భూయాసం" అను సిద్ధాంతమును అద్వైత భావములో తాత్కాలికముగా విస్మరించియున్నారు. శైవ సిద్ధాంతములకు విరుద్ధములుగా వారి యనుచరులకు దహన సంస్కారముల నేర్పాటు చేసియుండిరి. శ్రీ శంకరాచార్యులవారి నాటికి ప్రబలముగానున్న మతములన్నియు ప్రవక్తలచే నియమింప బడినవగుటచే, నొకరి సిద్ధాంతములు మరియొకరికి కలియక కొట్లు కొనుచుండుట చేతనే మతకలహములు చెలరేగినవి. ఈ కలహములనే శ్రీ శంకరులవా రతిచమత్కారముగా చల్లార్చినారు. అందుకు తగిన సూత్రభాష్యమును తయారుచేసినారు.

శ్రీ శంకరులవారు రేవణా సిద్ధులవద్ద శాంభవదీక్ష గ్రహించియుండిరి. వారు చంద్రమౌళీశ్వరుని పూజించెడివారు. "సాంబోనః కులదైవతం" మాయిలవేల్పు సాంబుడని చెప్పుకొన్నారు. ఈ స్థితిలో భేదమజ్ఞాన కల్పితమను సిద్ధాంతమునుబట్టి వారి యనుచరులకు పంచాయతన పూజనేర్పాటు జేసియుండిరి. కాని వారు శ్రీరామచంద్రు నిష్టదైవముగా భావించెదరు. అది పంచాయతన పూజకు విరుద్ధమైననుభేద మజ్ఞానకల్పితమను సూత్రమునకు విరుద్ధము కాజాలదు. మరియు నష్టాదశపీఠముల నేర్పరచియుండిరి. అందు శివారాధనయేకలదు. కాని వానికి నద్వైతపీఠములని పేరుకలదు. పీఠాధిపతుల ప్రచారములందు నద్వైతమునే పోషించుచుందురు.

గాంధీమహాత్ముడు బానిసలుగానున్న భారతీయులను విముక్తులనుగా చేయుటకు నెన్నిశ్రమల బడినారో మనకుతెలిసిన విషయమే. జాతీయ భ్రాతృత్వముకొరకు మతములనన్నిటి నేకముచేయుటకు వందలాది జమీందారులను భారతీయ రాజ్యాంగములో లీనము జేయుటకు వారు పడినశ్రమ యపారము. అట్లనే శ్రీ శంకరాచార్యులవారును వందలాది మతములను కలహములలో చెలరేగకుండ శాంతిచేకూర్చుటకు చేసినకృషి సుశ్లాఘ్యము. వారు దేశోద్ధారకులు,చిరస్మరణీయులును.

శంకర మతస్థులకు దహనమేర్పాటు కాబడినను సన్యసించినవారికి ఖననార్హతయేర్పరచబడినది. యతులు సిద్ధిపొందినస్థలమున లింగస్థాపనయేర్పాటు కాబడియుండెను. శైవులకు లింగధారణ యుపనయన కాలమునందు జరుగుచున్నది. లింగైక్యము జరిగిన వెనుక ఖననము జరుగుచున్నది. అట్లుగాక

అద్వైతులకు సన్యసించినవెనుక భస్మధారణ కలుగుచున్నది. సిద్ధిపొందినవెనుక లింగధారణ జరుగుచున్నది. సిద్ధాంతములయందు విస్మరింపబడిన వేదధర్మములను భిన్న సాంప్రదాయములవల్ల సర్దుబాటు చేసికొనుటయే సామరస్యము. ఇంతియేకాదు, అద్వైత భావములో శివకేశవులకు భేదములేదని వారుచెప్పుదురు. అట్లు చెప్పుటవలన దోషమను విషయము వారికి తెలియనిదికాదు. తద్దోషపరిహారార్థము చెప్పబడిన శివరాత్రి జాగరణోపవాసములు అద్వైతులకు పరమధర్మములుగా విధింపబడినవి. "యేమాంవిష్ణ్వాదిభిస్తుల్యం దేవత్వాం లక్ష్మ్యాదిశక్తిభిః గురుంయే ప్రకృతేస్తుల్యం సంస్మరంత్యల్పబుద్ధయః, తేషాం పాపానినశ్యంతి శివరాత్రిప్రజాగరాత్" ఇదియు నొక సామరస్యమనియే చెప్పకతప్పదు శ్రీ శంకరులవారు శివారాధన జేయుట వారు శైవుల శిష్యులగుటలోగల సామరస్యము వేరుగా జెప్పనవసరములేదు

మతాంతరముల ప్రాబల్యముచేత కాలవైపరీత్యము చేతను భక్తిమార్గము లనేకములుగా మారినను ఆచరణలయందు, మార్పుకలుగక సర్వప్రామాణ్యము ననుసరించియే జరుగుచుండుట ముదావహము. భగవద్గీత— ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా. తా॥ సంసార యంత్రమందు తగుల్కొని యున్న యీ చరాచర ప్రపంచమును తన మాయాశక్తిచే నాడించుచు పరమేశ్వరు డందరి హృదయమున నెలకొనియున్నాడు.

ఆచారములు— గ్రహదోష శాంతికొరకు రుద్రాభిషేకము చేయబడుచున్నది. కాని విష్ణువుయొక్కగాని, బ్రహ్మయొక్కగాని యభిషేకము చేయబడుటలేదు

బ్రహ్మహత్యాది దోషనివారణకొరకు శివలింగప్రతిష్ఠ చేయబడుచున్నది. ఇందుకు రామేశ్వరమే ప్రబల నిదర్శనము.

సప్త సంతానములలో శివాలయమే విధింపబడినది.

అక్షరాభ్యాస కాలమునందు "అకారాది" వర్ణముల కంటె పూర్వమే శివపంచాక్షరి మంత్రోపదేశమే చేయబడుచున్నది.

ఉపనయన సమయమునందు నీశ్వరునకు సంబంధించిన పంచశిఖలు, అజినధారణ, భిక్షాటనము విధింపబడినది.

వివాహకాలమందు కాశియాత్రయే చేయబడుచున్నది, కాని శ్రీరంగయాత్రగాని, తిరుపతియాత్రగాని చేయబడుటలేదు.

అపరకర్మలయందు వృషోత్సర్జనయే చేయబడుచున్నది కాని గరుడోత్సర్జనము చేయబడుటలేదు.

కాశ్యాంతు మరణాన్ముక్తిః, అనునది ప్రసిద్ధమేగదా.

బాల్యగ్రహపీడా నివారణకై భస్మధారణమే చేయబడుచున్నది కాని శ్రీచూర్ణధారణ కాదు. యత్యాశ్రమమునందు యతులు భస్మరుద్రాక్షలు ధరించుచున్నారు కాని శ్రీచూర్ణము, తులసీమాలలు కావు.

యతి సిద్ధిపొందిన తరువాత నాతని సమాధియందు లింగస్థాపన చేయబడుచున్నది. సర్వకార్యారంభములయందు గణాధిపతిపూజ చేయబడుచున్నది.

వివాహ కాలమునందు రుక్మిణి, గౌరీపూజ చేసినది. అటులనే కన్యలచేత వివాహ కాలమునందు గౌరీపూజ చేయించబడుచున్నది.

వివాహానంతరమందు స్త్రీలు సావిత్రి గౌరీవ్రతములు చేయుచున్నారు

పాకక్రియా యోగ్యత కొరకు గౌరీపంచాక్షరియే యుపదేశించ బడుచున్నది.

అద్వైత పీఠములు 16, లోను చంద్రమౌళీశ్వరారాధన చేయబడుచున్నది.

వాదములు నిరీశ్వరములనియు సేశ్వరములనియు ప్రసిద్ధములుగాని నిర్విష్ణువాదమనికాని నిర్బ్రహ్మవాదమనికాని, ప్రసిద్ధిలేదు.

మహాదేవుడు, మహేశ్వరుడు శబ్దములు శివసాంప్రదాయమునే చెప్పుచున్నవి.

కాళిదాసు ప్రథమ గ్రంథ ప్రారంభమున "జగతః పితరౌవందే పార్వతీపరమేశ్వరౌ" యని వ్రాసియున్నారు.

ఇతర ప్రవక్తల మతములయందు వలెగాక శ్రీ ఆది శంకరాచార్యుల వారి మతమునందు వారి సిద్ధాంతములకు ఆచారములకు చక్కని సామరస్యము కనబడుచున్నది. శంకరులవారి కాలమందు పండితులకు కొదువలేదు. శృతి సూత్రబద్ధముగా శివాద్వైత భాష్యను వ్రాసిన శ్రీ నీలకంఠ శివారాధ్యుల వారుండినటుల ప్రమాణ గ్రంథములవలన తెలియుచున్నది పండితులైనవారికి పూర్తియైన లోకజ్ఞానము కావలెను సమయానుకూలముగా ప్రవర్తించగల సమర్థత కావలెను. లేనియెడల వారి పాండిత్యము దేశసేవ కుపయోగపడుటకు వీలులేదు. కలిప్రభావమున నాటి శైవ భాష్యములు కలహశాంతికి నుపయోగ పడలేదు. కావున కేవల పండితులు పనికిరాలేదు. కార్యనిర్వహణయందుగల దీక్షచేత కలిపురుషునకు కలిపురుషులై కార్యరంగమునదుమికి ఏకైకనాయకులై రక్తపాతములేక శాంతియుతముగ లోకకల్యాణము చేకూర్చినారు. ఇదియే శ్రీ శంకరాచార్యుల వారికిగల విశిష్టత, గొప్పతనము.



# కనక దుర్గాష్టకము

సేకరణ : శ్రీ ఇవటూరి వీరభద్రరావు

---

౧. హ్రీంకారీ, త్రిపురేశ్వరీ, భగవతీ, హేమాంబరీ, శాంకరీ,
చండీ, భైరవయోగినీ, కులవతీ, బ్రహ్మాండసంహారిణీ
నానారత్న విచిత్రభూషణకరీ, నాగేంద్ర కుంభస్తనీ,
దుర్గాంబానవకోటిమూర్తి సహితా మాం పాతు మాహేశ్వరీ ॥

౨. మాతంగీ, శివసుందరీ, శ్రుతినుతా, చింతామణీ పీఠికా,
వారాహీ, భువనేశ్వరీ, మధుమతీ, సర్వేష్ట సంపత్కరీ,
చాముండా, ఘనరత్నకాంతి నిలయా, కామేశ్వరీ భ్రామరీ,
దుర్గాంబా, నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ ॥

౩. బాలామన్మథ వాగ్భవాదిసహితా. చక్రాంతరే సంస్థితా,
వీణా పుస్తక పాశసూత్ర వలయ ప్రోద్భాణి పద్మాంచితా।
దేవీ దుఃఖ విమోచనీ శివసతీ సుశ్వేత పద్మాసనా
దుర్గాంబా నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ ॥

౪. విఘ్నాధ్యక్ష. సుశాక్త భైరవ మహావీరాఖ్య సంసేవితా।
యోగీంద్రాత్మ సరోరుహాంత నిశితా. సిద్ధేశ్వరీ మోహినీ।
బ్రహ్మాది త్రిదశేంద్రవందితపదా కాళీ । కళామండలీ।
దుర్గాంబా నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ ॥

౫. శీతాద్రీంద్ర నగాత్మజా, శశికళా జూటామనోహారిణీ.
క్షీరాంభోనిధి మధ్యరత్న విలసద్ద్వీపాంతరే సంస్థితా,
గౌరీ కామితదాయినీ, శుభకరీ, కల్పాంతకాలేసతీ,
దుర్గాంబా నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ ॥

౬. కల్యాణీ । గజవక్త్రతుండ జననీ । గౌరీ శివాసుందరీ
శర్వాణీ పరమేశ్వరీ, గుణమణీ, జ్యోతిర్మయాకారిణీ।
ఈశానీ వరహేమనూపుర పదాంభోజా మహాయోగినీ।
దుర్గాంబా నవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేస్వరీ॥

౭. శ్రీరాజేశ్వరి సుప్రసన్న వదనీ, శ్రీ చక్రమధ్యాసనీ,
మాయానిర్మిత, రమ్యరత్న విలసద్ద్వీపాంతరే సంస్థితా,
గౌరీ కామితదాయినీ, శుభకరీ, సర్వేష్ట సంపత్కరీ,
దుర్గాంబానవకోటిమూర్తి సహితా మాంపాతు మాహేశ్వరీ ॥

౮. పంచక్రోశ మహాస్థల ప్రవిలసత్తుంగ త్తరంగాంచితా,
గంగా కేవల కృష్ణవేణి తటినీతీరతాస్థి మోదితా।
ఇంద్రస్థాపిత మల్లికార్జునపతీ జయవాటికా ధీశ్వరీ,
దుర్గాంబానవకోటిమూర్తి సహితామాంపాతు మాహేశ్వరీ ॥ 

# శైవమత ప్రకాశిక చందా వివరములు.

సంపాదకులు

| | | |
|---|---|---|
| మహారాజ పోషకులు | రు॥ | 116—00 |
| రాజ పోషకులు | | 50—00 |
| ప్రధాన పోషకులు | | 25—00 |
| పోషకులు | | 10—00 |
| అభిమానులు | | 5—00 |
| చందాదారులు | | 3—00 |
| విడిపత్రిక | | 0—25 |



కృష్ణాపత్రిక ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాదు - (ఆం. ప్ర.)

# శైవమత ప్రకాశిక



శ్రీ శైవ మహా పీఠము

1-బి. పద్మారావునగరు, సికింద్రాబాదు.

[illegible]

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపఁబడు

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు- కందుకూరి వీరబసవరాజు

| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>24-9-61<br>భాద్రపద పూర్ణిమ | సంచిక ౬ |
|---|---|---|

శ్లోకం.

"ఇహచే దవేదీ దథసత్యమస్తి నచే దవేదీ న్మహతీ వినష్టిః
భూతేషు భూతేషు విచింత్యధీరాః ప్రేత్యాస్మాల్లోకా దమృతాభవని"

కేనోపనిషత్తు

ఈ లోకమునందు పరమాత్మ స్వరూపము తెలిసికొనినవానికి సత్యస్వరూపము కలదు. ఈ లోకమునందు పరమాత్మ స్వరూపమును తెలియని వానికి గొప్ప వినాశనము కలుగుచున్నది. సకలభూతాంతర్వర్తియగు పరమాత్మను చక్కగా నెఱిగిన జ్ఞానులు ఈ లోకమునుండి విడుదలై సదా అమృతత్వమును పొందుచున్నారు.

## శైవ విద్యార్థులకు ఉచితవిద్యా వేతనములు.

నేటి శైవమహాపీఠము కొన్ని నిర్దిష్టములైన కార్యములను నెరవేర్చుకొనుటకు సంకల్పించుకొని యుండెను. అట్టి సంకల్పము నెరవేరుటకు "దానికి వలసినంత సంఘబలమున్నదా, లేదా? మూలభూతమగు నార్థిక స్తోమతు నెంత కలిగియున్నది? ప్రజాబాహుళ్య

మున దానికి గల గౌరవాభిమానము లెట్టివి?" అన్నయనుత్సాహ కారణములైన సందేహ పరంపరల కిప్పట్ల తావులేదు. అట్టి ప్రశంసలు ప్రస్తుత మనావశ్యకము. ఏది యెట్లున్నను తానుకొన సాగించుటకు తలపెట్టిన ఆ పసియండలి విశుద్ధ సంకల్పము ఎట్టి పరిణామము నొందనున్నది? అయ్యది మానవుని యొక్క మానవత్వమును పరాకాష్ఠ నొందించుటకు సాధన మవుతున్నదా? లేదా? యన్న విశాల భావమును కలిగియుండిన చాలును. అప్పుడు ఎట్టి సంస్థలున, ఎట్టి మహత్తర విత్తమును, ఎట్టి ప్రజయును తామై ముందుకువచ్చి తోడు నీడగా మసలుచు దానిని విశ్వవ్యాప్తముగా నొందించుటకు సహకరించుచుండును. అసలు ఆశయముండిన కదా కూటములుగా నేర్పడుటకు అవకాశము కలుగుట! అతి ప్రాచీన కాలమున అనంత భాషా ప్రపంచము నందలి మాధుర్యమును సుస్థిరముగా నొనర్చుటకు సంకల్పించినది యాది కవియగు వాల్మీకిమహర్షి యొకే యొకరుకదా! సంకుచితమగు నాస్తిక భావముచేత మతకల్లోలములను రెచ్చగొట్టుచు సృష్టిక్రమమునే తారుమారుజేయ జూచుచున్న నాటి కాలమున ఈశ్వర మూలకారణ సిద్ధాంతమును తిరుగ దోడుటకు నడుముకట్టినది శ్రీ శంకరభగవత్పాదాచార్యులొకే యొకరుకదా! నేడు వారు మనకు వ్యక్తిగతముగా గనుపడక పోవచ్చును కాని పవిత్ర భావనా ప్రపంచమున వారు సుస్థిర సామ్రాజ్య పట్టభద్రులే.

ఇట్టి నైజమును గ్రహించిన దగుటచేతనే నేటి శైవమహాపీఠము కొన్ని పవిత్రాశయములను సిద్ధింప జేసికొనుటకై ప్రయత్నించుచున్నది. వైజ్ఞానికముగ ప్రబుద్ధులగుటకు నుత్సహించుచున్న స్వాభిమానులగు కొందరు బీదవిద్యార్థులు కాలవైపరీత్యమున సంప్రాప్తించిన ద్రవ్యోల్బణముచే ఖిన్నులగుటను గమనించి వారికి తోడ్పడుటకు తలపెట్టెను. పాశ్చాత్యవ్యామోహమున నానాటికి దిగజారి పోవుచున్న యాస్తికత్వమును ప్రతికాముఖమున పునరుద్ధరించుటకు నిశ్చయించెను. అట్టి సదాశయమునందలి సంకల్ప బలమా యన్నట్లు గత సంవత్సరమున డాక్టరు శ్రీ ముదిగొండ మల్లికార్జున రావుగారు తమంతతామై యొక వెయ్యిరూపాయలు బీదవిద్యార్థులకు నుచితముగా పంచి పెట్టుటకు నంగీకరించిరి. అడిగినదే తడ

వుగ కృష్ణాపత్రికా సంపాదకులైన శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ గారు జీర్ణించిన శైవమత ప్రకాశికను తిరుగ నొక సంవత్సరము వరకు నుచితముగ ప్రచురించుటకు నొప్పికొనిరి. ఆరు మాసముల నుండి యది నిర్విఘ్నముగా ప్రచురింపబడుచున్నది.

నేటి శైవమహాపీఠము ఆర్థికముగ స్వయం పోషితము కానందున నికముందును ఇట్టి సత్కార్యముల నెట్లు నిర్వహించవల యునో తోచక కార్యనిర్వాహక వర్గమువారు పడుచున్న తాపత్రయ మును శ్రీ ముదిగొండ సిద్ధరాజలింగముగారు, గమనించి యొక సేకరణనిధిని ఏర్పరచుటకై ప్రోత్సహించుటయె గాక, యందులకై యాభై యొక్క రూపాయల విరాళమునొసంగి ప్రారంభింపజేసిరి.ఎవరెట్టి ధనమునొసంగిరి, అట్టి దానిచేత నెంతటి కార్యము సాధింపబడు ననునది ముఖ్యముకాదు. కావున నిట్టిసదాశయము నభిమానించు వారొ క్కరైనను, ఒక్కరిరువురై యిరువురు పదుగురై పదుగురు నూరు లై నూరులు వేలై లక్షలు సేకరించుకొనుటకు మూలహేతువగు చున్నది. అందుకు ప్రతి యాస్తిక మతావలంబియు విశేషించి శైవ మతావలంబకులందరున్ను తమతమ విరాళములను శైవమత ప్రకాశికా ముఖమున గాని, ప్రత్యేకమగు జాబులద్వారా గాని ప్రకటించి యెంతయో యొక కొంత, యెదో యొకరూపమున వెంటవెంటనే అందించుచు మాయీ సంకల్పమునకు సహకరించుచు ప్రోత్సాహము కలిగింతురని యాశించుచున్నాము.



# శ్రీ ముదిగొండ రాజయ్యగారి లింగైక్యము

ఈ నెల 9వ తేదీ మధ్యాహ్నమున శ్రీ ముదిగొండ రాజయ్యగారు అకాల మృత్యువుచే లింగైక్య మొందిరని తెలుపుటకు విచారించుచున్నాము. వీరి వయస్సు సుమారు 45 సంవత్సరములు. వీరికి ఒక కుమారుడు ఇరువురు కూతుళ్లు కలరు. మరణ దివసమునకు 10 రోజుల క్రితము మామూలుగా శరీరమస్వస్థమై క్రమేపి బలపడుచు 8వ తేదీకి మించిపోయెను. ప్రతి క్షణమును దగురీతి జాగ్రత్త తీసికొనుచు చికిత్స జేయుచుండినను కాల వైపరీత్యమున శనివారము మధ్యాహ్నము 12 గంటలకు శివైక్యమందిరి. వీరు చిన్నతనము నుండియు అనేక ప్రజల యొక్కయు, సంస్థల యొక్కయు కార్యములయందు పాల్గొనుచు స్వంత బాధ్యతగా వ్యవహరించు చుండెడివారు. పరదేశాగతులకు వీరి యిల్లు స్వగృహముగా దలంపబడు చుండెడిది. శైవ పీఠముయొక్క కార్యకలాపముల యందును వీరు ప్రత్యేకాభిమానము కలవారై నిర్విఘ్న పరిసమాప్తికి తోడ్పడుచుండెడివారు. బహుజనోపకారకులును, నిష్కల్మష హృదయులును, కార్యవాదులు నైన యిట్టి సత్పురుషులయొక్క లేమి లేమిగానే యుండగలదని విచారించుచు, వారి యాత్మకు శాంతి కలుగు గాక యని శైవమహాపీఠ మాశించుచున్నది

శైవభక్త శిఖామణి -

శ్రీ ముదిగొండ రాజయ్య

జననం — 1917

మరణం — 1961



చేసేవి శివపూజలు. లోపల పులకరించేవి రక్తభావాలు— ఈ మాదిరి రెండు గుఱ్ఱాల బగ్గీమీద నవ్వుకుంటూ స్వారీచేసే ఒకానొక శైవ యువకుణ్ణి

చాలామందికి శికింద్రాబాదు బాలురు, నేస్తులు, గేస్తులు, ప్రముఖులు ఎఱుగుదురు. ఇతడు వాగ్భటాయుర్వేద నిలయ సహాయకుడు. తరువాత నిర్వాహకుడు మన ముదిగొండ రాజయ్య. రాజ్యాలేమున్నాయో తెలియదుగాని అనుంగు మిత్రులచేత "రాజనే" అతడు విశిష్టంగా పిలిపించుకునేవాడు. 1939లో సాధన సమితి పూసిన తొలిపూత "అంజలి" లో ఈ మాదిరిగా గానంచేశాడు—

కన్నీటి సెలయేరు
కడబట్ట లేదూ
మనసున కోర్కెలూ
మాయనే లేదూ
బ్రతుకున కష్టాల
పాలెరుగ లేదూ
సౌఖ్యాల నింకనూ
చవిచూడ లేదూ
జగతి జీవనసార
మరయనే లేదూ
బాహ్య మత్తులనింక
బాయనేలేదూ
భక్తి విముక్తులూ
నాకేడ నోయీ.

సాధన సమితిలో సభ్యుడు. వీరశైవ మహాసభలకు ముందంజ. హైదరాబాదు ఆయుర్వేద సభలలో (తే॥ 25, 26, 1951 సం॥) తలలోని నాల్క. తానున్నది ఆయుర్వేద వృత్తి. అది సహజమే. మతానికి మొదటి శత్రువు శారీరక మానసిక ఉద్విగ్నత, అనారోగ్యము. ఇది గ్రహించే వీరశైవం ఆయుర్వేదానికి, జ్యోతిర్విద్యకు, యోగశాస్త్రానికి ప్రాముఖ్యమిచ్చింది.

తన బహువ్యాపృత్తులతో న్యాయస్థానపు చిక్కులు కలిసి ఆరోగ్యము చెడి తన నలుబది నాల్గవ ప్రాయమున (9—9—61) భార్యను ముగ్గురు పిల్లలను, ఆయుర్వేద నిలయాన్నీ అన్న కుమారుల రక్షణకు వదలి తనదారి తాను శివలోక యాత్రకు పోవటం ఖేదజనకం.

శైవుఁడు అమృతోపాసకుఁడు. శితికంఠుడై, నాగభూషణుడై, సోమశేఖరుడై ఆనందలాస్యంలో మునిగి పదునాల్గు విద్యల సంశ్లేషగా ఢంకా నినాదాలు వర్షించిన ప్రణవమూర్తి, అతని ఆత్మకు, బంధుమిత్రులకు ఆశ్రయమిచ్చి బ్రోచుగాక యని ప్రార్థన.

జమ్మలమడక సూర్యప్రకాశరావు

# శైవమతము

విద్వాన్ శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రి

మత మన ఇష్టమని అర్థము. ఐహికాముష్మికములందు సంఘసమ్మత ధర్మముల ననుష్ఠించు భావమే మతమని కొందరి ఆశయము. పలువురు కూడి కార్యనిర్ణయము జేసికొని యా రీతిగ నాచరించుటయే మతమని మరికొందరు. కాని, బ్రహ్మతేజస్సంపన్నుడగు నొక్కొక్క మహాత్ముని సత్సంకల్పమే మతమని చెప్పదగియున్నది. ఆ మహాత్ముడు తాను సంకల్పించిన యాశయమును బయలుపరచి, తన్మార్గానుసారులుగ ప్రజలను నడిపించుటకు ప్రయత్నము చేయుచుండును.

శ్రీ మజ్జగద్గురుండును శైవసిద్ధాంత వ్యాపకుండు నగు శ్రీ నీలకంఠాచార్యులవారు తమ మతము నిట్లే వ్యాపింపజేసిరి. ప్రాచీనకాలమున శ్రీ శంకరాచార్యులవారును అద్వైతమతము నిటులనే వ్యాపింపజేసిరి. శంకరాచార్యులవారి భాష్యమునకు మూలము శ్రీ గౌడపాదుని కారిక. ఈ గౌడపాదులు సాంఖ్యమతస్థులు. సాంఖ్యమతస్థులగు గౌడపాదుల సిద్ధాంతములనే శంకరాచార్యులవారు విశదపరచిరి. రామానుజ బుద్ధ వివేకానందులీ మార్గమునే ద్రొక్కిరి. సహగమన నిరోధమునకయి స్వదేశ విదేశములందనంతములగు కడగండ్ల బడిన రామమోహను దేకేశ్వరోపాసకుడై బ్రహ్మసమాజమును స్థాపించెను. ఇవి యవి యననేల ? సర్వమతములును తత్తన్మతాధికారుల యభిప్రాయములతో నిండియున్నవి. కావున నొక్క మహాత్ముని యభిప్రాయమే మతమని చెప్పవచ్చును.

## మతావశ్యకము

ప్రతి మానవునకు మత మావశ్యకము. మతాచారముల నతిక్రమించువాడు సాధారణముగ నుభయభ్రష్టుడగుచున్నాడు. మతాతిక్రమణము మానవునకు శ్రేయస్కరము కాదు. పూర్వకాలమున నట్టివానిని మతమునుండి బహిష్కరించువారు. ప్రస్తుత మీ పూర్వాచారము తక్కువ జాతులతో సంపూర్తిగ గానుపించుచున్నది. మత మైకమత్యమును సమకూర్చును. స్వమతస్థులకు కామధేనువు. ఒక్కడు చేయజాలని కార్యమును సంఘము వలన నెరవేర్చుకొనవచ్చును. ప్రత్యేక సాంఘిక సభలు స్వసంఘాభివృద్ధికి మూలములు, మధ్వ, నియోగి వైష్ణవాది సభలిందులకు తార్కాణము. మనము తీర్మాన

ములఁ జేయవచ్చును. సభలు జరుపవచ్చును. ఉపన్యాసములీయ వచ్చును. ఆ తీర్మానముల వెంటనే అచరణములో బెట్టుట మాత్రము దుర్లభము.

## శైవ మతము

సర్వ మతములలో శైవముత ముత్కృష్టమైనది. శైవసిద్ధాంతము లతి ప్రాచీనములు. శైవులకు భుక్తి ముక్తు లతి ప్రాచీనములు. ప్రమాణములు నిగమాగమములు. ఎనిమిదివేల యేండ్లకు పూర్వము ఈజిప్టు దేశమున శివారాధన ముండెను. గ్రీకులు లింగార్చనా పరతంత్రులు. గ్రీకులే హిందూదేశమున లింగార్చన ప్రతిష్ఠించిరని కొందరి యాశయము. ఇది పెట్టి బూటకము. సర్వ మతాలయమగు భరత ఖండము నుండియే లింగార్చనమును వా రభ్యసించిరనుటకు కొన్ని శాసనములు కలవు. జ్యోతిశ్శాస్త్ర మొక్కటి దక్క తక్కిన శాస్త్రములు కాని, కళలుకాని, యాచారములుకాని పరదేశీయులీ దేశమునుండియే యభ్యసించిరనుటకు చారిత్రములు దృష్టాంతములు.

## శైవ మత మతిప్రాచీనము

బ్రహ్మేంద్రయోపి దేవాశ్చ మునయో గౌతమాదయః
ధారయంతి సదాలింగ ముత్తమాంగేచ సర్వదా
ముఖే మంత్రం హృది ధ్యానం మస్తకే లింగధారణం
శిఖాసూత్రం తథా భస్మ హ్యేతద్బ్రాహ్మణ లక్షణం॥

[లింగపురాణం]

ఇత్యాది శ్లోకములు వేదకాలము నుండియు శైవమతము కలదని ఋజువు చేయుచున్నవి. రామానుజులు నీలకంఠ భాష్యముయొక్క పంక్తులే తలలు మార్చి వ్రాసిరట! ఉభయభాషా విశారదులకు ఈ విషయము సుబోధము కాగలదు. ఇంతయేల? రామానుజులు వైష్ణవ మతమును సిద్ధాంతీకరించి విశేషముగా వ్యాపింప జేయుచున్నను వారి పినతల్లి లింగధారణ కలిగియుండ బలవంతమున నట్టి లింగమును తొలగింప జేసెనను ప్రవాదము దక్షిణదేశమునం దొకటి కలదు. అందుచే పూర్వమున సర్వమతస్థులును శైవమతస్థులను విషయము సత్యముగ గాన్పించుచున్నది. విష్ణ్వాలయముల కంటె శివాలయములు ప్రాచీనము లనుటకు ప్రబలాధారములు కలవు, రామానుజుల యనంతరము వైష్ణవ మత వ్యాప్తికి పాటలు, పద్యములు. నాటకములు మున్నగునవి వ్రాయబడినవి. బంగాళీభాషయందు "చరిత్ర" యను నాటకము శ్రీకృష్ణుని ప్రాముఖ్యమునే బోధించుచున్నది. ప్రప్రథమమున క్రైస్త

వులు మతవ్యాపనకయి నాటకముల రచించిరని మెక్డోనాల్డుఅను పాశ్చాత్య పండితుడు పలుకుచున్నాడు. మొట్టమొదట విశేషవ్యాప్తి కలది యగుట చేతనే కొందరు విముఖులయి యున్నను శుక్లపక్షపు తారలవలె నచ్చటచ్చట మత విషయములు కన్పట్టుచున్నవి.

## శైవ మతాభి వృద్ధి

శైవమతాభివృద్ధికిగాని, శైవమతమునకుగాని శైవ మతగ్రంథ నిర్మాణ పాండితీ ధురంధరులగు కవిరాజులకుగాని, కాశ్మీరము కన్నతల్లి. అభినవగుప్తాది మహా పండితులును శైవమతాభిమానులగుటయేగాక శైవమతావలంబకులై శైవగ్రంథములను రచించి శైవమతమునకు వన్నెదెచ్చిరి. సచ్చిదానంద స్వరూపమగు పరమేశ్వర తత్వమును నిరూపించి సంసారబంధమును తెగగోసి కైవల్యమార్గాధిరోహనిశ్రేణియయిన శివసూత్ర సముదాయమును రచించిన వసుగుప్తుడు శైవమతస్థుడని వక్కాణించిననే శైవుని హృదయమానంద తరంగితముకాదు. ఇప్పటికిని శైవగ్రంథము లధికముగా కావలయునన్న కాశ్మీరమునసే మనకు లభింపగలవు, కాశ్మీరము శైవమున కాటపట్టు. శైవమతాభిమానులకునికిపట్టు. శైవగ్రంథములకు కొంగుబంగారము. మరియు దక్షిణదేశమందును ఆంధ్రదేశమందును శైవగ్రంథము లనేకములు కలవు. శైవమతాభిమానులనేకులుకలరు. ప్రప్రథమమున రేవణసిద్ధాదిద్వాదశాచార్యులీ శైవమతమును వ్యాపింపజేసిరి. పిమ్మట భాష్యరాజము రచించిమతము నుద్ధరించినవారు నీలకంఠాచార్యులు, శైవభక్తాగ్రగణ్యులగు నప్పయ దీక్షితులవారు అనేకములగు శైవ గ్రంథములను రచించుటయేగాక శ్రీకంఠభాష్యమునకు శివార్కమణిదీపిక యను వ్యాఖ్యానము రచించి తనకుగల యినన్య శైవపక్షపాతమును వెల్లడిజేసిరి. హరదత్తాచార్యులు చతుర్వేద తాత్పర్యాది గ్రంథముల రచించి శైవ మతమునకు వెన్నెపెట్టిరి. లింగధారణదీపిక మున్నగు మతగ్రంథముల రచించిన భవానీశంకరారాధ్యులును, లింగధారణ చంద్రికాది గ్రంథకర్తలగు చాగంటి నందికేశ్వరశాస్త్రిగారును, చిన్మయదీక్ష, ఆహ్నికాంత్యేష్ట్యాది గ్రంథకర్తలగు వీరభద్రారాధ్యులు మున్నగు విబుధు లీమతమును పరిపోషించి జన్మసఫలము జేసికొనిరి.

### మతాభివృద్ధికి రాజావలంబనమే ముఖ్యకారణము

మతాభివృద్ధికి రాజావలంబనమె ముఖ్యకారణము. ఏ మతమైనను రాజాశయము లేనిది యభివృద్ధిగాంచనేరదు రాజాశ్రియరవిహితమైన మతము

చంద్ర రహితమైన రాత్రివంటిది. గౌతమబుద్ధుడు బింబసారాది రాజవతంసుల స్వాధీనము జేసికొని రాజశాసనము చేయించి తన మతమును వ్యాపింపజేసెను. ఆదిశంకరులు సయితము రాజశాసనమున బౌద్ధులను నిర్మూలనము జేయించి యద్వైతమును వ్యాప్తి నొందించెను. రామానుజులును రాజుల వశ్యము చేరి వారికి వైష్ణవమునిచ్చి తనగురుత్వమున కెక్కుడ్ర వశపరచుకొనిరి. మహమ్మదీయులును తొలుదొల్త ఖడ్గహస్తముననే తమ మతమును విస్తరింపజేసిరి. శైవమతము తోడిమతములకు కన్నెర్ర జేసిన దనుటలో వింతలేదు. ఈ మతమును బహువిధముల నాదరించిన మతప్రభువులలో యాంధ్రభోజుడని పేరెన్నికగన్న రాజరాజ నరేంద్రుడొక్కడని నుడివినా నెవని శరీరము పులకాంకితముగాదు? చోళ చాళుక్య వంశముల కనంతమగు కీర్తిని చేకూర్చి కాంచీపుర వేంగిదేశముల రెంటిపై ప్రభుత్వము వహించిన రాజనరేంద్రపౌత్రి తనూజుడగు కులోత్తుంగ చోళుడు శైవమతస్థుడై శైవమతమును పోషించెను. శైవమతకుమారీమణి తన యక్కచెల్లెండ్రలో నన్యమత బాలికలకంటె పూర్వము మహోదశ ననుభవించె ననుటకు సంశయము లేదు. ★



# శివపథం

## శివకవి శైవ శ్రీ ముదిగొండ రామలింగారాధ్యులు

నస్మరామి శివాదన్యం నమస్యేన్యం శివాదపి
శివాదన్యంన పశ్యామి శివఏవ మమప్రియః॥ 1

సమస్త దేవాశ్చ మమాపి ముఖ్యాః ముఖ్యాతిముఖ్య శ్శివ ఏక ఏవ
తస్మాచ్ఛివం హృన్నిలయే నిరూప్యభజా మ్యజస్రం శివపూజయామి

గురోః కరుణయాప్రాప్తం శైవదీక్షావిధానతః
శ్రీ మద్వక్షస్థలే క్షిప్త మిష్టలింగం సదా భజే॥ 3.

ప్రాణోత్క్రమణ పర్యంతం నత్యాజ్యం ప్రాణసన్నిభం
పాణిమూలతలే భాంతం ప్రాణలింగం భజామ్యహం॥ 4.

భావాభావో భయాతీతం భవబంధ విమోచనం
భావగ్రాహ్య మనాద్యంతం భావలింగం స్మరామ్యహం॥ 5

ముఖే త్రిపుండ్రరేఖాస్స్యుర్గళే రుద్రాక్షమాలికాః
వక్షస్థలే సులింగం స్యాత్త్వదారా ధ్యోస్మ్యహం శివ॥ 6



# శ్రీ శివపూజా మంత్రార్థము

శ్రీ నిర్మల శంకరశాస్త్రి

"శ్రీకంఠ విద్యాభూషణ" "సంస్కృత సాహిత్యరత్న"

"శైవ వాఙ్మయార్ణవ"

బ్రి॥ ముదిగొండ నాగలింగశాస్త్రిగారి శైవగ్రంథముల ననుసరించి పూర్వోపార్జిత విజ్ఞానము నాధారముగా గొనియు తాత్కాలిక సముత్సాహ బలమునను ఆరాధ్యప్రవరుల సదుపయోగమునకై మహాశివపూజామంత్రార్థ మును సులభశైలిలో యథాశక్తి వ్రాయుచున్నవాడను.

ప్రమాదవశమున దొసగులు వ్రాయఁబడినచో పండితులవ్వాని తెలిపి నన్ను కృతార్థుఁజేయగలరని ప్రార్థన!

భక్తస్థలమునందు గణప్రార్థన సంకల్పము కలశారాధన మొదలగునవి యుండుటచే మంత్రార్థమును వ్రాయలేదు. పూజాంగములలోని ముఖ్య భాగము మాహేశ్వర స్థలమునుండి ప్రారంభమగుటచే హస్తశుద్ధిమంత్రము మొదలుకొని మంత్రార్థమును వ్రాయనైనది.

మాహేశ్వరస్థలము.

(1) హస్తశుద్ధి మంత్రము.

"అయం మే హస్తో భగవానయం మే భగవత్తరః—అయం మే విశ్వ భేషజో్యయం శివాభిమర్శనః। అయం మాతా అయం పితా అయం జీవాతు ఇదం తవ ప్రసర్పణం సుబంధవేహి నిరిహి"

ఈనాహస్తము ఇష్టలింగమునకు ఆశ్రయ మగుటచేత భగవంతుని రూపమగునదియు మిక్కిలి పూజ్యమైనదియు సంసార మహావ్యాధికి ఔషధము వంటిదై పరమేశ్వరుని భావింప నుపయోగించునదియు నగును. ఇట్టి పవిత్ర హస్తము శివారాధనభాగ్యమును కలిగించు నదగుటచే సంసారకూపమునుండి లేవదీసి కాపాడుటలో తలిదండ్రులను బోలినదై నాకు శివానందము గల జీవనముగా లభించినది. కావున ఓ పరమేశ్వరా! దివ్యమగు నీ విభూతికి నిలయమైన చిదాకాశముగా ఈ కరతలమును భావించి మంచి బంధువువలె రమ్ము! నిత్యము కరతలమం దారాధింపఁబడుచు నన్ను నిరపేక్షునిగా నొనర్చుము!

(2) భస్మాసన మంత్రము.

"సర్వ భూతస్థ మాత్మానం సర్వ భూతాని చాత్మని"
"సంపశ్యన్ బ్రహ్మ పరమం యాతి నాన్యేన హేతునా"

పరమేశ్వరుని ప్రాణులందరి హృదయములందు నివసించు వానిని గాను చరాచర మంతయు భగవంతునిలో సూక్ష్మాంశమున వర్తించు నదనియు నిరంతరము లేదా శివపూజా సమయమందైనను భావించు బ్రాహ్మణుడు పరబ్రహ్మమును పొంద జాలును. మరియొక సంకుచితమైన జ్ఞానము తో పరమేశ్వర స్వరూప ప్రాప్తికి అర్హుడు కాజాలకుండును.

సంకుచిత జ్ఞాన మనగా? భగవంతుడు లోకాతీతమగు పరంధామము నందే యుండు వాడనియు, లోకమును వ్యాపించువాడు కాడనియు, లోకము సేవ జగన్మయమే గాని పరమేశ్వర స్వరూపము కాదనియు, పరమాత్మ ఒకానొక మూర్తి గలవాడై పరిమిత స్థలమునందుండు వాడనియు ఇత్యాది అశాస్త్రీయ భావనలతో నిండి యుండునది.

అనగా సదాశివుడు ఇష్ట ప్రాణ భావ స్వరూపములతో మాహేశ్వరులందు స్థూల సూక్ష్మ జ్యోతిర్లింగములందు బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ్వరులందు పిపీలికాది జీవాత్మలలోను నివసించి బాహ్యాభ్యంతరములందు నారాధింపబడునని యుపాసించు శైవునకే జ్ఞాన దార్ఢ్యము కలిగి శివ సాయుజ్యము లభించునని విశదమగును.

"తత్త్వమసి" ఇత్యాది మహా వాక్యార్థ జ్ఞానము వలనగాని పరమేశ్వరుని దక్క నింద్ర చంద్రాది దేవతలఁబూజించుటవలన గాని మోక్షము కలుగదు. కావున శివభక్తుఁడిట్టి సర్వాత్మ భావన గలిగి శివుని యుపాసించు చుండవలెనని సారాంశము.

(3) ఇష్టలింగమును లింగపేటిక నుండి తీయుటకు మంత్రము.

"వేదాఽహ మేతం పురుషం మహాంతం-ఆదిత్యవర్ణం తమసఃపరస్తాత్,
తమేవం విద్వా నమృత ఇహ భవతి–నాన్యః పంథా విద్యతే ఽయనాయ"

సూర్యుని వన్నెవంటి వన్నెగల దివ్య శరీరము గలవాడు, తమోమయి యగు ప్రకృతి కంటె మించినవాడును, ఈనా హృదయాంతర్వర్తియు నగు మహా పురుషుని– అనాది సంసార బద్ధుఁడనగు నేను శాంభవీదీక్షితుఁడనై యుపాసించు వాడను.

ఇవ్విధము శివపూజా సమయమునందు పరమేశ్వరుని ధ్యానించు శైవుఁడు ఈ జన్మయందే ముక్తుడగు చున్నవాడు. ఇట్టి శివజ్ఞానము దక్క వేరు నుపాయము మోక్షమునకు గానరాదు.

(4) ఇష్ట లింగమును కరతల మందు నుంచుటకు మంత్రము. (ఆసనము)

"సర్వలింగగ్ స్థాపయతి పాణి మంత్రం పవిత్రమ్".

"సర్వోవై రుద్రః" అను శ్రుతి ననుసరించి సర్వ శబ్దముతో చెప్పఁబడు శివుఁడు లింగస్వరూప మగువాడు. "సర్వలింగం" అనగా శివలింగమగును. హస్తమునందు పూజించుట వలన కాపాడునట్టి పవిత్ర శబ్దముచే నిర్వచింప బడునట్టి ఇష్టప్రాణ భావాత్మక మైనట్టియు శివలింగమును కరతలమునం తదారాధించి శాశ్వత శివసాయుజ్యమునకై హృదయాదివిహితస్థాన ములందు మాహేశ్వరుఁడు నిరంతరము ధరించుట విధిరైయె యున్నది.

(5) ఆవాహన మంత్రము.

"తవ శ్రియే మరుతో మర్జయంత–రుద్ర యత్తే జనిమ చారు చిత్రం పదం యద్విష్ణో రుపమం నిధాయి- తేన పాసి గుహ్యాం నామ గోనామ్"

సంసార దుఃఖమును పోఁగొట్టు రుద్రుఁడా? నీ ప్రాదుర్భావము మనోహరమైనది విచిత్ర మైనదియు కావుననే దేవతలు మాహేశ్వరులైన భూసురులును నీ రైశ్వర్యమునకై నిన్ను మిగుల వేడుచుందురు. మరియు బ్రహ్మాండము (పదునాలుగు లోకములు) నకు పైలి మేఁజయగు విరజానదీ వైకుంఠములకుఁ జెందియుండు నారాయణునికి చేరువగా పై భాగమునందు పరమ పదము (మోక్ష స్థానము) ను నెలకొలపి అందు నీ పావన పదమును నిలిపితివి. అనఁగా నివసించితివి.

అట్టి శివ పదధ్యానముతో–ఇంద్రియా తీతమగుటచే రహస్యమైనట్టి చిదాకాశము (హృదయా కాశము)ను కనుబఱచి యిట్టి శివ జ్ఞానమును రక్షించుచు శివరూపమైన నీ తత్త్వమును సాక్షాత్కరింపఁజేయుదువు గదా!

శ్రీ మేధా దక్షిణామూర్తయేనమః

ప్రసాది స్థలము.

(6) లింగ నిరీక్షణ మంత్రము

"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః - నానుధ్యాయే ద్బహూ౯ శబ్దా౯ వాచో విగ్లాపనం హి తత్, తమేవైకం విజానథ అన్యావాచో విముంచథ"

గాయత్రీ మంత్రోపాసనతో శివధ్యానాభి ముఖముగా తన బుద్ధిని ప్రేరేపించు పురుషుఁడుధీరుడనబడును.(ధియం ఈరయ తీతిధీరః అనివ్యుత్పత్తి)

ఇట్టి ధీరుడైన మాహేశ్వరుఁడు శివసాక్షాత్కారమునకు వలయు నుపాసనను ప్రారంభించు యోగ్యతకై శాస్త్రాభ్యాసమును ఆచార్యోపదేశమును బడయవలసి యుండును. పిమ్మట నట్టి శాస్త్రాచార్యోపదేశము వలన కలిగిన ప్రజ్ఞ (విజ్ఞానము) ను నిత్యము అభ్యసించు చుండవలెను. శివేతర దేవతలను శైవభిన్న మతములను ప్రతిపాదించు వాఙ్మయమును పఠింపరాదు మరియు నట్టి ప్రసంగముల నొనర్పఁగూడదు ఇట్టి కాలక్షేపము పరధర్మము నాశ్ర

యించు నదగుటచే స్వపతన హేతువై నిరుప యోగమగును. కావున శివు నొకనినే చరాచర వ్యాపకునిగా భావింపవలెను. వాఙ్మయ మంతయు శివునే సమర్థించు నది గావున శివేతర సమర్థకములు నాస్తికములునగు ప్రసంగముల నాకర్ణింపఁగూడదు. మరియు తాదృశ గ్రంథములను చదువరాదు.

అనఁగా నేతాదృశ అనుపమ విశాల హృదయము గలవాడై లింగ నిరీక్షణ ఁగావించినచో లింగ దర్పణమునందు లింగ విభూతి నంతయు చూడ నగునని సారాంశము.

ఇఁటనుండి ప్రారంభింపఁబడు దశావధానములలో నాలుగవదైన స్తుతికి నాలుగు మంత్రములు చెప్పఁబడినవి.

(7) స్తుతి మంత్రములు

(1) "తముష్టుహి యఃస్విషుః సుధన్వా యో విశ్వస్య క్షయతి భేషజస్య, యక్ష్వామహే సౌమనసాయ రుద్రం నమోభిర్దేవ మసురం దువస్వ"

అమోఘ బాణములు సుదృఢమైన పినాక మనెడి ధనుస్సున్ను గలిగి సంసార మహావ్యాధిని నిర్మూలించు నౌషధము వంటివాడు నగు మహాదేవుని మోక్షోపాయంబగు శమ (మనఃప్రసన్నత దమ కర్మ జ్ఞానేంద్రియములను తద్విషయములనుండి తొలగించుటఅనఁగా నవ్వాని వేగము నుపసంహరించుట) శౌచ - (బాహ్యాపరిశుభ్రత) క్షమాగి సద్గుణములు కలిగియుండు సౌమన స్యము (విహితమైన బుద్ధి కలిగియుండుట) కొరకు నమస్కార పూర్వకము శైవ వైదిక లౌకిక స్తోత్రములతో నారాధించువారము. కాన వో మహే దేవతలను బాధించు రాక్షసులవలె నన్ను పీడించుచు పదే పదే అవమానించు చున్న బహిఃశత్రువులైన నరులనుభూత ప్రేత పిశాచ విషజంతువులను మరియు నంతఃశత్రువులగు కామక్రోధ లోభమోహ మదమాత్సర్యములను దురహం కార దురభిమానములనుఅనాది కాలమునుండి నాలో నెలకొనియున్నట్టి వైవాని మూలకారణమైనట్టియు అసురీ సంపదను తొలగించి యీ ముముక్షు వును (నన్ను) నీవానిగా జేసుకొనుము!

అనఁగా తనచుట్టు తిరుగు పురుగును తుమ్మెద—తనతో పోల్చు కొనునట్లు శాంభవీదీక్షా పురస్సరముగా శివారాధనఁగావించు జీవాత్మ—శివ సముండగు నని భావము.

(2) "త్ర్యంబకం యజామహే—సుగంధిం పుష్టి వర్ధనమ్ ఉర్వారుక మివ బంధనా—న్మృత్యోర్ముక్షీయ మాఽమృతాత్"

"త్రీణి అంబకాని యస్యసఃత్ర్యంబకం" అంబక శబ్దము-నేత్రమును గుణమును చెప్పునది. పరమేశ్వరుఁడు—మూడు కన్నులు గలవాడనియు సత్త్వ

రజస్తమో గుణములు సర్వజ్ఞతాది దివ్య గుణములును కలవాడనియు చెప్పవచ్చును.

"త్రిస్రఃఅంబకాఃయస్యసః త్ర్యంబకః" అనియు వ్యుత్పత్తి యగును.

అంబక యనగా పరమేశ్వరుని శక్తి॥ ఇట్టి శక్తి ఇచ్ఛా జ్ఞాన క్రియలను మూఁడు విధములు కలుగునది. జగత్కారణమైన పరబ్రహ్మము—ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులు కలిగి సృష్టిస్థితిలయ తిరోధానా నుగ్రహములఁజేయుచు త్ర్యంబక మనఁబడుచున్నయది.

తా జేయుచున్న నిత్య నైమిత్తిక కామ్య సుకృత కర్మల యొక్క ఫలముల నాశించక బ్రహ్మార్పణఁగావించు మహానుభావునికి బ్రహ్మో పాసన దార్ఢ్యమునకు నలయు పరిపుష్టిని కలుగఁజేసి కర్మఫల త్యాగమువలన నేర్పడు సుగంధమును అనఁగా పరిమళము వంటి మనః—సమాధానమును ప్రసాదించు వాడునగు పరమేశ్వరుని-యజామహే-ఆరాధించుదుము. ఇట్టి యారాధనము సర్వ కాలములందు విహిత మగుటకు హృదయమునందు నిలుపు కొందుము. హృదయ స్థానమున ఒకానొక పీఠికయందు శివలింగమును ధరించి లింగ నిరీక్షణాది యోగములతో త్ర్యంబక దేవుని షట్కాల త్రికాల ఏక కాలము లందు పూజింతుము.

కాననో మృత్యుంజయా? సంసారము-జనన మరణ ప్రవాహాత్మకమై మృత్యువనఁబడుచున్నది. ఇట్టి మృత్యువునుండి నన్ను-తొడిమె నుండి దోస కాయను వేరు బఱచునట్లు—విడదీసి ముక్తునిఁజేయుము! మరియు జీవిత కాలమున ప్రారబ్ధవశమున వచ్చెడు సంకటములను పోనాడుము!

(3) "శివేన వచసా త్వా గిరిశాచ్ఛా వదామసి—యథానఃసర్వమిజ్జ గద యక్ష్మగ్ం సుమనా అసత్"

శంకరా? నిన్నుగురించి గాని నీభక్తుల నుద్దేశించి గాని నీ విభూతియగు జగమును గూర్చి గాని మంగళ కరములైన వాక్యముల నుచ్చరింతుము. ఎందు కనగా? ఈ జగమంతయు ఎట్టి యుపద్రవములు లేకుండుటకు ప్రాణులందరు సుమనస్కులుగా నుండుటకును, శుభచింతనము మరియు మంగళ వాక్యోచ్చా రణయు నుపయోగించునని భావము.

కామ క్రోధాది వికారములకు లొంగకుండు మానవుఁడు పూర్వార్జిత పుణ్యబలమ్మున శాంభవదీక్షితుడై శివయోగము నాచరించుచున్న యెడల క్రమముగా మనస్సు శివ చింతనను, వాక్కు మంగళోచ్చారణను, శరీరము విహితా చరణను గావింపఁజాలునని సారాంశము.

(4) "త్వం దేవేషు బ్రాహ్మణోస్యహం మనుష్యేషు! బ్రాహ్మణో వైబ్రాహ్మణ ముపధావతి! ఉపత్వాధావామి"

పరమేశ్వరా? నీవు బ్రహ్మ విష్ణ్వాది దేవతలలో బ్రాహ్మణుడ వగుదువు!

నేను మానవులలో బ్రాహ్మణుఁడను. లోకములో తఱచుగా బ్రహ్మ నిష్ఠగల బ్రాహ్మణుని బ్రహ్మనిష్ఠఁగోరు బ్రాహ్మణుడు ఆశ్రయించుట న్యాయము. కాన సర్వోత్తముడ వైన నిన్ను సమీపించుటకు శరణా గతుడ నగుచున్న వాడను. నన్ను నీవానిగా భావించి లింగాంగ సామరస్యమను శివ జ్ఞానము.ను కలుగఁజేసియు సంసార సముద్రము నుండి యుద్ధరించుమని భావము.

(సశేషము)



తద్విష్ణో పరమంపదమ్

# దక్షిణ కాశి

## శ్రీ కామర్సు చంద్రమౌళిశాస్త్రి

భయభ్రాంతులచే నావరింపఁబడిన సంసారులకు నతి భీతిని గొల్పు నిదియొక మహాదరణ్యము. శివైకనిష్ఠులగు పావనులందు ప్రవేశింప నొక దివ్య శివ క్షేత్రమగపడును. ఇటగలజీవులు శివునిలో నైక్యము జెందుదురని సూచించుట కన్నట్లు కొన్ని గుణముల గోదావరితో సరితూగు ప్రణీతాయను యొక పుణ్యనది క్షేత్రమునకు తగిలియే ప్రవహించు గోదావరిలో సంగమించు చుండును. సంగమ ప్రవాహములో కొంతదూరము నలుపు తెలుపు రూపము లతో ప్రవహించు ప్రణీతా గోదావరీ జలములను చూచిన ముక్తుడుగాని జీవునకు శివభిన్నత్వ ముండునని తెల్పుచున్నట్లు తోచును. దేహమందలి షట్చక్రముల ములలో చేరిన హృత్పుండరీకమున యుండునది లింగమే యని తెలుపుటకు వలె రెండు ప్రణీతా తీరములు రెండు గోదావరీ తీరములు, రెండు సంగమ తీరములు. వీటి మధ్య లింగమొకటి గలదు. తిరుగ జన్మాదులు లేని సాయుజ్య ముక్తిని పొందిన జీవుడు శివసముడగును. శివసాయుజ్యమే తిరుగ జన్మాదులు లేని ముక్తియని తెలుపుటకేమొ ఇట గలది శివలింగము. సాయుజ్యముక్తిలో చేర్చుటకు నధికారి శివుడే. లింగపూజాదులవల్లనే యది సిద్ధించునని బోధపడు టకు నీ లింగమునకు సంగమేశ్వరాభిధయై యుండును. లింగస్వరూపుడగు శివుడు దప్ప మిగిలినదెల్ల నశ్వరమని తెలుపుచున్నట్లు నాలయమెల్ల శిథిల మవుచు లింగము మాత్రమె నిలచియుండెను. ఇళాపింగళా సుషుమ్నా నాడుల సంగమమగు భ్రుకుటి (త్రికూటము) లో గలుగు జ్యోతిస్వరూపమగు లిగము నుల్లంఘించి యన్యదేవతా దర్శనాకాంక్షులగు యోగులు వ్యర్థపథముల

బడుదురని తెలుపుచున్నట్లు మధ్యన లింగమును గలిగి మూడు మైళ్ళ వెడల్పుగా ప్రవహించు ఇచటిగోదావరీ యావలయొడ్డునుదాటినయాంగ్లేయ రాజ్యమారంభమగుచుండెను. ఈ క్షేత్రమునకు కాశీ సమత్వమును చూపెట్ట నుత్తరాభిముఖిగా ప్రవహించు గోదావరి మరియును విశేషమును చూపెట్టుటకై భైరవాజ్ఞచే ప్రణీతను తనలో తీసికొని ప్రాఙ్ముఖిగా ప్రవహించుచుండును.

శివ సంగమునకు ముక్తుడని పేర్వడుటకు కొంత సమయము పట్టుననుటకు దృష్టాంతమువలె సంగమ దేవాలయమునుండి ముక్తీశ్వరు నాలయము చేరుటకు కొంత సమయ మవసరము. ఈ దేవాలయమందలి శాసనములో దేవాలయమును కట్టించిన తిథి వారాది విషయములలో జూడ శివు డొకడే యాది యనియు, తద్భిన్నము లవాంతరములనియు నర్థమగును. ఇట గల ధ్వజస్తంభమున శివభక్తిలేని యెట్టి వారైన నిందులో ప్రవేశింపరాదని కావలాచేయుచున్న మూర్తివలె యొక భైరవ విగ్రహముండును. ఒక మూరెడు వెడల్పుతో మూడు మూరల పొడవుగలిగి ఎడమపైపులో నుండు శాయాది మత్స్యావతార విగ్రహమును చూడ వాసుదేవుడు మొదలగు దేవులీ సేవకై వచ్చియుందురని తోచును. నిదర్శనమున కిట ముక్తీశ్వరుని దక్షిణభాగమున బ్రహ్మ, సరస్వతి వెంకటేశ్వరుల, ఉత్తరమున బాలరాజేశ్వరీ సురాభాండేశ్వర నీలకంఠేశ్వరులు, ఈశాన్యమున సనక సనందన మునులు (మాసోపవాసిని) యగు మంగళ గౌరి సిద్ధేశ్వరులు, ఆగ్నేయమున ఢుంఢి దండపాణి బిందు మాధవ కాలభైరవులును, తూర్పున కొంత దూరములో గాయత్రీ దేవాలయమును యుండును. అన్నపూర్ణ ముక్తీశ్వరుని భార్య. కాశీశ్వరుని భార్యకు సదాపూర్ణ, శ్యామలా యనియు పేర్లు. కాశీనుండి విశ్వేశ్వరుడు వచ్చిన గుర్తులును ఇట గనపడును.

భక్తిభావముల నెరుంగని ఎట్టి నాస్తికుల హృదయములోనైనను భక్తిభావముల ప్రతి ఫలింపజేయుచు శిథిలములగు మహాపురాతన దేవాలయము లెన్నెని కనబడుచున్నను ముఖ్యముగా ముక్తిదాయకమగు దేవాలయమొకటి కలదు ప్రపంచమంత లింగమునుండి వెడలుటకు నొకదారి. తిరిగి ప్రవేశించుటకు మరియు నొక దారి యున్నట్లు లింగశబ్దార్థమును ప్రత్యక్షముగా నిరూపించుచుండినట్లు ఈ దేవాలయమందలి లింగముఖమునకు ముక్కు చెలిమెల వలె రెండు రంధ్రములు గలవు. లింగ మాహాత్మ్యము నెరుగని యనాగరికులు కలిపురుష ప్రేరిత దుర్మేధులయి వీటి లోతును పరీక్షింప లింగ మాహాత్మ్య మగమ్యమని తోపుటకో యన్నట్లు ఈ దేవునకు ఎంత యభిషేక నీరమిడినను ఈ రంధ్రములగుండా నదృశ్యమగుచుండెను. ఈ లింగ పానవట్టముమీదనే కాలుడు (యముడు) ప్రతిష్ఠించిన లింగ ముడును. అందుకనియే ఈ లింగమునకు కాళేశ్వరుడని పేరు, మొదట కాళేశ్వర పూజా సంకల్పము లేక తనను

పూజించిన ముక్తి నొసంగనని ముక్తీశ్వర వాగ్దత్త మిట కాలునకు. కాలుని కోరికచే నేర్పడిన ఈ క్షేత్రమునకు కాళేశ్వరమనియే పేరు. ఒకప్పుడు యముడు దయాతిశయమున స్వర్లోకాధిక సుఖమును పాపుల కిప్పింప దలంచి విశ్వకర్మచే నొక పట్టణమును నిర్మింపఁజేసి, యట కరుదెంచువారలకు ముక్తి నొసంగుటకై ఈశ్వరుని వలన వరముగా నీ ముక్తీశ్వరుని దర్శనమువలన, యమపురి కేగువారే లేకుండిరి. అంత విచారపడి బ్రహ్మసహాయుడై ముక్తీశ్వరుని వేడ, నా పానవట్టముమీదనే నీవు లింగ ప్రతిష్ఠచేయుము నీ లింగమును పూజింపక నన్ను పూజించిన ముక్తి నొసంగనని ముక్తీశుని వాగ్దత్త మిందుంకే. అప్పటి నుండియే యా లింగమునకు కాళేశ్వరుని పేర్వడినది. ఇచటగల చిత్రగుప్తుడు యుక్కు స్తంభము యమకోణము యమకుండములో పాపము ననుభవించు పాపుల విగ్రహములమ బట్టి క్షేత్రచరిత్రయందు సంశయమే యుండదు. ఇచట నివసించు భక్తులకు నైశ్వర్యాదులు కలుగు ననుటకు ప్రత్యక్షోపమానముగా నిట గల యచేతనములగు పాషాణములనైనను కొన్నిట పగలవేసిన లోన విభూతి వెడలుచుండును. ఈ పాషాణ పేటికలుగల ప్రదేశముననే యాది ముక్తీశ్వరు డుండును. కాళేశ్వర లింగమేర్పడని సమయమున దర్శనము వల్లనే ముక్తి నొసంగు దేవుడీత డనియే తోచును.

ఆంధ్రదేశము త్రిలింగదేశమని వ్యవహరింపఁబడుటకు కాళేశ్వర ద్రాక్షారామ శ్రీశైల లింగములు హేతువులని చరిత్రకారుల వ్రాత. ఆంధ్రదేశావధిని చూప నీ క్షేత్ర మొక ముఖ్య చిహ్నము. కాశీ సమత్వమునో విశేషత్వమునో తెలుపుటకయ్యే కాశీనామాద్యక్షరము, ఈ క్షేత్ర నామాక్షరమై యుండును. ఈ సమత్వ విశేషత్వముల గూర్చి తగాదా పెట్టుకున్న జయవిజయుల కలహమడప సూర్యుడు త్రాసున నీ రెండు క్షేత్రముల తూచ విశేషము కాళేశ్వరమున కనబడినందున జయుడు తలవంచికొనినట్లు ఇరుపార్శ్వముల కల ఇచటి జయ విజయ విగ్రహముల జూచిన తేలును. మహర్షి వ్యాసుడును, కాశీ సమత్వమును సూచించుటకయే దీనికి దక్షిణకాశి యని పేరు బెట్టుచు శౌనకాది మహర్షి ప్రశ్న రూపకమగు శ్లోకము ద్వారా విశేషమునే చూపెట్టెను. ఈ పవిత్ర క్షేత్రము ఆంధ్రదేశమునకు సంబంధించిన కరీంనగర్ జిల్లాలోని మంథెన (మంతెన్న) గ్రామమునకు కొంత దూరములో యుండును. (చంద్రపురం) చాందా జిల్లాలో చేరిన సిరివంచ తాలూకా యిచటికి అయిదు మైళ్ల దూరములో యుండునని తెలియుచున్నది, ఉండుటకు వీలులేక క్షేత్రనివాస ఫలమును కోరువారు చూచినను, స్మరించుచుండినను, పూర్ణ ఫలమును నొందుదురు. ఈ కాళేశ్వరమే దక్షిణ కాశీ; మరియు వైష్ణవపదము కంటె ఉత్కృష్టమై తచ్ఛబ్దవాచ్యమగు ముక్తి పదము ఇదియే (ఇచటనే) యని యనినను చెప్పవచ్చును.

# శ్రీ నీలకంఠ భాష్యము చతుస్సూత్రి

మూలము - శ్రీ నీలకంఠ శివాచార్యులు ఆంధ్రానువాదకులు.
శ్రీ కంఠ విద్యాభూషణ, సంస్కృతసాహిత్యరత్న, శైవవాఙ్మయార్ణవ.
శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు.

మూల్యము - రూ 5-00
శైవమతప్రకాశికా చందాదారులకు - రూ 3-00

ఎట్టి భాషయును ప్రపంచములో విస్తరిల్ల నున్నప్పుడు సంస్కారము నపేక్షించుచుండెను. అట్టి సంస్కారమును బడసినదై జనసామాన్యమున సుస్థిరమై నెలకొని ప్రాదేశికములుగా వ్యవహరింపబడుచుండును. ఇయ్యది యుత్తమాధమ భేదములచేత మూడు విధములై కనుపట్టుచున్నవి. ఏది పలుకుటయందును వ్రాయుటయందును ఒకే రూపము కలిగియుండుటయేగాక వాచ్యమగు వస్తువునందలి ధర్మమును తెలుపుచున్నదో అది మొదటిది. ఇట్టిది యొక సంస్కృతభాష మాత్రము కనుపట్టుచున్నది. ఏది యుచ్చారణ లిపుల యందు నేకత్వము కలిగి గుణ నిర్వచనము చేయుటలేదో యది రెండవది. తెలుగు, కన్నడము మొదలగు భారతీయభాషలు. ఏది గుణ నిర్వచనము చేయకుండుటయేగాక యుచ్చారణ లిపులయందును సామ్యము కలిగియుండదో యది మూడవది. ఇందుకు నాంగ్లేయభాష నుదహరింపవచ్చును. అత్యుత్తమమైన సంస్కృతభాష ఎప్పు డెట్లు పుట్టెనో తెలిసికొనుట కష్టసాధ్యము, పూర్వమది దేవభాషయేమో! దానికి ప్రథమ వైయాకరుణులు సూర్యుడు, బృహస్పతి మొదలగువారైనట్లు తోచుచున్నది. దేవతలకు మానవులకు సంబంధములు కలిగిన దినములలో నిచటికి తేబడిన దాని సామరస్యమునకు ముగ్ధుడైన భారతీయుడు వేదరూపమున నిలిపికొనియుండును. నాటికాలమున రావణబ్రహ్మ, గార్గ్యుడు మున్నగు వైయాకరణుల నామములు వినవచ్చుచున్నవి. కాని, విశాలహృదయుడగు భారతీయుని కంఠమాత్రమున తృప్తికలుగలేదు. దేశీయములు సంకుచితములగునన్న భావమునకురాక దాని విస్తారము నభిలషించెను. కవిత్వమున పాడుకొనజాలును, నానాటికి లౌకికముగా విజృంభించు దాని ప్రక్షీణతను శంకించి పాణిన్యాచార్యులు సుస్థిరముగ జేయుటకు క్షుణ్ణముగ సంస్కరించెను. నాడది సంస్కృతమయ్యెను. కావ్యములుగ, పురాణములుగను, గద్యపద్యబంధమున విస్తరిల్లుటయేగాక మానవుని మూలసిద్ధాంతములగు సూత్రభాష్యాదులుగా వెల్లి విరిసెను కాలప్రగతి యనూహ్యము సర్వభాషా ప్రథమగణ్యమై, విశ్వవిఖ్యాతినందుచున్న సంస్కృత స్థానమును

దేశీయము లాక్రమింపజాచెను. ప్రజాభిమానమును చూరగొనుచున్న దాని వైశిష్ట్యము నే భాషాంతరములచే ప్రకటింపజాచిరి. ఇట్టివానిలో మనయాంధ్ర భాష యొకటి. ప్రథమమున శాసనములుగా వెలువడి, క్రమేణ పురాణకావ్య నాటకాదుల దెనిగించుకొను వరకు వెళ్ళియుండెను. ఇంకను సంస్కృతమహా మేరువునుండి తేవలసిన రత్నము లెన్నియేని కలవు. వానిలో సూత్ర భాష్యము యొకటి. భారతీయుని నైజతత్వమును సిద్ధాంతము జేయుచున్న భాష్య విశిష్టతను నేటి నాగరికులమనుకొనువారికి సులభబోధ్యమగునటుల జేయుట పండితుని విధి. అందుకు శ్రీ నిర్మల శంకరశాస్త్రిగారు ప్రథమ శైవ భాష్యమగు శ్రీ నీలకంఠ భాష్యమును మక్కికి మక్కిగా ననువదించుటకు చేసిన కృషి సుశ్లాఘ్యము. బహ్వర్థపదగంభీర సంస్కృత మహా సముద్రమును అంచును విశేషించి సూత్రభాష్యమును భాష్యాంతరములలో నవలోడన జేయుటకు నెంతటి పరిశ్రమ యవసరమో మూలమును అనువాదమును చేబట్టి చూచినవారికి తెలియకపోదు. తక్కిన మొత్తము భాష్యమును తెనుగు భాషకు భూషగ నవతరింపజేసి శ్రీ శాస్త్రిగారు ధన్యులగుదురుగాకయని యాశించు చున్నాను.

—బి. చిదంబరశాస్త్రి

———

# మానసోల్లాసము

సకలశాస్త్ర పారంగతులైన శ్రీ మదప్పయ్యదీక్షితేంద్రుల

విరచితము

ఇందు బుద్ధి మనస్సును చూచి "ఏమఱపాటునైనతో నీవు నిలువజాలవు. శంకరుని స్తుతించి ముక్తినొందుము. నీ సహచరుడనైన నాకు, నిన్ను, నీ వ్యాపారమును జూచిన దుఃఖము, ఆశ్చర్యమును కలుగుచున్నది" యని బోధింప మనస్సు నిజమును గ్రహించి మహాదేవ స్మరణము నొనర్చె. బుద్ధితో తరించినటుల వర్ణింపబడియుండుటచేత మానసోల్లాసము పేరు సార్థకమగు చున్నది. మరియు బుద్ధికి బుద్ధి చెప్పిన మీదట మనస్సునకు నుల్లాసము గలిగిన నది కావున మానసోల్లాసమనియు చెప్పవచ్చును.

అ. వ॥ బుద్ధి మనస్సుతో నిటుల చెప్పుచున్నది.

శ్లో॥ అసేవ్య భ్రాతస్త్వం పరమ ముపదేశం శృణు మమ
స్మరారే రర్చాయాం పటుషు కరణేషు స్థిరబలం
తతస్తేషాం ప్రేష్యాణా ముపరతికృతి శ్రాంత మహతి
త్వయైకేన శ్వాసప్రశమసమయే కిన్ను సుకరం॥

ఓయీ! తమ్ముడగు చిత్తమా! ఉత్కృష్టమగు నా యుపదేశమును వినుము. నీ ఇంద్రియములకు శక్తి యున్నప్పుడే కామ సంహారి పూజ నతని ఫలమును స్మరింపుము. మరణకాలమునందు నీకు కలిగిన శ్వాస నీ భృత్యులగు నింద్రియముల శక్తిని బాపి, తాను శమించిపోవుచుండగా నీ యొక్కని చేత చేయదగిన కార్యమేదియును లేదు.

శ్లో॥ అతిస్ఫీతాన్ ఫీతానపి శిఖరిణః పక్వ చరితాన్
కియంతం కాలం వా కిసలయ మృదు స్థాస్యతి వపుః
అపారేఽస్మిన్ ప్రాజ్ఞామయి వ్యాదయ శంభోర్నకురుషే
క్వ వేద్మ్యక్ తే లభ్యం కథయ జడ తంత్రోపకరణమ్॥

[సశేషము]

# శైవమత ప్రకాశిక చందా వివరములు.

| | |
|---|---|
| | సంపాదకులు |
| మహారాజ పోషకులు | రు॥ 116-00 |
| రాజ పోషకులు | 50-00 |
| ప్రధాన పోషకులు | 25-00 |
| పోషకులు | 10-00 |
| అభిమానులు | 5-00 |
| చందాదారులు | 3-00 |
| విడిపత్రిక | 0-25 |



[illegible] ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాదు - (ఆం. ప్ర.)

# శైవమత ప్రకాశిక




## శ్రీ శైవ మహాపీఠము

1 - బి. పద్మారావునగరు, సికింద్రాబాదు.

పబ్లిషరు : టీ. వేట చిదంబర శాస్త్రి

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పత్రముగా ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు- కందుకూరి వీరబసవరాజు

| | | |
|---|---|---|
| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>23-10-61, 22-11-61<br>ఆశ్వయుజ పూర్ణిమ, కార్తీక పూర్ణిమ | సంచిక 7 |


శ్లో. "నసందృశే తిష్ఠతి రూపమస్య నచక్షుషాపశ్యతి కశ్చనైనం
హృదామనీషా మనసాభిక్లృప్తోయఏనం విదురమృతాస్తే భవన్తి."

తైత్తిరీయోపనిషత్తు

పరమేశ్వరునియొక్క దివ్యరూపము ప్రాణుల దృష్టివిషయమునం దానుటలేదు. కావుననే ఎట్టివాడును అట్టి దివ్యరూపమును చక్షురాదింద్రియములచేత చూడజాలకున్నాడు. కాని అది యంతర్వర్తియగు జ్ఞానప్రేరితమైన మనస్సుచేత సుగ్రాహ్యమగుచున్నది. ఎవరు దీనిని ఏకాగ్రమున ననుభవించుచున్నారో వారు జనన మరణాది రహితులై సదా భాసించుచున్నారు.

## అష్టగ్రహకూటము

జ్యోతిశ్శాస్త్ర రీత్యా, నవగ్రహములు సంచరించుచుండి మానవుని యాయాజన్మరాశుల దృష్ట్యా ఏకాదశాది స్థానములయందు శుభఫలమును, అష్టమాది స్థానములయందు దుష్టఫలితములను ఇచ్చుచుండునని చెప్పబడి యున్నది. ఇట్టి సూర్యాది గ్రహములు మేషాది ద్వాదశరాశుల యందు సంచరించుచుండుటయేగాక యట్టిగ్రహములె మానవునకు శుభాశుభఫలముల నొసంగుచుండుననుట ఎంతవరకు విశ్వసింప వచ్చు

వితర్కమునకు పోక తత్వనిర్ణయమున పరిశీలించిన యెడల నియ్యది సుస్పష్టమగును.

తొల్లిటి మహర్షులు దివ్యజ్ఞాన సంపన్నులు. గత కాలమున జరిగినదియు, రాబోవు కాలమున జరుగ బోవునదియు తమ దివ్యదృష్టి చేత తెలిసికొనుటయే గాక అందలి చెడును పరిహరించుటకై వలయు నుపాయములను సృష్టించుటకును సమర్థులైయుండిరి. కనుకనే నానాటికి మానవునకు అజ్ఞానపు భాగమధికమై జ్ఞానదృష్టి మరుగు పడుచుండ నట్టివారు రాగల విపత్తులను స్థూలముగా తెలిసికొనగలిగి వాని నుండి తప్పుకొనుటకైన యుపాయములను క్రోడీకరించిరి.

అందు గ్రహలాఘవ పద్ధతియు నొక ముఖ్యమైనది. ఆయాలగ్నముల యందు జన్మించిన వాని గ్రహసంపత్తి ననుసరించి యాయా జీవిత విశేషములను తెలిసికొన గలుగుటయేగాక ప్రపంచమునవాడెంత కాలము వరకు జీవించ గలుగునదియు ముందుగనే తెలియునట్లొనర్చిరి. ఇద్దానిచేత వ్యక్తిగతముగనే గాక కొన్ని విశేషములచేత ప్రపంచ పరిణామమును గ్రహించుటకు వలను పడుచున్నది. ఒక రాశి యందు అనేక గ్రహములు సంగతములగు చుండుట చాలా అరుదనియు, అట్లు సంభవించెనేని వ్యక్తులకే గాక దేశమునకున్ను అరిష్టము సంభవించునని సూచింపబడినది. కొన్ని వేల సంవత్సరముల క్రితము సప్తగ్రహ కూటము కలిగి యుండెననియు అప్పుడు కురు పాండవ యుద్ధమున కొన్ని యక్షౌహిణుల సైన్యము నశించెననియు ముందుగనే తెలిసికొని నటుల భారతమున వర్ణింపబడినది.

అధర్మరతుడైన మానవుని పాపము పండినపుడు కొన్ని యవాంతరములచేత నాతని సర్వవినాశనము తప్పదనియు, నాడు ధర్మైక పరాయణత్వమాతనికి రక్షకాగలదనియు భారతీయుని సిద్ధాంతము. నిష్పక్షపాతముగా విచారించినచో నియ్యది నిజమనియు గ్రహింపక తప్పదు. భీష్మ ద్రోణ కర్ణాది మహాయోధుల నాయకత్వము వహించిన పదునొకండక్షౌహిణుల సైన్యముచేత సంరక్షింపబడుచుండిన దుర్యోధనుడు తుదకు తన్నుపలకరించు వారైనను లేక మరణావస్థననుభ

వింపవలసినగతి యేల కలిగెను. అంతియెగాక యాతని నింద్య మానస వికారమును గ్రహింప నేరక నిష్పాండవ మొనరింతునని శపథము బూనిన యశ్వత్థామ అర్ధరాత్రివేళ కుతంత్రము పన్నియు పాండవుల నేల సంహారింపజాలకుండెను. అట్లు ధర్మజాదులు సర్వవిధముల సంరక్షింపబడుచుండుటకు వారి ధర్మపరాయణత్వమే కారణముకాదా! అతి కలుషితమైన నేటిలోకము పునరుద్ధరించుటకు సమయ మాసన్నమైనదని కలుగబోవు అష్టగ్రహకూటము సూచించుచున్నది. ఇందుకు తత్వదృష్టి కలిగిన భారతీయుడు నిర్మలహృదయమున విశ్వశాంతి నభిలషించి చేయు ప్రతి ప్రయత్నమున్ను తనకేగాక సర్వ ప్రపంచమునకును కళ్యాణదాయకము కాగలదు.



# మానసోల్లాసము

## సకలశాస్త్ర పారంగతులైన శ్రీమదప్పయ దీక్షితపాదుల విరచితము

ఇందు బుద్ధి మనస్సును చూచి "యమశాసనమైనచో నీవు నిలువ జాలవు. శంకరుని స్తుతించి ముక్తినొందుము. నీ సహచరుడనైన వాకు 'నిన్ను నీ వ్యాపారమును, జూచిన దుఃఖము, అసహ్యమున్ను కలుగుచున్నది" యని బోధింప మనస్సు నిజమును గ్రహించి మహాదేవస్మరణమునొనర్చి బుద్ధితో తర్కించినటుల వర్ణింపబడియుండుటచేత "మానసోల్లాస" మనుపేరు సార్థక మగుచున్నది. మరియు బుద్ధికి బుద్ధి చెప్పిన మీదట మనస్సునకు నుల్లాసము గలిగినది కావున మానసోల్లాస మనియు చెప్పవచ్చును.

అవ॥ బుద్ధి మనస్సుతో నిటుల చెప్పుచున్నది–

శ్లో॥ అయే భ్రాతశ్చేతః పరమ ముపదేశం శృణు మమ
స్మరారే రర్చాయాం పటుషు కరణేషు స్మర ఫలం
తవైషాం ప్రేష్యాణా ముపరతి కృతి శ్రాంత మహతి
త్వయైకేన శ్వాసప్రశమనసమయే కిన్ను సుకరం॥ 1

ఓయీ! తమ్ముడగు చిత్తమా, ఉత్కృష్టమగు నా యుపదేశమును వినుము నీ యింద్రియములకు శక్తి యున్నపుడే కామసంహారి పూజవలని ఫల మును స్మరింపుము. మరణకాలమునందు నీకు గలిగిన శ్వాస నీ భృత్యులగు నింద్రియముల శక్తిని బాపి, తాను శమించి పోవుచుండగా నీ యొక్కనిచేత చేయదగిన కార్యమేదియును లేదు.

శ్లో॥ అతిస్ఫీతాన్ వీతానపి శిఖరిణః పశ్య చలితాన్
కియంతం కాలంవా కిసలయ మృదు స్థాస్యతి వపుః
అపారేఽస్మిన్ పూజామయి హృదయ శంభోర్నకురుషే
క్వవేదృక్ తే లభ్యం కథయ జడతంత్రోపకరణం॥ 2

ఓ హృదయమా! చూడుము, పర్వగా నుండి మిక్కిలి గొప్పవగు నీవృతములు కూకటి వేళ్ళతోకూడ కూలిపోవుచున్నవి. చిగురుటాకులవలె మృదువైన నీ శరీర మెంతకాలము నిలువగలదు మూఢుడా! ఈ జన్మమును పర మేశ్వరుని యనంతమగు పూజకు వినియోగిం కుండినచో తిరిగి నీకు తరించుట కట్టి ప్రధాన సాధన మెప్పు డెక్కడ లభింపగలదు?

శ్లో॥ ఇదం సజ్జీభూతం కృతమిద మిదం కార్యమధునే
తృలం వ్యర్థారంభః తవ బత మనః శామ్యతి కదా
న ఖల్వాగంతా తే శివభజన కార్యేఽప్య సమయః
సముద్యన్నిర్ఘోషజ్వల దశనిపాత ప్రతినిధిః॥ ౩

ఇది సిద్ధమైనది. యిది చేయబడినది, యిది చేయవలయునని యెప్పుడు తలంచుచున్న నో మనమా! అయ్యో యీ వ్యర్థ ప్రయత్నమునుండి నీ కెప్పుడు విశ్రాంతి కలుగుచున్నది. భయంకరముగ గర్జించుచు మండుచున్న పిడుగు పాటువలె నదిగో మరణకాలము రానే వచ్చుచున్నది. అప్పుడు శివుని భజించు కార్యమునకైనను నీకు సమయము చిక్కకుండునుగదా!

శ్లో. ఇదానీ మత్యల్పేష్వపి హృదయ కార్యేషు సుమహాన్
కియాన్ వ్యాసంగస్తే న కలయసి చిత్త స్మర రిపుం
అహో నీతే వైవస్వత భటచరైః ప్రాణనికరే
కియా నాగంతా తే శివశివ హతోఽస్మ్యేవ భవతా॥ ౪

ఓ హృదయమా! అత్యల్పములైనను ఈ పనులయందు ఇప్పుడెంతటి వ్యాసంగము గలిగియుండి కామసంహారిని స్మరింపకుంటివి. అయ్యో యమభటులచేత ప్రాణములు కొనిపోబడుచున్నపుడు నీకు తోడ్పడి నీతో వచ్చువారెవరుకలరు ? శివశివ. ఆ సర్వేశ్వరుని స్మరింపుమని చెప్పలేక విసుగెత్తుచున్నాను.

శ్లో. అగయే చేత శ్శాస్త్రాణ్యధిక మవగాఢాన్యపి ముధా
నయద్వ్యా సజ్జేధాః పశుపతి పదాంభోజయుగళే
తదిత్థం భోక్తవ్యం ఖలు పునరసి ప్రేత్యభువనే
మహాదుఃఖం వర్ణగ్రహణ సమయోపక్రమమిదం. ౫

ఓ మిత్రమా! పశుపతి పాదారవింద స్మరణలేక నీవెన్ని శాస్త్రములు చదివినను వ్యర్థమే సుమ్మా, పలనన. ఎన్నిశాస్త్రముల నభ్యసించినను- మాటిమాటికిని జగంబున సుకృత దుష్కృత విశేషంబున ననేక జన్మలనొందుచు మహాదుఃఖము ననుభవించుచుండవలసినదియేగదా.

శ్లో॥ అమీ చేత్పుత్రాద్యాస్తే వత్సృశతర ప్రేమవిషయా
భవిష్యంతో నస్యుఃకిము జడ తదా భావిజనవే
స్వదైవస్యాయ్యేవం సముపజనిత శ్చేత్ర జగతః
దా శంభోశ్చింతా భవతి భవభీతి ప్రమథినీ॥ ౬

ఓ జడుడా! నీకీజన్మయందు కళత్ర పుత్రాదులెట్లు అత్యంత ప్రేమ పాత్రులైరో రాబోవుజన్మలయందును వారటులనే కారాయేమి. ఎల్లప్పుడును ఈవిధముగా దారాపుత్రాదు లను వలయందు జిక్కికొనిన నీకు సంసార మహా భయ వినాశకరమగు నీశ్వరచింత యెపుడైన కలుగుటకు నవకాశము కలదా ?

శ్లో. అనాపృచ్ఛన్ జ్ఞాతీ నవశరుదయోచ్ఛూన నయనాన్
గతిం కాంవా గంతేత్యతికరుణ మగ్రే విలుఠితాన్
అవశ్యం గంతవ్యం ఖలు హితానామపి పురః
తదద్యైవ స్నేహం త్యజ హృదయతేష్వర్చ గిరిశం॥ 7

ఓ హృదయమా! అయ్యో "నీకెట్టిగతి సంభవించినది" అని కన్నీరు మున్నీరుగా గార్చుచు, రొమ్ము బాదుకొనుచు, తల పగులగొట్టుకొనుచు, భూమిమీద పొర్లాడుచు, అతికరుణముగా దుఃఖించుచున్న కళత్ర పుత్రబంధు పరివారములు చూచుచుండగనే నీ వవశ్యము వెళ్ళవలసియుండును గదా! కావున ఆసమయమునన్నైన వదలిపెట్టక తప్పని స్నేహమును ఈరోజునే వదలి యా శంకరుని స్మరించి తరింపుము.

శ్లో. కియంతో నాభూవన్ హృదయ పరమప్రేమవిషయాః
పురాజన్మస్వద్య క్వ కథమితి జానాసి కిముతాన్
వృథా మోహం బంధుష్వహిత పరిణామం త్యజ సుధీః
యిథా సేవాదోషాత్ స్మరసి నకదాచిత్ స్మరరిపుం॥ 8

పూర్వజన్మములందు మిక్కిలి ప్రేమించిన విషయములెన్ని లేవు! వాని లో నొక్కవిషయమునైన ఓ హృదయమా! ఇప్పుడు "ఫలాని స్థలమున నేను పుట్టితిని ఫలానావారు నా బంధువు"లని నీవు చెప్పగలవా? ఆ బంధువు లందు లేనిపోని మోహము నేల పొందెదవు. పూర్వజన్మమున నభ్యస్తమగు టచే నీ జన్మమున బంధు మిత్రాదుల్లను ప్రేమించుచుంటివి. ఇది సేవాదోష సమాగతము. ఇకనైనను ఆ సదాశివుని స్మరింపుము.

శ్లో త్వయా గర్భేమాతుర్య దిహాజనితం చింతిత మభూ
త్తదాలోక్య స్వాంతశ్రయ భవ మకార్యే త్యజ రుచిం
గతోదూరం మూర్ఖః కఇహాఖలు విత్తార్జనధియా
చరేత్స్వైరం ప్రభువర మహోదానరసికః॥ 9

ఓ స్వాంతమా! తల్లిగర్భమున నున్నపుడు నీవెట్టి చింతను పొందితివో దానినైనను తలంచి శంకరుని స్మరింపుము. ధనమెంత కావలయుననినను అంతయు నొసంగు ప్రభువుండగా విత్తసంపాదనకై ఏ మూర్ఖుడైనను దూర దేశమునకు జనుట కిచ్ఛగించునా.

శ్లో. ఇయంతం కాలం తే నియతసహవాసేన జనితా
కిమీషన్మాస్స్వాంతః కరణమయి సౌహార్దకణికా
యథేచ్ఛం భ్రాతస్త్వం విచర విషయారణ్యకుహరే
స్మర శ్రీపాదాబ్జం సకృదపి పురారే రనుదినం! 10

ఓ యంతఃకరణమా! ఇంతకాలమునుండి నీతో సహవాసము చేసినను నాయందు కొంచమైనను సౌహార్ద ముదయించలేదా? ఓ సోదరా! విషయా రణ్యా కుహరమునందు నీవు యథేచ్ఛగాసంచరింపుము. కాని నేను చెప్పు మాట యొకటి వినుము. ప్రతిదిన మొక్కసారియైనా పురహరుని పాదాబ్జ ముల స్మరింపుము.

శ్లో. అపథ్యాహారాదే రపి తవ కియన్మానస భయం
ముహూర్తావస్థాయి జ్వరజఠర భారాదికరణాత్
అముష్మాదశ్రాంత ప్రవితత భవవ్యాధిజననాత్
మహేశో వైముఖ్యాత్క్రిమితి నభయం కించిదపి తే॥ 11

ఓ మనసా! క్షణకాలముండెడి జ్వరము కడుపుబ్బరము మొదలగు వ్యాధులు గలిగినప్పుడు అపథ్యాహారాదులవలన నీకెంతటి భయము కలుగు చున్నదో అంతులో ఆవగింజంత మాత్రమైనను ఎడతెగని భవవ్యాధియందు మహేశ్వరుని నామస్మరణలేనిచో సంభవించునని తోచుటలేదా?

శ్లో. స్థితోస్మి త్వద్వ్యశ్యశ్చిరమపి తదైవం తవకృతే
మదర్థాసు స్థాణో ర్హృదయ పరిచర్యాసు విముఖః
ఇదానీం నిర్విణ్ణోస్మ్యహ ముపగతస్త్వైర్య్య సమయో
యదాత్మన్యప్యాస్థాంజహాతి సుకృదర్థే కృతధియః. 12

ఓ హృదయమా! ఇంతకాలమునుండి నీ కొరకు ఆ పరమేశ్వర పరి చర్యా విముఖుడనై నీకు దోసిలొగ్గియుంటిని. నీకోసమయ్యమాసన్నమైణ ఇపుడేమిచేయుటకు నిర్విణ్ణుడనైపోయితిని.బుద్ధిమంతులు మిత్రునికొరకైపానది. ములయందును తీపి నుంచుకొనరుగదా!

శ్లో. ఉపాయం తే చేతః పరముపశామి స్మరరిపోః
పదాంభోజ ద్వంద్వే పరవశతయా తిష్ఠసుచిరం
అవశ్యం గంతవ్యాం స్మర ముహురతర్కోక్ష్యాప గమనాం
దశా మంత్యా మంతర్ధవధు గవయోగస్థిరతశాం 13

ఓ చిత్తమా! నీ కొక మంచి యుపాయము జెప్పెదను. నీవెప్పుడును స్మరహారుని పాదారవింద స్మరణచే పరవశుడవై యుండుము. ఏ ముహూర్త మున పిడుగుపడినటుల తలవని తలంపుగా నా యంత్యదశవచ్చునో అపుడవ శ్యము విలంబముచేయక నీవు చనవలయునని నిశ్చయించుకొనుము.

శ్లో. అనర్థేష్వర్థే ష్వధికచపలా నశుష్పృథుకా
నతృప్తా నత్యర్థం నహి సమనువర్తస్వ సతతం
అశక్యం తే శంభోర్జన మనురుద్వైవ మశుచిం
ఉపేక్షై వోపాయ స్త్వ హృదయ తేపాముపశమే ॥ 14

ఓ మనమా! అనర్థములగు కార్యములయందు మిక్కిలి చంచలములైన వియు, తృప్తిలేనివియునగు నింద్రియములనెడి బాలకుల వెంబడిపోకుము. వాని ననుసరించి పోయినచో నీశ్వరభజనము నీకెప్పటికి నశక్యమే. ఇంద్రియ ములు స్వాధీనములైన తర్వాతనే యీశ్వరుని సేవ జేయుదునని తలంచకుము. అవి మరణసమయమునగాని చలించక శాంతింపనేరవు. ఇంద్రియశాంతి కలిగి నచో నీవును ఉపేక్షించుటయేగాని యేమియు చేయజాలవుసుమా.

శ్లో. చిరాత్కశ్చి ద్వ్యాధశ్శివ ఇతివసత్యద్రిశిఖరే
సమే మాయాభూత్వా మతిపలహారదృశాం సుఖనిధిం
సలగ్నశ్చేద్దైవాత్ క్వచనపథి పాశైస్స్మృతి మయైః
సఖే తం బధ్నీయా హృదయ నిభృతం దాస్యతి పునః 15

ఓ హృదయమా! అద్రిశిఖరమునందు చిరకాలమునుండి శివుడను వ్యాధుడొకడు వసించుచున్నాడు. అతడు నెమ్మదిగా మాయజేసి సుఖనిధి యగు నాబుద్ధి నపహరించినాడు. నీమార్గములో దైవవశమున నాతడు చిక్కి నచో స్మృతిపాశములతో నాతని బంధింపుము. అపుడుగాని నీ మనోరథము నొసంగడు.

శ్లో. బహిస్త్వం వైయగ్ర్యం ప్రకటయ పరం లౌకికకృతి
ష్వవర్జ్యాం స్థైర్యం త్వం భజ పశుపతేః పాదకమలే.
విశేషు స్నిహ్యంతి మిహ బహిరసారై రభినరైః
ధవే బద్ధాసంగాం గణయ ధిషణాం వారవనితాం ॥ 16

బుద్ధిచెప్పినమాటలకు తెలివి తెచ్చుకొని వినయముతో భక్తితోను యిట్టుల చెప్పుచున్నది— ఓ సుబుద్ధీ! నామాట విని నీవిచట నేయుండి తరింప వేడెద. లౌకిక కార్యములందు బాహ్యముగా రాగమున్నట్టుల నటింపుము. అంతరముగా నా పశుపతియందు భక్తిని పొందుము. వేశ్యకు విటులయందు కపటాను రాగము జూపుచు ధనమునందు సత్యానురాగముగల వేశ్యను గణించి శివుని యనుగ్రహమును పొందుము. నేనును నీమార్గమునే యనుసరింతును.

శ్లో. మహాదేవధ్యానాన్నమ శరణమన్యం సకలయే
భవగ్రాహ గ్రాహోత్కలిత భయవేగావన పటో॰
ప్రసీద ప్రావీణ్యాం త్వమపి పరిగృహ్యాద్య భవతో
భయాత్త్రా యస్త్వైవం భగవతి నమస్తేస్తు ధిషణే. ॥ 17

ఓ బుద్ధీ! నేనికమీద మహాదేవునికంటె నన్యమునే సేవింతును. నాకు శరణము వేరెవరును లేరు. ఆ మహాత్ముని ధ్యానముకన్న మరియొకటి యీ సంసారమను మొసలిచే పట్టుకొనబడిన నన్ను దానినుండి తప్పించలేదని నిశ్చయించుకొంటిని కావున మహాదేవునే నిరంతరము స్మరించుకొందును. నీవును అనుగ్రహించి మహాభయమునుండి నన్ను తప్పింపుము. రక్షింపుము. నేనీ మాట వినియెదను. ఓ మిత్రమా. నీకిదే నా నమస్కారము.

# శివోత్కృష్టత

విద్వాన్ శ్రీ ముదిగొండ వీరేశలింగశాస్త్రిగారు

విద్యలలో వేదముత్కృష్టమయినది. "ఋగ్యజుస్సామ వేదానాం శతరుద్రీయముత్తమం" అని వేదత్రయమునందు శతరుద్రీయ సహితమైన యజుర్వేదము నాయకమణివోలె భాసిల్లుచున్నది. ఇందు నాలుగవ యష్టమున నష్టమానువాకంబున "నమశ్శివాయచ శివతరాయచ" యను సప్తకోటి మహామంత్రరాజంబగు పంచాక్షరీమంత్రము ప్రకాశించుచున్నది. కావుననే యప్పయదీక్షితులవంటి శైవ భక్తశిఖామణి"—

"ఆంధ్రత్వ మాంధ్రభాషాచ ప్రాభాకర పరిశ్రమః
తత్రాపిచ యజుశ్శాఖా నాల్పస్య తపసః ఫలం"

అని చింతించెను; ఆ మహనీయు డాంధ్రభాషయందొక నూతన మార్గమును కనుగొనెను. పదియన "ఓసి"యను శబ్ద మాంధ్రసారస్వతమున స్త్రీ సంబోధనము. భర్త భార్యను "ఓసి యోసి"యని పిలుచుట యాంధ్రదేశమున నలవాటుగ నుండెడిది. ఎన్నడును శివనామస్మరణము జేయని మూఢుడును భార్యను పలుమారట్లు పిలుచుటచే వాల్మీకికి బోలె ముక్తి కరతలామల మగుచున్నది. త్రిలింగ మధ్యమగుటచేత నాంధ్రదేశమునకును, ఓసియని పిలుచుట చేత నాంధ్రభాషకును, పంచాక్షరీమంత్ర విరాజమాన మగుటచేత యజుశ్శాఖకును ప్రాశస్త్యము కలిగినటుల ఘనముగ స్తుతించెను.

దక్షిణామూర్తి సంహితయందు 32వ పటలమున—
సర్వాసామపి విద్యానాముత్కృష్టా శృతి రుచ్యతే
చతుర్ణామపి వేదానాం యజుర్వేదో విశిష్యతే
యజుర్వేదే చతుష్కాండ శ్రీ రుద్ర స్తత్ర ప్రోచ్యతే
నమస్సోమాయ చేత్యత్ర పరాపంచాక్షరీమతా
తన్మధ్యే జీవరత్నంస్యాత్ శివ ఇత్యక్షర ద్వయం.

అని శివనామ మహిమకు పరాకాష్ఠ చెప్పబడినది. ఉపనిషత్తులయందు గూడ ననేక స్థలములయందు శివతత్త్వము విస్తరింపబడినది. వానిలో కైవల్యోపనిషత్తు సంపూర్ణముగా శివమాహాత్మ్యమును వర్ణించుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్తు సర్వశ్రుతుల సమన్వయము చేయుచున్నది. బ్రహ్మహత్యా పాతక నివృత్యర్థమై శ్రీరామచంద్రుడు లంకయందు శివలింగమును ప్రతిష్ఠించి పాపవిముక్తు

లైనటుల సంస్కృత గ్రంథములలో చెప్పబడియున్నది. శైవ భక్తాగ్రేసరుడగు హారదత్తాచార్యుడు హరిహర తారతమ్య విషయమై చర్చరాగా చందన కాష్ఠములచే చితిజేర్చి అగ్నిని రగుల్కొల్పి దానిమీద కూర్చుండి యీ క్రింది విధముగా వర్ణింప మొదలిడెను.

"ఏకః పపౌ భువన భీకర కాలకూట మన్యః పపౌ స్తనవిషం ఖలు పూత నాయాః కోవానయో రధిక ఇత్యనుచింత్య వృద్ధాస్సత్యంబ్రువంతు తమిమం వయమాశ్రయామః"

ఒకడు సకల భయంకరమగు విషమును త్రావినాడు మరియొకడు పూతనయను స్త్రీయొక్క స్తనవిషమును త్రావినాడు. వీరిరువురిలో నెవ్వ రధికులో చెప్పండి 'ఓ వృద్ధులారా! మీరు నేను నాతనినే యాశ్రయించుదు' మని నాలు ప్రశ్నల నిచ్చెనుకాని యెవ్వరును హరి యధికుడుగా చెప్పరైరి. శివ ప్రభావమువలన యగ్ని చల్లబడిపోయెను. అందరు శివమహిమను కొని యాడ గృహముల కేగిరి. మరియు పూర్వ మీమాంసా సూత్రకర్తలగు జైమిన్యాచార్యులు కర్మమే జగత్తునకు కారణమనియు కర్మముచేతనే సృష్టి స్థితిలయములు జరుగుచున్నవనియు కర్మమే బ్రహ్మస్వరూపమనియు చెప్పి నందువలన నాతని రెండుకన్నులు పోయెనట. తత్కారణమును తెలిసికొని యనన్య సాధారణమగు భక్తితో పరమేశ్వరుని గురించి నాలుగవ పాదము శృతియుక్తముగ "వేదపాదస్తవ" మను నొక స్తోత్రము రచించెను. ముచ్చూన్నను.

"ఈశ్వరం తమహంవందే యస్యలింగ మహర్నిశం
యజంతే సహాభార్యాభి రింద్ర జ్యేష్టా మరుద్గణాః."

ఈ విధముగా చరాచర సృష్టి స్థితిలయకారుడగు పరమేశ్వరు స్తుతింపగా నంధత్వము పోయెను— యజ్ఞ మాచరించుచు దక్షుడు కర్మకాండ విషయమై కర్మాధిపతియగు శివునాహ్వానింపక పోయినందువల్లనేకదా యెంతమంది దేవత లున్నను మానభంగము నొందుటయేగాక మేష శిరస్సునుకూడ ధరింపవలసి వచ్చినది. సనత్కుమారుడు జ్ఞానాధిక్యమున సోహంభావనబుద్ధి కలవాడై దారుకా వనమున శివుని నిందించి నేనే బ్రహ్మనని మునీంద్రులకు బోధించుచు శివుడగుపడినను నమస్కరించనందువలననేకదా జ్ఞానహీనుడై యొంటి తలకాయను ధరించవలసి వచ్చినది. భక్త శిఖామణియగు వ్యాసమహర్షి మునులకు భక్తిని బోధించుచు, ఒకతడవ శివుడు దైవమనియు, మరియొక తడవ విష్ణువనియు బోధింప తాపసోత్తములు "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" యను శృతి చొప్పున దేవుడు శివుడా, విష్ణువా యని యడుగ వ్యాసుడు

కర్ణికయందు స్నానమాచరించి యూర్ధ్వబాహుడై విశ్వేశ్వర సన్నిధానమున "నదైవం కేశవాత్పరం" అని నుడువుటవలన నాతని వాగ్భుజా స్తంభన మాయెను. పాండురంగ విఠలేశ్వరుడు తన శిరమున లింగమును ధరించినటుల అప్పయ దీక్షితులు బ్రహ్మతర్క వివరణమున నిట్లు వర్ణించియున్నాడు.

శ్లో॥ గోపాలక శ్శిరసి లింగము ఆహాభక్త్యాలింగస్యధారణ మహో కము సంశయ స్థం
భో పాండురంగ మమ్మృతస్య మనః ప్రభావాత్పశ్యంతు తే విమత నిర్మలి భావబోధాః॥ అని.

మరియు అద్వైతమత స్థాపకాదిబిరుదాంకితులును, నిరంతర చంద్రశేఖర పూజాపర తంత్రులును మహాయోగీంద్రులు శ్రీ యాదిశంకరాచార్యులవారు నిజముగా నభిమానించునది శివపరాత్పరత్వమా, లేక విష్ణు పరాత్పరత్వమా, లేక మరేదయిన నన్యమా యని సంశయగ్రస్తులైన కొందరు శ్రీవారికి యుమ్మెత్తకాయలను తినిపించిరట. ఉన్మత్తుడు, జ్వరపీడితుడు, వాతరోగి మొదలగువారియొద్ద రహస్యములు దాగవని లోకప్రతీతి. కాబట్టియే యిట్టి కుతంత్రమును బన్నిరి. అంతనా శంకరుల మధుర కంఠమునుండి యిట్లు సుస్వరము బయలు వెడలెనట,

శ్లో॥ సహస్రం వర్తంతాం జగతి విబుధాః క్షుద్రఫలదాః
నమన్యే స్వప్నే వా తదనుసరణం తత్కృత ఫలం
హరిబ్రహ్మాదీనామపి నికటభాజా మసులభం
చిరం యాచే శంభోశివ తవ పదాంభోజభజనం॥

అని శివానందలహరిని గానము జేసిరట. ఈ యాఖ్యాయిక దాక్షిణాత్యులలో మిక్కిలి ప్రచారములోనున్నది. పై విషయములతో శివుడధికుడని తేలుట లేదా!

## శైవమతమని పేరెట్లువచ్చెను?

"శివేన సహాబంధం శైవ మిత్యుదితం బుధైః" అనగా శివునితో సంబంధముగల మతము కావున శైవమతమును నామధేయమని కొందరు వచించిరి. శివభక్తులకే శైవులని నామమనియు స్మార్త మతముగావున శైవమనియు ఇట్టి కొందరు చెప్పుచున్నారు. ప్రధాన శ్రుతిప్రమాణస్మృతిమగుటచే స్మార్త మతమనియు, పంచరాత్రాగమములు ప్రమాణములగుటచే పాంచరాత్రులనియు,

పఘునసవృత్తి ప్రమాణమగుటచే వైఖానసులనియు నామములనియు జగత్ప్ర సిద్ధము లైనట్లు శివాగమములు ప్రధాన ప్రమాణములగుటచే శైవమతమని పేరు లావచ్చును.

## ప్రకృత స్థితి

పరోపదిష్ట వేలాయాం జనాస్సర్వేపి పండితాః,
క్రియానుష్ఠాన వేలాయాం మునయోపిన పండితాః.

అనగా పరుల కుపదేశించుట కందరు పెద్దమనుష్యులేకాని యాచరణము మాత్రము మునులకును సాధ్యముకాదు. అట్టి దుష్కర క్రియాచరణము శైవమునందే కలదు. మన పూర్వులు శివపూజాపరాయణత్వమువలననో, మంత్ర శాస్త్ర పారంగతత్వము వలననో, మహిమ ప్రదర్శనము వలననో, మా శాస్త్ర పారంగతత్వము వలననో తమ జగత్ప్రఖ్యాతను స్థాపించిరి. అకులలములు దిని వనవాసము జేయు మౌనులకంటెను తమ స్వగృహములయందుండియే జపా నుష్ఠాన తత్పరులయి యైహిక భోగముల తృణమువలె తిరస్కరించి యాము ష్మిక భోగముల చూరగొనిరి. శైవులకు యోగముగాని, భోగములేదు. అందు వలననే "ఆరాధ్య" బిరుదము జగత్ప్రసిద్ధమైనది. విద్వచ్ఛిఖామణి యగు ఇవ టూరి నందికేశ్వరశాస్త్రి విరచిత "లింగధారణ చంద్రిక" నితరులు తమ శివదత్త కుమారునిచే తమకనుకూలముగ వ్యాఖ్యానము చేయించి నాగర లిపిలో ముద్రించుకొనిరి; ఉత్తర దక్షిణ దేశములందలి శైవపీఠము లన్నా క్రాంతములైనవి నాగరికలిపియందు ప్రకటించిన లింగపురాణములో లింగ ధారణ విషయశ్లోకములు తీసివేయబడినవి.

## ప్రస్తుత కర్తవ్యము

మనము పూర్వులకుబోలె మహిమాతిశయములు చూప జాలము. ప్రపంచమంతయు వ్యాప్తమైనదగుటచేతనే శైవమతము తన గ్రంథములను చాలావరకు కోల్పోయినను, ఎందరెన్నివిధముల సంస్కరించుచున్నను, ఇంకను అచ్చటచ్చట మతబీజములు కాన్పించుచునే యున్నవి. రామాయణ మున రాముడు లింగప్రతిష్ఠ జేసిన విషయమును తీసివేసినను పరాశర పురా ణమున బదునెనిమిదవ యధ్యాయమున పరిస్ఫుటముగ గానుపించుచునే యున్నది. అటులనే యితర గ్రంథములన్ని గాలించి ప్రాచీన గ్రంథముల నన్వేషించి మతవిషయములన్నియు నొక్కొక్క గ్రంథముగా గూర్చవలసి యున్నది. ఈ భారము పండితులమీదను, ధనవంతులమీదను నిలచియున్నది

గ్రంథము లనవసరములని కొందరు వచించుచున్నారు: ఇటులనే కొంత కాలము గతించినచో మత సాంప్రదాయములు స్వరూపనాశనము కానున్నవి. ప్రతి మానవుని కాత్మ స్వాతంత్ర్యము కావలయును. అన్యజాతిపైగాని యన్యుల మతగ్రంథములపైగాని యాధారపడి యుండుట మానధనమునకు మర్యాదకాదు. ఆత్మ స్వాతంత్ర్య విహీనుడగు పురుషుడే కార్యమును నిర్వర్తింపజాలడు. ఆత్మస్వాతంత్ర్యము ఆత్మవికాసమునకు కారణము. ఆత్మ వికాసము లేనిది ముక్తి దుర్లభము శైవమతమున ఆత్మవికాసమునకయి లింగధారణ మేర్పడినది. దానియందు మనకెప్పుడు నిరుత్సాహ మేర్పడినచో అప్పటినుండియు ప్రాపంచిక వస్తుసంబంధయు మనలను పీడించుచున్నది శైవమతమునకు తిరిగి పూర్వపుదినము లేనాటికైయినా సంప్రాప్తములగునా? కృషితో నాస్తి దుర్భిక్షమ్మను న్యాయము ననుసరించిన గమ్యస్థానమును చేరగలుగుదుము. పండితులు విద్యాధనమును వెదజల్లవలయును. ధనవంతులు తమ యౌదార్యము నిట్టి సత్కార్యములకయి వినియోగించవలయును. మతాభిమానులు శ్రమ ననుభవించవలయును ఇట్లనుసరించిననాడు సాటివారలలో మతస్థులకు తగు గౌరవము రానేరదు. శంకరాచార్యుడు ముండనమిశ్రితో నహోరాత్రములు వివదించిన దెందులకు? మతముకొరకే గదా? రామానుజ మధ్వాచార్యులు కాయకష్టములకేగాక పలువిధములగు కడగండ్లబడిన దెందులకు? మతముకొరకే గదా? వివేకానంద రామమోహనరాయలు విదేశయాత్ర చేసినదెందుకు? మతముకొరకే గదా? సంసార సౌఖ్యమును తుచ్ఛముగ దలచి పచ్చివళ్లారని తన ముద్దుకుమారుని విడిచి, పతివ్రతలలామయగు తన యర్ధాంగి నిద్దురలేచిన కార్యభంగమగు నేమోయని భీతిల్లి, ఆ భయంకరమగు చిమ్మచీకటిలో ప్రేమసూత్రము దెంపివేసికొని శ్రీ గౌతమబుద్ధుడు ఇల్లు వెడలిన దెందులకు? తన మతవ్యాప్తికొరకే గదా? కావున నో శైవ భక్తాగ్రేసరులారా! ప్రస్తుతము పాశ్చాత్య విద్యావ్యామోహమున జిక్కికొని కొందరు విశిష్ట సాంప్రదాయసిద్ధమయిన భారతీయ సిద్ధాంతముల యందలి రమ్యతను తెలిసికొనజాలకున్నారు. అట్టి ప్రాగ్వపు గౌరవమును సప్రమాణముగా వివరించి మన నైజమును కాపాడుకొనుట విధియైయున్నది.

# శ్రీ దక్షిణామూర్తి స్తవానువాదము

సంస్కృతము ; శ్రీ ఆదిశంకరాచార్యులు.

ఆంధ్రానువాదము ; శ్రీ శతావధాని, జ్యోతిర్విద్యా విశారద

శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి అయ్యవారు

1. ఆరయ వటవృక్షమూలంబునందు చిత్రమొక్క యువకుండు గురువు
శిష్యులును జ్ఞానవృద్ధులాతండు మౌనమున్బోధించె। ఛిన్నసంశయులైరి
యాశిష్యులెల్ల॥

2. మఱ్ఱిదరి భూమిగూర్చుండి మౌనియొకడు శిష్యమునులకు జ్ఞానంబు జెప్పు
చుండె అట్టిజని మృత్యుభయము బోకార్చునట్టి దక్షిణామూర్తి త్రిభువ
నాధ్యక్షుగొల్తు.

3. మౌనుల్ వృద్ధులు బ్రహ్మనిష్ఠులును సమ్యాసింపగా శిష్యులై
మౌనంబున్ బ్రకటించి చెప్పుచును బ్రహ్మజ్ఞానమున్ బ్రోడగా
ఆనందాకృతిసిద్ధ గురుప్రవరునిన్ హస్తాబ్జ చిన్ముద్రికన్
స్వానందాత్మవిరామునిన్ గొలుతునిచ్చల్ దక్షిణామూర్తినిన్.

4. చిరునవ్వొప్పెడి ముగ్ధ సుందరముఖున్ జేతోజకోటి ప్రభా
స్ఫురితాకారుని నెట్టనో జడలలో బొల్పారు గొంగల్వపూ
దొర భాసిల్లెడువాని మౌనులకు సంతోషంబు గల్పించుచు చి
చ్ఛిరులన్ గుల్కెడువాని గొల్తు మదిలో శ్రీ దక్షిణామూర్తినిన్.

5. తనయందున్గల విశ్వమున్ పురము నద్దంబందటుల్ మాయచే
తనయందున్ గనుచుండియున్ కలను విడ్డ్రిన్ బైట నున్నట్లుగా
గని ప్రత్యక్షముగాగ తన్నొకని జాగ్రత్తందు వీక్షించు నే
ఘనుడా శ్రీ గురుమూర్తినిన్ గొలుతు వేడ్కన్ దక్షిణామూర్తినిన్.

6. మొలకల్ విత్తులబోలె సర్వజగమున్ మున్నిర్వికల్పంబుగా
నలరున్వెండియు దేశకాలముల మాయన్ జిత్రచిత్రంబుగా
తెలుగున్ మాయిగ యోగిగా నెవడిలన్ స్వేచ్ఛన్ విజృంభించు య
జ్వలతేజున్ గురుమూర్తి గొల్తు మదినిచ్చల్ దక్షిణామూర్తినిన్.

7. పలురంధ్రంబులు గల్గు కుండనడుమన్ భాసిల్లు దీపంబటుల్
వెలుగున్ నేత్రముఖేంద్రియంబుల వెలిఁ జిత్రంబుగా జ్ఞానముఁ
దెలియఁ దాతనదీప్తిసర్వమును దీప్తిఁబొందుచున్నట్టులు
జ్వలుడౌ నా గురుమూర్తి గొల్తు మదినిచ్చల్ దక్షిణామూర్తినిన్

8. ఏని ప్రస్ఫురణంబు సత్తయి యసద్వృత్తిఁ బ్రకాశించు లే
దానఁ దత్త్వమసీతి యాశ్రితుల బోధన్ సల్పు నెవ్వాండెవం
డేనిన్ గాంచిన జన్మవార్ధిమఱి జన్మింపండో యెవ్వండు నా
జ్ఞానజ్ఞేయుని మద్గురున్ గొలుతునిచ్చల్ దక్షిణామూర్తినిన్.

9. ఆదియు మధ్యమంతమును హస్తము పాదము గోత్రసూత్ర నా
మాదులు జాతివర్ణమును నాశుదనంబు నపుంస్త్వపుంస్త్వముల్
బ్రోదిన రూపరూపతయు బుట్టువు చావును పుణ్యపాపముల్
గాదను తత్త్వమేకమును గానిది లేదనియేనియెంతురా
సాదర నైజ తత్సమరస ప్రతిమూర్తిని గొల్తు మద్గురున్.

10. తను బాల్యాదులు జాగ్రదాదులు సమస్తావస్థలున్ గల్గుచో
చనె సర్వంబును బొందుచున్నటుల జింతన్ జెందుజీవున్ కృపన్
దనువౌ నాకును నీవు నా తెలుపు భద్రంబైన జిన్ముద్రనే
ఘనుడా మద్గురుమూర్తి గొల్తుమది వేడ్కన్ దక్షిణామూర్తినిన్.

11. తనువున్ బ్రాణము నింద్రియంబులు చలత్వంబందు జిత్తంబుతే
వనుచుఁ స్త్రీజడవృద్ధభావత నహంభావంబునఁ జెందు నీ
ఘనమాయావృత మోహమజ్ఞుల కడంగఁ జేయు నెవ్వండు చి
ద్ఘను నా శ్రీ గురుమూర్తినిన్ గొలుతు వేడ్కఁ దక్షిణామూర్తినిన్.

12. నరులాత్మీయసుషుప్తి రాహువశులౌ నర్కేందులట్టుల్ దనూ
కరణంబుల్ జడతన్వహింపబడి వీకఁ మాయసన్మాత్రులై
అరయన్ జాగ్రతనున్ బ్రబోధమున స్వప్నంబట్లు లెవ్వండు త
త్పరతన్ మద్గురుమూర్తినిన్ గొలుతు వేడ్కన్ దక్షిణామూర్తినిఁ.

13. గను మాయావృతి నెవ్వడీజగము జాగ్రత్ స్వప్నముల్ కార్య కా
రణముల్ తండ్రికుమారులున్ గురువు ఛాత్రశ్రేణి స్వస్వాముల
ట్లనయంబున్ గల బంధమట్టుల స్వభేదానన్య భావంబుచే
ఘనుడౌ మద్గురుమూర్తి గొల్తు మది వేడ్కన్ దక్షిణామూర్తినిన్.

14. ధరయున్గాలియు నీరు నంబరము చంద్రార్కాగ్ని హోత్రంబులున్
పురుషుం డేని చరాచరాత్మకతచే బొల్పారు మూర్త్యష్టకం
బరయం డెందు వివేకి యాప్రభున కన్యంబించు నెద్దానినిన్
పరుడౌ శ్రీ గురుమూర్తి ముదమొప్పన్ దక్షిణామూర్తినిన్

15. ఏయీ స్తోత్రమునందు స్పష్టపడెనో యీశాను సర్వాత్మతా
ధ్యేయిత్వంబులు దాన వాని విన దద్దివ్యార్థమె చంగ ద
ధ్యాయిత్వంబున కీర్తనల్గు సర్వాత్మేశ్వరత్వంబుపై
డాయున్ వెండియు నీశ్వరత్వము సదాష్టాంగ స్ఫురన్మూర్తియై.

16. మౌనిస్తుత్యము గా జిదబ్ధి విహరింపన్ జాలియున్ నిర్మల
జ్ఞానోద్యత్సుఖ రూపుడై జగతి బ్రజ్ఞానంబిడన్ గారణం
బై నానావిధ భక్త కోటికి నిజ బ్రహ్మాత్వ సంసిద్ధితో
నానందాకృతియైన సద్గురువరున్ హర్షంబుతో గొల్చెదన్.

17. చాలు వికల్ప భేదములు సత్యము నే నొకరుండ నయ్యు ని
త్యాలయమౌదు నేన సచ చరాచరమైన జగత్తు కెల్లనే
లీల రహస్య మెల్ల నవలీలగ నాకును జూపె నెవ్వరా
బాల శశాంక మౌళి సమభావుని సద్గురు గొల్తు కేవలున్.

### శివయోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రి గారి కృతమునకు అనువాదము

1. జ్ఞానేచ్ఛాకృతిరూపమై సహజమై శశ్వజ్జగద్రూపమై
ధీనం బౌ చిద చిద్విశిష్టమయ శక్తిం గూడి జన్మాది పం
చానన్యార్హ విలాస కృత్యముల సల్ప్రాంత మెవ్వండు త
ద్యానార్హాకృతి సద్గురున్ గొలుతు నాత్మన్ దక్షిణామూర్తినిన్.

2. పరుడౌ నెవ్వడు తత్ప్రకారుడఖిలావస్థా జగద్రూపుడై
గర మొప్పారు జగత్స్వరూపమున సూక్ష్మస్థూల దేహంబుచే
అరయన్ జెప్పెడు నిట్లు కారణము కార్యంబంచు వేదంబు త
త్పరతన్ శ్రీ గురుమూర్తినిన్ దలతు నాత్మన్దక్షిణామూర్తినిన్.

3. కైవల్యం బని తద్విశిష్టతమ వక్కాణింతు రెందున్ పృథ
గ్భావంబున్ తుది ద్విశిష్ట శివునిన్ భాషింత్రు ముఖ్యంబుగా

జీవైక్యస్థితి తద్విశిష్ట శివునిఁ జెప్పుఁ శ్రుతుల్ భేదతఁ
సేవింతుఁ గురుమూర్తి నట్టి మమితుఁ శ్రీదక్షిణామూర్తినిఁ.

4. చిదచిచ్ఛక్తులకీశుఁడౌ నెవనికిఁ జెప్పుఁ శ్రుతుల్ పెక్కులౌ
చిద చిత్త్వేరకు డౌట భోగ్య వశతఁ చిచ్ఛక్తి కర్తృత్వతఁ
విది శాస్త్రీయ విలక్షణ ప్రకృతి వద్భేదం బవార్యంబు గాం
చెద నాత్మఁ గురుమూర్తినిఁ గొలిచెదఁ శ్రీదక్షిణామూర్తినిఁ.

5. చిద చిద్వస్తువు లందు జేరి సతముఁ శిక్షించు నెవ్వాఁడు త
చ్చిదచిత్తుల్ నియమించు నాతడనుచున్ జెప్పెన్ శ్రుతుల్ మెల్లగా
చిద చిద్యుగ్మ విభాగ భాసిత జగత్ శ్రీ విగ్రహుండైన స
త్పదునిన్ శ్రీ గురుమూర్తినిన్ దలతు నాత్మన్ దక్షిణామూర్తినిన్.

6. శుభసార్వజ్ఞ గుణాదికంబులు వచించున్ యద్గుణిత్వంబు త
ద్విభుత్వష్టాదులులేమి యేనగుణలగావించున్ పదద్వంద్వము
య్యుభయత్వంబును కల్మిచెప్ప శ్రుతిలతో వ్యాసాహముం జెందుత
చ్ఛుభమూర్తిన్ గురుమూర్తి వార్తి హరుఁగొల్తున్ దక్షిణామూర్తినిన్

7. శివతాదాత్మ్య శివత్వ సిద్ధినుపదేశించుస్గురుండౌ ప్రతన్
శివునేభక్తుఁడనన బుద్ధిఁగొలువం జెందున్ శవోహస్మృతిన్
అవు జీవేశులకంచుపాసనమున్ దద్వైతమొవ్వన్ శ్రుతుల్
భవుఁడౌనాగురుమూర్తిఁగొల్తు భ్రమఁబాపన్ దక్షిణామూర్తిన్.

8. నీలోనున్నను నాకు దేహమయినన్ నీవారయన్ లేవునఁ
నీలోనంగనిన ద్వైమృత్యు భయమున్ నిన్వీడెదుఁ శాసకుం
డీలీలన్ బ్రకటించునే సదర్థ్యుడెంతే కారుచిమ్ము ధ్రచే
నాలీలాగ్గురుమూర్తిఁ గొల్తు మధురోక్తాన్ దక్షిణామూర్తినిన్.

9. ధీవాగ్గమ్యము గానిచే తలచియింతే చెప్పఁగాలేమిచే
లావుల్ దక్క ప్రవక్తలన్యులట పల్కఁ నిర్విశేషంబుఁగా
భావింపందగు శేషశేషివిధమై బ్రహ్మండమీశుండు నా
దేవుండౌ గురుమూర్తిఁగొల్తు [illegible] దక్షిణామూర్తినిన్.

10. పలుకం [illegible] బ్రహ్మాదిమ్ము శివనీన్నావించి వేదంబునున్
తెలియంలేదో యనన్యథ కక్కత తదివ్య ప్రసాదంబునన్
[illegible]

తెలియన్నేనొకరుండనే, యనుచుఁ బృథ్వీన్బల్కు శ్రీ విష్ణువా
తలపున్నిక్కమటంచుఁగొల్తు గురుమేధా దక్షిణామూర్తినిన్.

11. పరమేష్ఠి ప్రియవాణిగాఁ దలచి చేఁబట్టెన్సదా మౌనమున్
హరియిల్లాలని లక్ష్మినిన్విడచి భిక్షాన్నంబపేక్షించె ద
ర్మరతిన్ సేవకకామినీరతి యధర్మంబంచు సర్వజ్ఞతా
భరణిం శ్రీగురుమూర్తిఁగొల్తు బుధులొప్పన్ దక్షిణామూర్తినిన్.

12. అనభిజ్ఞార్థమతా విలాత్ములగు వారాలోచనా శక్యమే
ఘనమైశ్వర్యమునూహ జేసి తెలియంగా లేక నన్యాత్ములై
నను స్వజ్ఞానచక్షుస్స్వీయదర్శనములన్ దర్శింపఁ జేయువ్వఁడా
తనుధారిన్ గురుమూర్తినిన్ గొలుతునాత్మన్దక్షిణామూర్తినిన్.

13. అనవచ్ఛేదము కాలమౌకతన పూర్వాచార్య యోగీంద్ర సం
ఘ నిరూఢాకలితాత్మ కోటిగురుఁడై ఖ్యాతిందగున్ సత్యమై
గన నెవ్వానికిఁ గాలకాలుఁడన వాఖ్యార్థధర్మమొప్పున్బ్రా
తనుఁడా శ్రీగురుమూర్తినిన్ గొలుతు నాత్మన్దక్షిణామూర్తినిన్.

# సద్యః పరనిర్వృతయే-మలహాణ మహాకవి

......సిద్ధశ్రీ

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"

కీర్తిని పొందుట విత్తమును సంపాదించుట, లౌకికజ్ఞానము నలవరచుకొనుట, విపత్తులను తొలగించుకొనుట, మొదలగునవి కావ్యమువలని ప్రయోజనములని సూత్రీకరించుచు నట్టి కావ్యమువలన సద్యః పరనిర్వృతి కూడ కలుగుచుండునని కావ్యప్రకాశకారుడైన మమ్మట భట్టాచార్యుడు నిర్వచించి యుండెను. యశః, అర్థకృత్, వ్యవహార, శివేతర, పదములకు రూఢ్యర్థకములగు కీర్తి, విత్తము, లౌకికజ్ఞానము, విపత్తులని యర్థమును జెప్పికొనినట్లు సద్యః పరనిర్వృతి పదమును అటులనే సమన్వయించుచో వెంటనే ముక్తినొందుట కొరకని వ్యాఖ్యానించవలసి యుండును. ఇందు సద్యః, పర, నిర్వృతి, యని మూడు పదములు కలవు. సద్యః తక్షణమే పర ఉత్కృష్టమైన నిర్వృతయే మోక్షము కొరకు అనగా కావ్యము నాస్వాదనము జేసికొను రసికునకు సద్యః సంజనితమైన మోక్షము ప్రయోజన మగుచున్నది.

ఇచట స్వదేశ విదేశీయులైన ఆబాల వృద్ధులచేత కీర్తింపబడుచున్న కాళిదాసాది మహాయశఃకాయులును అసీమాంతసామ్రాజ్యాధిపతులనువశ్యము చేసికొని సకల సుఖోపభోగ్యులైన బాణభట్టాది మహారసికులును అతి సూక్ష్మములైన లోకతంత్రములనెల్ల చర్చించి విశిష్ట కర్తవ్యములతో వ్యవహరించిన మాఘాది మహామేధావులును, సంప్రాప్తములైన విపత్తులను తొలగించుకొనుపాయముల నన్వేషించిన భారవిప్రముఖ మహా నిపుణులును ఎన్నడో యవతార మూర్తులుగా నవతరించి నేటికిని దిగంత విశ్రాంతకీర్తిచే జీవించి యుండుట జూచుచుంటిమి. కాని కావ్యరచనాద్యనంతర సంజనిత మోక్షప్రయోజనమున్ను కలదనుట లోక విపరీతము కాదా! కావున ఉత్కృష్టకావ్యము నాస్వాదించుచున్న రసికుని మానసమునకు తాత్కాలికముగా తజ్జన్యమగు నానందమయ సుఖానుభూతియే కావ్యప్రయోజనమని సమన్వయించిరి వ్యాఖ్యాతలు. కాని యనంతభాషా ప్రపంచమున నొక శాస్త్రమునకే శాసనకర్తయైన మమ్మట భట్టాచార్యునంతవాడు కావ్యసమన్వయ నిర్వచనమందు విశేషముగా ప్రయోగించిన "పర" శబ్దమునందలి విశిష్టతను గ్రహించగూడదా? ప్రపంచమందలి విశ్వవ్యాప్తకీర్త్యాది విశిష్టులైన కాళిదాసాది మహాకవులవలె

# శైవమత ప్రకాశిక చందా వివరములు.

| | సంపాదకులు |
|---|---|
| మహారాజ పోషకులు | రూ॥ 116–00 |
| రాజ పోషకులు | 50–00 |
| ప్రధాన పోషకులు | 25–00 |
| పోషకులు | 10–00 |
| అభిమానులు | 5–00 |
| చందాదారులు | 3–00 |
| విడిపత్రిక | 0–25 |



కృష్ణాపత్రిక ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాదు - (ఆం. ప్ర.)

# శైవమత ప్రకాశిక



శ్రీ శైవ మహాపీఠము

1 - బి. పద్మారావునగరు, శికింద్రాబాదు.

పబ్లిషరు: శ్రీ పేట చిదంబరశాస్త్రి

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# శ్రీ శివపూజామంత్రార్థము

శ్రీ నిర్మల శంకరశాస్త్రి

సంపుటము ౧ – ౬వ సంచిక తరువాయి

(౮) దశావధానములలో ఎనిమిదవదగు గుణస్తుతిదగు మంత్రములు,

శ్లో॥ "య ఏకో రుద్ర ఉచ్యతే"
"అసంఖ్యాతాః సహస్రాణి శ్రూయంతే నచ దృశ్యతే
ఏవమేత న్నిబోధత ।"
"దివ్యాగణా బహురూపాః పురాణాః"

సంసారదుఃఖమును పోనాడు రుద్రశబ్దముచే నెప్పఁబడువాడు ఒకడే పరమాత్మయని వేదశాస్త్ర పురాణాది వాఙ్మయమునందు వర్ణింపఁబడుచున్నవాడు.

రుద్రగణములనఁబడు మాహేశ్వరులు వేలకొలది యసంఖ్యాకులుగా వినఁబడుచున్నవారు కాని ప్రాకృతదృష్టిగలవారికి (అనగా శాంభవదీక్షితులకు) కనఁబడువారు కారు. మరియు ననాదికాలము నుండి పరమేశ్వరుని వలె నిత్యముక్తులైయుండు గణములు నిత్య-ప్రకాశమయమగు శివపదము నందు వివిధములగు క్రొంగ్రొత్త రూపములఁ దాల్చుచు శివానందాస్వాదలోలురగువారు.

శ్లో॥ "నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే
అథో యే అస్య సత్వానోఽహం తేభ్యోఽకరం నమః"

వేయి కన్నులు గలవాడు (అనగా విరాట్స్వరూపుడు) నిత్యప్రవర్ధమానుఁడు, నగు నీలకంఠునకు నమస్కారము. మరియు నీ దేవుని యనుచరులగు మహానుభావులకును నమస్కారము.

శాంభవదీక్షితుడగువాడు శంకరునివలె శివభక్తులను ప్రేమించుచు పూజించుచుండవలెనని సారాంశము.

(౯) దశావధానములలో పదియవ లింగసముగ్నతకుసలయు మంత్రములు

శ్లో॥ "అణో రణీయా నహమేవ తద్వ-న్మహానహం విశ్వమిదం
విచిత్రం పురాతనోఽహం పురుషోఽహమీశో-హిరణ్మయోఽహం
శివరూపమస్మి"

(తరువాయి 21 వ పేజీలో)

# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు- కందుకూరి వీరబసవరాజు

| | | |
|---|---|---|
| సంపుటము ౧ | ప్లవ సంవత్సరము<br>21-12-61, 20-1-62<br>మార్గశీర్ష పూర్ణిమ, పుష్య పూర్ణిమ | సంచికలు 8, 9 |


శ్లో॥ అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్‌
శుక్రేణ జ్యోతీగ్ంషి సమనుప్రవిష్టః ప్రజాపతిశ్చరతి గర్భే అంతః.

తైత్తిరీయోపనిషత్తు.

సముద్ర జలాంతమునందలి లోకాలోక పర్వతము కంటెను, భూమధ్య మందలి మేర్వాది పర్వతముల కంటెను స్వర్గపృష్ఠమందలి బ్రహ్మలోకాదుల కంటెను మహత్తరమయిన పరమేశ్వరుడు తేజస్సుచేత సూర్య చంద్రుల దగు తేజస్సును చక్కగా ప్రవేశించిన వాడయి ప్రజాపతియై సమస్త హృదయముల యందు చరించుచున్నాడు.

## వెలుగు నీడలు

మానవుని మానవత్వమును సార్థకపరచుకొనుటకై ప్రపంచాతీత మైన దివ్యశక్తియందు ప్రమాణబుద్ధులై ఏ కొలదికాలమైనను ఏదో యొక రూపమున తదుపాసనా పద్ధతియందు మనస్సును పరిణమింప జేయుట భారతీయుని త్రోసిరాజాలని సత్యము. ఏ నాడో ప్రపంచము యొక్క అస్థిరత్వమును తెలిసికొనిన భారతీయుడు తన యనుభవము నందు వెల్లివిరిసిన సుఖానుభూతిని ప్రతిమానవునకును అనివార్యమని చాటజాలెను. అందలి సత్యమును గ్రహించినవాడగుట చేతనే తొల్లింటి మానవుడు సామాన్యుడు మొదలు మహర్షివరకును వందనీయుడగు

చున్నాడు. మొన్ననే విజయవాడయందు శ్రీ శివలెంక బసవయ్యశాస్త్రి గారి యౌన్నత్యమును గ్రహింపజాలిన యనేక వ్యక్తులు, సంస్థలునున్న వారిని విశేషవైభవముతో సన్మానించి వారి వంశానుగత నిరంతర శివసేవా పరాయణత్వమే వారి బహుముఖ ప్రజ్ఞకు ప్రధాన హేతువని ప్రశంసించుట గమనార్హము

మనస్సు చంచలమైనది. దాని నరికట్టజాలిననాడు సాధ్యమునకు తిరుగులేదు. అందుకు మతములు,మతధర్మములు, ఆశ్రమములు మున్నగు నవియెంతయో యుపకరించుచున్నవి. ఉదాహరణకు శైవమతమును పరికింతము, శివుడే పరదైవ మనియు అట్టి మతధర్మముల యందలి విశేషమును పాటించిన శైవుడు శైవునకు పరమ బంధువవగుటయేగాక శివునకంటె అభిన్నుడై యుండుననియు బోధించుచున్నది. ఇందలి పరమార్థమును సూక్ష్మముగా పరామర్శించిన యెడల మానవునితో మానవుడు పరస్పరము సహకారమును పెంపొందించుకొనుటయే కాదా? అంతియేగాక ప్రాణ్యణువునందును దివ్యశక్తి అంతర్లీనమైయున్న దన్న తత్త్వమును గ్రహింపజేయుటయే కాదా! నేడు సుఖాభాసములకు నలవడిన మానవునకు నిగూఢములైన భారతీయుని ధర్మములయందలి పరమరహస్యము బోధపడకుండును గాక. కాని వాని నిత్యజీవిత విధానమున నెలకొనిన సాంప్రదాయములు మాత్రము తమను డి వేరుపరుప జాలకుండెను. అవయవాదులయందు తనతో సమానమైనను తల్లిదండ్రుల యెడ గురుభావమున మసలుకొనుచున్నాడు. శిలతో నిర్మింపబడిన దైనను విగ్రహ విశేషములయందు దేవత్వము నారోపించుకొని పూజించుచున్నాడు. ఆనుషంగికములైన రోగాదులయందు నిస్సహాయత కలిగినప్పుడు దైవసంకల్పమునకు తిరుగులేదని నమ్ముచున్నాడు. ఈ మధ్యనే విశాఖపట్టణమునందు శివభక్తుడు కొరిసిల్లి జోగారావుగారు తన యవసానకాలమునందు తుచ్ఛమగు సంసారమునకై వాపోవక శివ పంచాక్షరీ జప పరాయణులై శివైక్యము నొందెనన్న భారతీయుని హృదయ మెంత వికాసవంతమైనదో యూహింపవచ్చును.

నిత్య సంప్రాప్తములగుచున్న విపత్తులను తొలగించుకొనుటకు శివోపాసనయే ప్రధాన సాధనమని నమ్ముచున్నవాని యాస్తిక్యము

శంకింపరానిది. గ్రహసంబాధను తొలగించుకొనుటకు రుద్రాభిషేకమును, సర్వాభివృద్ధి నొందుటకు రుద్రయాగాదులను జరుపుకొనుచున్న ప్రాచీనతత్త్వము తుడిచివేయరానిది. రానున్న అష్టగ్రహకూటమి వలని భీతికి పల్లెపల్లెయందలి యింటింటను రుద్రాభిషేక జపహోమాదులను జరుపుకొనుచుండుట జూడ భారతదేశమున ఉగ్గుపాలతో కరుడుగట్టుకపోయిన దైవప్రమాణ బుద్ధిని తొలగించుటకు ఎవ్వరికిని శక్యముకాదు ఈ సందర్భమున శ్రీ లోకారాధ్య అంబార్యు సిద్ధాంతిగారి పలు అవాంతరములు గణింపక నిరంతరాయముగా సాగించబడుచున్న మహా రుద్రాభిషేకాది కార్యక్రమ దీక్షయును, ఇటీవల శ్రీ లో॥ ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మగారు తమయింట స్వంత బాధ్యతతో బహుజన రంజకముగా చేసిన రుద్రయాగమును మేము మిక్కిలి యభినందించుచున్నాము.

ఇట్టి మహోన్నతములైన యాశయముల నందించుటకై మన దేశమున ఆదికాలమునుండియు ననేక సంస్థలు వెలసినవి. అందును విశిష్టాశయములు కలిగిన శైవమహావృక్షము ఒకనాడు ఆసీమాంతము శాఖోపశాఖలచేత విజృంభించెను. కాలప్రగతి దురూహ్యము. కేవలము ఐహికమున పరమప్రమాణులగు పాశ్చాత్యులు మనదేశమున విజృంభించిరి. వారి విశృంఖల విహారముచేత మభ్యపెట్టబడిన భారతీయుడు నైజమును గ్రహించుటకు ఎంతో కాలము పట్టలేదు. వ్రేళ్లతో పాతుకొనిపోయిన అట్టివారి కొన్ని యాశయములను త్రోసిరాజాలకున్నను భారతీయుడు నేటి ప్రపంచమునను విశ్వశాంతి నందించుటకు నాంది యగుచున్నాడు. జంటనగరముల యందలి శైవ యువకులలో పరస్పర సహకారమును పెంపొందించుకొనుటకై సాంఘికముగా తరుచు పిక్నిక్ (కలిసి ప్రయాణించుటలు) మొదలగునవి జరుపుకొనుచుండుటయు నొక ముఖ్యసాధనముగా పరిగణించుకొనుట గమనింపదగినది. అందుకు గతమాసమున 24 వ తేదీన ప్రథమ సమావేశమునకు గ్రామాంతరమందలి యొక దేవాలయము నెన్నుకొనుటయేగాక, అచ్చటి సమావేశమునకు రుద్రాభిషేక శివార్చనాదికములనే ముఖ్యకార్యక్రమములుగా సృష్టించుకొనుట శ్లాఘింపదగినది. కొందరు శైవయువకులు పరవిద్యయందలి నిస్సారమును

అవలోడన చేసినవారగుటచేత పురాతత్త్వమును తిరిగి విజృంభింపజేయుటకై ముందంజవేయుట శైవ మహాపీఠమునకు సంతోషదాయకము. ఇటులనే ఆంధ్రీకృత వేదాంతార్థ తారహార పరిష్కార గ్రంథావిష్కరణ మహోత్సవము మున్నగు తదితర కార్యక్రమములును శైవమహాశయుల శివభక్తి పరాయణత్వమును ప్రకటించుట మోదావహము లగుచున్నవి. ఇట్టి వెలుగు కిరణములు విరజిమ్ము సమయమున మరుగుపరచు చీకటి నీడలును లేకపోలేదు.

చాలారోజుల క్రితము పీఠము బహుప్రయాసతో విజయవాడ యందొక భవనమును నిర్మించుకొనెను. అది యంతగా చెప్పికొనదగిన యాస్తి కాకున్నను దాని స్థిరత్వమునకే యస్వస్థత సిద్ధించుచుండెను. హైకోర్టువారి యార్డరుతో తాత్కాలికముగా ప్రమాదము నాపికొనుట దుర్భర మయ్యెను. శైవమత విశేషములను ప్రకాశింపజేయుటకు సాధనమైన మన "శైవమత ప్రకాశిక"ను సంవత్సరాంతమున నిరంతరాయముగా కొ సాగించుట సమస్యగానుండి విషాదమును కలిగించుచున్నది. ఇంకను పూర్తి కావలసిన సమస్యలనేకములు వెనుకబడి విచారణీయములయి యున్నవి. ఈ యరిష్టములన్నిటి నధిగమించి శైవమత సంస్థలు పటిష్ఠము చేయవలసియున్నవి. అయినను మేము ఇంకనూ నిరాశను నిరసించి యాశావహులమై శైవమతాభిమానులందరిని హెచ్చరించుచున్నాము. ఉత్సాహవంతులైన యువక యువకేతర ప్రముఖులకు సాధింపరానిది లేదు. అట్టివారి తలంపు పచ్చని బంగారమై విశ్వాంతరాళమునె తీర్చిదిద్దజాలనయి యున్నది. సకల శైవుల శుద్ధసంకల్ప బీజములు శాఖోపశాఖలుగా పెరిగి మొగ్గలై పుష్పించి ఫలించుగాక యని శైవ మహాపీఠము ఆశీర్వదించుచున్నది.

# ప్రబోధము

శ్రీ ముదిగొండ రామలింగశాస్త్రి-భాషాప్రవీణ
(శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల ఉపన్యాసకులు—వరంగల్)

నేఁడు శైవమహాజనులలోఁ గొందఱి కెంతో కష్టముగఁ దలఁపఁబడుచున్న లింగధారణము పూర్వము జగద్గురుత్వమునకు సాధన భూతమును, మోక్ష సామ్రాజ్యమునకు మూలకారణంబునై విరాజిల్లినది.

కులమతములందీనాఁ డభిమానము లేకపోవుటకు కారణము రాజాదరణ లేకపోవుటయే, కులములీనాఁడు సృష్టింపఁబడినవిగావు. "బ్రాహ్మణోస్య ముఖమాసీత్-బాహూరాజన్యః కృతః— ఊరూతదస్యయద్వైశ్యః- పద్భ్యాం శూద్రో అజాయత" ఇత్యాది శ్రుతివాక్యముచే కులప్రాదుర్భావమును బోధించుచుండ వేదకాలమునాటినుండియు నీ కులములుండినవని స్పష్టముగాఁ దెలియుచున్నది.

ఇఁక మతములా? ఏ దేవతారాధనచేసిన వారా మతస్థులని పేర్కొనఁబడుచున్నారు. కాన, కులమతములు దేశానర్థకరములుగావు. ఆయా కులములకుఁ జెందిన వారా యామతానుష్ఠానపరులై, యిహ పరసాధనకర్మలయందు నిమగ్నులై యుండియున్న దేశమున కింతటి యనర్థత రాఁజాలదు. ఏకులమునకు నేవృత్తియున్నదో యద్దానిని నాచరించుచున్నప్పుడు ప్రజాసామాన్యమింత కష్టముచెంద నవసరముండెడిదిగాదు. ఈనాఁడన్ని వృత్తులయందు నందఱు ప్రవేశించుచుండ నిఁక యార్థికమాంద్యము వచ్చుననుటలో సందేహమేమి? కాన. కులమతములయందనాదరణ చూపక సత్క్రమానుష్ఠానపరులై యుండుట శ్రేయస్కరము.

లోకోద్ధరణకై యాచార్య పురుషులు జన్మించి యా యా మతముల నుద్ధరించియున్నారు. ద్వాదశారాధ్యులకుఁ జెందిన యారాధ్య శిఖామణులే యిందుకు దార్కాణము! "భక్తియందు వలపు-బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ" యని మల్లికార్జున పండితులు స్పష్టముగాఁ దెలిపి కులమతములయం దభిలాషను బ్రకటించినాఁడు పాల్కురికి సోమనారాధ్యులు కులమతావశ్యకత మల్లికార్జున పండితారాధ్య చరిత్రయందు నిరూపించి యున్నాఁడు.

శైవమతము శివుఁడే ప్రధాన దైవముగ నెంచఁబడి ప్రభవించినది. "శివ ఏకో ధ్యేయ శ్శివంకర స్సర్వమన్య త్పరిత్యజ్య" యను వేదోక్తవాక్య

మిందుకుఁ దార్కాణము. ఆసేతుహిమాచలమందు నున్నవారలీ వాక్యము ననుసరించియే యా యా ప్రదేశములయందు లింగప్రతిష్ఠలు గావించి యున్నారు. వాటివలననే యా ప్రదేశములు పుణ్యక్షేత్రములై సర్వజనాకర్ష కములై నేటికిని ప్రసిద్ధి వడసి, యున్నవి. ఆ కారణము వలన లింగపూజ నాచరింపవచ్చునా? కూడదా? యను విషయము నిస్సందేహముగఁ దేలి పోయినది. శివలింగపూజ కర్తవ్యమని వేదములయందుండుట, లోకమునందు శివపూజలు జరుపుకొనుట ప్రత్యక్ష ప్రమాణమేగదా!

గురువు శిష్యునికి వేదమంత్రములఁజెప్పి శిష్యుని నింటికి బంపునపుడు హితబోధచేయుచు "భూత్యైన ప్రమదితవ్యం" అని అష్టావరణములలోఁ బథమ మునఁ జెప్పఁబడిన విభూతినిఁగూర్చి యెప్పుడైనఁ బ్రమాదవశమున మరచుదు వేమో విభూతిని ధరించకుండా యే కర్మను జేయకుమని ప్రబోధించెను. కావుననే శివాలయములందు భస్మము నిడుదురు. ఆ భస్మమును ధరించియే శివ దర్శనము చేయవలయును. భస్మ మహిమ యనంతమైనది. సర్వులు ధరించు చుండుట పరిశ్యత నిదర్శనమేగదా! దక్షిణాదియందు స్త్రీలు సహితము ఫాలప్రదేశమందుఁ దిృపుండ్రరేఖలు ధరించి దానిపైఁ గుంకుమబొట్టు పెట్టు కొను చుందురు

శైవులు రుద్రాక్షలు ధరించుచుందురు అవి పూర్వము త్రిపుర సంహార కాలమున నీశ్వరుని కనులనుండి భూమిమీఁదఁబడిన బాష్పబిందువులు రుద్రాక్ష తరులుగ లోకహితార్థమై ప్రభవించినవి.

"న దేహో యస్య రుద్రాక్షాః నత్రిపుండ్రస్యధారణం। శ్మశానమేవ తద్దేహం। తన్ముఖం గిరిగహ్వరం" ఎవని శరీరము రుద్రాక్షలచే విరాజిల్లదో, యెవని ముఖము త్రిపుండ్రాంకితముగాదో, యాతని దేహము శ్మశాన తుల్యము, అతని ముఖము కొండ గుహయని శాస్త్రములయందు వక్కా ణించబడినది. రుద్రాక్షలు ధరించుట, వాటితో జపము చేసికొనుట పరిశ్యత నిదర్శనమేగదా!

ఈశ్వర పూజ సేయువారీశ్వర మంత్రమునే స్మరించుట యుక్తము. "ఓం నమశ్శివాయ" అను షడక్షరీ మంత్రము తారకమంత్రమని నమక మందు స్పష్టముగాఁ జెప్పఁబడియున్నది. మోక్షార్థులందఱా మంత్రమును జపించుట యావశ్యకమేగదా!

ఇఁక శివలింగధారణము విషయము సందేహమునుగల్గుటకు హేతువే లేదు. "ముఖే మంత్రం హృదిధ్యానం మస్తకే లింగధారణం। శిఖా సూత్రం

తథాభస్మ పత్ర్యాబ్రాహ్మణ లక్షణం" ముఖమునందు మంత్రము- హృదయమునందు ధ్యానము- శిరస్సునందు లింగధారణము శిఖాయజ్ఞోపవీతములు ఇవి యన్నియు బ్రాహ్మణ లక్షణములని గౌతమస్మృతియందుఁ జెప్పఁబడి యున్నది. బ్రాహ్మణులందఱు లింగధారులగుట యావశ్యకము. "బ్రాహ్మణస్య సమాఖ్యాతం లింగధారణ ముత్తమం" అను శ్లోకమిందుకుఁ దార్కాణము. "ఉపనయనకాలే ధారణం కుర్యాత్" అని లింగోపనిషత్ లింగధారణము నుపనయనకాలమందే చేయవలయునని విధించుచున్నది. 'పతత్సోమస్య లింగస్య సర్వ లింగగ్గ్స్థాపయతి పాణిమంత్రం పవిత్రం- "దేహధారణో భూయాసం" మున్నగు శ్రుతివాక్యములు లింగధారణావశ్యకతను స్పష్టపరచుచున్నవి పూర్వాచార్యులు జగద్గురుత్వముగలిగి లోకారాధ్యులై ప్రసిద్ధిగాంచియుండుట శివారాధన తత్పరులై యుండుటవలన నేగదా! అట్టి సాంప్రదాయానుష్ఠాన పరులీనాఁడును లోకవంద్యులగుచునే యున్నారు.

బ్రాహ్మణులలోఁ గొందఱు నీలింగధారణమానుకొని యీ లింగమును పీఠమందుంచి పూజించుచున్నారని మనముకూడా యట్టి యాచారము నవలంబింప నూహించుట పతనహేతువని భావింపవలయును. ఉన్నతాదర్శము గలిగి యుండిన మతమందు జన్మించి పరధర్మానుష్ఠానమవలంబించుట ప్రాధాన్యము కాజాలదు. మహాపండితోత్తములైన శ్రీ పాదకృష్ణమూర్తిశాస్త్రిగారు శ్రీ పాకయాజిగారితో వివాద సందర్భమున నొక పత్రికఁ బ్రకటించి యందు మా మతముకంటె మీ మతమొక మెట్టు యెక్కువని తలంచక మీ మతాచారముల విమర్శించుచున్నావని స్పష్టపరచి యున్నారు. కాన శైవధర్మములు మోక్ష సాధకములు.

సర్వసంగ పరిత్యాగులైన సన్యాసులు సహితము భస్మరుద్రాక్షధారులై- లింగ పూజాపరులై శైవధర్మానుష్ఠానమువలననే లోకగురుత్వము గలిగియుండుట జగద్విదితము. ఇందుకు-ఆదిశంకరాచార్యులవారే మనకు సాక్ష్యము.

నేఁడు కొందఱు ఉద్యోగరీత్యా కర్మకాండకై యిబ్బంది గల్గుచున్నదని లింగధారణ మానుకొన్నచో-ఖండాంతరములకేగువారు జందెమువలన కర్మకాండ కిబ్బంది గల్గునని జందెము మానుకొన్నచోఁ బరకులమతస్థుల నాశ్రయింపవలెనుగదా! లోకమునఁ గులమతములు ననావశ్యకములని చెప్పునట్టివారు సహిత మంత్యకాలమునందా యీ కులమతానుసారముగ నంత్యక్రియలు జరుపుకొనుచునే యున్నారు. లోకమున నేదో యొక మతమందుండుట యావశ్యకమే యగుచుండఁ బ్రధానమగు మన మతమును వీడుట ఏలకో బోధపడదు.

కొందఱు లింగమును గట్టుకొనిన సంబంధముల కిబ్బంది గల్గుచున్నదని తమ పిల్లలకు లింగముల కట్టుకయు-నలింగులకుఁ దమ పిల్లలనిచ్చియు లింగ ధారణ మతమును సంకుచిత పఱచుచున్నారు,

ఎక్కడ కాశ్మీరు! ఆనాఁడు ముదిగొండవారికి మూల పురుషుఁడగు ఉద్భటారాధ్యులు కాశ్మీరాధిపతియగు జయాపీడుని సభలో సభాధిపతిగానుండి యుండెను. శైవమునకు మూలస్కంధముగా కాశ్మీరు నొనరించెను. శైవగ్రంథములు కావలెనన్న నీనాఁడు కాశ్మీరునందే లభ్యమగుచున్నవి. కాశీయందు నుద్భటారాధ్య పీఠము స్థాపింపఁబడెను. భోజ మహారాజుద్భటారాధ్యులవలన లింగధారణ దీక్ష గ్రహించెను. ఆరోజులలో నుత్తరహిందూస్థానమందు సహితమారాధ్య బ్రాహ్మణమతము విస్తరిల్లియుండినటుల విదితమగుచున్నది.

కంచిలో మంచెన పండితులొక వివాదసభా పరిష్కారమునందు విష్ణు విగ్రహమును శివునికి నమస్కరించునట్లొనర్చి తన మహిమఁ జూపించెను.

శివు డొక్కడే దైవమని నిక్కముగా నొనరింపనెంచి శ్రీపతి పండితుఁడు విజయవాడలో నగ్నిని పట్టుపచ్చడమునఁగట్టి జమ్మిచెట్టునకుఁ గట్టెను.

మల్లికార్జున పండితులు చందవోలులో శివసన్నిధియందు బౌద్ధుల సభాంగణమునఁ దన నేత్రములు దీసి శివుని సమీపమునం దుంచగా తిరిగి వారికిఁ గనులు వచ్చినవి. వారు తృప్తినిఁగాంచక తిరిగి-తిరిగి కండ్లుతీయుంచుచురాగా యవి యెప్పటివలె వచ్చుచుండుటగాంచి యందఱు నాశ్చర్యనిమగ్నులైరి. శాసనరూపకముగ, చందవోలులో నీవిషయమిప్పుడును గలదు.

శివిజనదర్శనముచేయని పాల్కురికి సోమనారాధ్యు నవమానించుటకై ఓరుగల్లునందుఁ గొందఱు కపటభస్మ రుద్రాక్షలింగముల ధరించిన వారినిం బంపఁగా వారందఱు సోమనారాధ్యుని మాహాత్మ్యము వలన నిజలింగధారులై యాతని శిష్యులై సేవింపఁ దొడగిరి.

ఇట్టి మహత్తుగలిగిన పూర్వ సాంప్రదాయముగల యారాధ్యులు ప్రస్తుతమాంధ్రప్రాంతమునందే యున్నను-వీరికి, శిష్యులినాఁడు నా సేతుహిమాచల పర్యంత ముండియున్నారు. వీరినిబట్టియుఁ బూర్వమందీమతము, జగంబునంతటను విస్తరిల్లియున్నను-నీక్రింది కారణాంతరములవలన మతము క్షీణించినదని తోచుచున్నది. పూర్వము శంకరాచార్యులవారి ప్రచారమున, ఆరాధ్యులు కొందరు లింగమును గట్టుకొనక స్మార్తులైరి. బసవేశ్వరుని

ప్రచారమున నుపనయనము మానుకొని జంగములైరి. ఆ యా మత ప్రచార సందర్భములలో నట్లుమారుట క్రొత్తగాదు. తెనాలి రామలింగకవి మొదట శైవుడుగ నుండియు రాజాశ్రయముకొఱకు రామకృష్ణ నామధేయము వహించి పాండురంగ మాహాత్మ్యము రచించెను కందుకూరి వీరేశలింగం పంతులుగారు బ్రహ్మసమాజికులై జందెమును-లింగమును రెండును విసర్జించిరి. పూర్వము లింగధారులుగనున్న వారెందఱో యీనాఁడా యా గృహనామములతో వ్యవహరింపఁబడుచున్నను లింగధారణ లేనివారై-యొకప్పుడు తమ పూర్వీకులందఱు లింగధారులై యుండిరని చెప్పుచున్నారు.

కులమతములు-మీ గౌరవ యుద్యోగములకుఁగాని—కర్మకాండకుఁగాని యడ్డురావు. దేశకాలములకుఁ దగినట్టి యాచారములను మన పూర్వులే నిశ్చయించియున్నారు. అట్టి వాటిని దెలిసికొని యాచరించి మతాభివృద్ధి నొనరింప యత్నింపుడు.

సీ॥ వర్ణాశ్రమాచార పద్ధతులన్నియుఁ
జాయక విధి సలుపంగవలయు
స్నాన సంధ్యావంద, నాది కృత్యంబుల
నవి సకాలంబు నొ, నర్పవలయు
పొంది శాంభవదీక్ష, ముక్తికి హేతువౌ
శివపూజ నిత్యంబు, చేయవలయు.
పంచాక్షరీమంత్ర, పఠనంబు దోషవి
ముక్తికి మదిఁ జేయుఁ, బూనవలయు
తే॥ తాను భస్మరుద్రాక్షలఁ, దాల్పవలయు
ననవరతమును శివకథల్, వినఁగవలయు
భక్తిమార్గంబు విడువక, పట్టవలయు
నివియ శైవుల విధులుగా నెంచవలయు.

## రాజధానిలో రుద్రయాగము

గత మాసములో శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు రాజధానియందు తమ నూతన గృహప్రవేశోత్సవ సందర్భమున 11 దినములు సకలకల్యాణప్రదమగు రుద్రయాగమును నిశితభక్తిప్రపత్తులతో జరిపించి ప్రశంసల నందిరి.

# బాలశివభక్తుఁడు

కన్నెకంటి వీరభద్రాచార్యులు
(పల్నాటి సోదరకవులు)

1

భావమువొంగ బాలశివభక్తుఁ డొకం డతినిష్ఠతో మహా
దేవుని బావగాఁ బిలచి దివ్యౌఘ పంథువునాఁడు బంధు మి
త్రావళి మెచ్చ విందులిడినట్టి పవిత్ర చరిత్రమున్ గమా
రా ! వివరించెదన్ వినుము రా ! కలుషంబు తొలంగిపోవురా !

2

శైవమతప్రభల్ సకల జాతుల ప్రాకిన కాలమందు మే
ధావులు జంగమయ్యలు సుధాహృదయుల్ శివదీక్షతో ప్రజా
సేవలఁ జేయువేళ వికసించె మహాంధ్ర ధరిత్రియందు భీ
మావతియన్ పురంబు సకలార్థచయంబుల కాకరంబనన్.

3

పట్టరు తాటిచీపురులు ప్రాణము లొప్పి నిజాలయమ్ములం
గట్టరు తాటిదూలములఁ గమ్మదనమ్ములఁ జిమ్ముచుండినన్
ముట్టరు తాటిముంజల నమోఘ చరిత్రులు తత్ప్రజల్ జగం
బిట్టిటులైననేమి లవమైనను దాటరు శైవధర్మమున్.

4

అరకలంగట్ట రీశ్వరునిఁ గొల్వకయ ముం
దచట కర్షకులు భక్తాగ్రసరులు
పనిముట్లముట్ట రీశున్ నుతింపకయ ముం
దచట కార్మికులు దీక్షాభిమతులు
కొట్టులంబెట్ట రుగ్రుని దలంపకయ ముం
దచట వర్తకులు నిష్ఠానురతులు
ప్రొయిల నిప్పిడరు శంభుని భజింపకయ ముం
దచట గేహినులు ధర్మార్థఖనులు

పాఠశాలకు జనరుత్ర్యంబకుని వినుతి
సలుపకయు ముందచట బాలకులు కుమార !
యేపుమీరి భీమావతీపురంబు
శైవమత నియమములకా స్థానమగుట.'

5

వసియించుచుండు రాపురిఁ
బ్రసహాస్త్రారాతి పాద భక్తులు విబుధా
గ్రసరులు పావనమూర్తులు
బసవన శిష్యులును చెన్నబసవన శిష్యుల్.

6

ఆ పురమునఁ నొక భక్తుఁడు
కాఁపుర మొనరించుచుండెఁ గడుపేద భవా
నీ పతి పాదాంబుజ సే
వాపరుఁడై సతము సుగుణ వర్ధిష్ణుఁడనన్.

7

కల్లలు కపటము లెఱుఁగని
తల్లి సుగుణ కల్పవల్లి ధర్మముతో వ
ర్థిల్లిన సతి యా భక్తున
కిల్లాలై కరుణఁజూచు నిరుగుం బొరుగున్.

8

ఆ పుణ్యదంపతులకు ను
మాపతి కృపచేత నొక కుమారుండు కళా
వ్యాప్తిత దేహుం డన్వయ
దీపకుఁ డుదయించి కొరతఁ దీర్చెను తండ్రీ !

9

లేక లేక కల్గి లేలేఁత జాబిల్లి
కరణి దిన దినంబుగాంచె వృద్ధి
నై దువత్సరంబు లా బాలునకు నిండె
వడుగుజేసి తండ్రి బడికిఁ బంపె.

10

కలిగినదానిలోఁ గలియొ గంజియొ ద్రాగుచుఁ బార్వతీశ్వరుం
గొలఁచుచుఁ గూర్మి ముద్దు కొడుకుం జదివించుచు నద్దు పద్దులన్
నిలుపుచు ధర్మపద్ధతుల నేర్పుచుఁ గాలముఁ బుచ్చుచుండి రా
యలఘుమతుల్ దయాభిరతులా ప్రియదంపతు లెంత ధన్యులో !

11

అమ్మకు నాన్న కెన్నఁ డెదురాడి యెఱుంగడు లేనిదాని తే
తెమ్మని గోలసేయఁడు విధేయతతోఁ దిరుగాడు కాని గ
ర్వమ్ము వహించి పెద్దల నిరాకరణ బొనరింపఁబోడు బా
ల్యమ్మున నున్న నేమి చరితార్థుఁడు వారి కుమారుఁ డర్భకా !

12

పేదతనమ్ము నిండి వెరపించుచు నుండిననేమి మట్టు మ
ర్యాదల సంచరించెడి గృహస్థులు తత్ప్రియదంపతుల్ మహా
హ్లాదముతో సతం బతిథులన్ బరితృప్తులఁ జేతు రర్ఘ్యపా
ద్యాదుల భోజనాదుల సమర్పణచేయుచు నాదరించుచున్.

13

ఆ యమలాత్ముఁడా యనఘుఁడా శివభక్తుఁడు కొంతకాల మా
ప్యాయముతోఁ గుటుంబమును బాలనచేయుచు దీర్ఘరోగియై
కాయము వాసెఁ బ్రేమనిడి గన్నకుమారునివీడి, బ్రహ్మ దీ
ర్ఘాయు నొసంగనేరఁడుగదా ! మతిమంతులకేమి చిత్రమో !

14

అక్కట ప్రాణనాథుఁడు శివైక్యముచెందె ననుంగు పుత్త్రుఁడో
తెక్కలురాని బాలుఁడు దరిద్రము తాండవమాడు నింటనే
దిక్కనుమంత దోఁపక మదిం దపియించుచు గ్రుడ్లు నీరముం
గ్రుక్కుచు నా సుశీల బ్రతుకుం దెరువెయ్యది గానుపింపమిన్.

15

తా లవ మెన్నఁడుం గడపదాటి యెఱుంగని తల్లి దీనయై
కూలికిఁ బోయి, యందుఁ దనకుం దగు కష్టముఁ జేసి తవ్వెడో
సోలెఁడో తెచ్చి కాచి నిజసూనుని యాఁకటిఁదీర్చి పంపి, యి
ల్లాలు భుజించుదా మిగిలినట్టి పదార్థముఁ దృప్తిఁ జెందుచున్.

16

అనువగు కూరతో సుతున కన్నము బెట్టెడి భాగ్యమింతయుం
గనుఁగొన నేరనైతినని కన్నుల నీరిడుచుండుఁదల్లి, నా
కనువుగఁబెట్టి యమ్మ తినదాయెఁగదా యని చింత నొందు నం
దనుఁడు, పవిత్రమైన శివధర్మము నిర్వురునేర్చి యుండుటన్.

17

వడతుకమేనఁ గట్టికొను బట్టలలో నొకదానిఁ జించియే
కొడుకున కంగవస్త్రములఁ గూరిచి, తానొకప్రాత చీరెతోఁ
గడుపుచునుండెరా! కఠినకాలము—బిడ్డకుఁగాన ధైర్యముం
జెడకయు మాధవున్ స్వధవుఁ జిత్తసరోజమునందు నిల్పుచున్.

18

లేశమును చల్దియన్నము లేనినాడు
పరిగడుపు తోడబిడ్డఁడు పాఠశాల
కరుగుచుండుట తల్లి కన్నారఁజూచి
యలమటించిన నాళ్ళెన్నియైనఁ గలవు.

19

తోడి బాలుడు దాల్చు దుస్తులను గాంచి
యఁగలార్చెడి తన ముద్దులయ్య మనసు
దెలిసికొని తల్లడిలుచు నా దీనురాలు
క్రుంగి కృశియించు గర్భమ్ము కుమిలిపోవ,

20

అర్థులరుదెంచి యన్నమమ్మా! యటన్న
లేదు లేదనుమాట రానీదు నోట
బిడ్డఁకు తినంగ మిగిలిన పిడికెఁడన్న
మర్పణముచేసి తా నిరాహార యగును.

21

ఎన్ని కష్టమ్ములం బడుచున్ననేమి
యెన్ని చింతలు తనుఁ జుట్టికొన్ననేమి
యతిథిపూజలు శివపూజ లహరహమ్ము
భక్తి నాచరించుచుండు నా పావనాత్మ!

22

ఆ పరమసాధ్వి యటుపి సుతుఁ
గాపాడుచుఁ గాపురమును గడుపుచునుండన్
బాపావళి జరిమార్చెడి
దీపావళి పండు వరుగు దెంచుచు నుండెన్.

24

వికసితముఖారవిందకులు వెలయుచుండ
బాలకులు గుంపులై పాఠశాలఁ జేరి
పండువులుగూర్చి వివిధ సంభాషణముల
నాడుకొనుచుండి రానంద మతిశయిల్ల!

24

ఒకబాలుఁడు సంతోషముఁ
బ్రకటించుచు నాడు మాదు బావకు మాయ
క్కకు విందు లొసఁగఁగలమని
యకళంక ప్రేమ హృదయుఁడై వచియించెన్.

25

ఆలించుచు నవ్వాక్యము
బాలకులందఱును నట్లపల్కిరి. దూరం
బాలోచింపక రాముడు
నాలాగుననే వచించె హర్షము పొంగన్.

26

అనిధీఁబల్కు రాముఁగని యందఱు నవ్వుచు గేలిచేయుచున్
నీవు వచించుచున్న యది నిక్కముకాదెట నున్నవాఁడు నీ
బావ యబద్ధ మాడుటకుఁ బాల్పడుచుంటివి పొమ్ము పొమ్మనన్
భానము తల్లడిల్లఁ జనె బాలకులన్ విడి తల్లిఁ జేరఁగన్.

27

కదలిరాక హొడంగు కన్నీటి ధారలన్
బుజమిపైఁ బడనీక దుడిచికొంచు
వెడలివచ్చెడి యేడ్పు వెక్కిళ్ళ గ్రుక్కిళ్ళ
బొంగనీయక పట్టి మ్రింగికొంచు

తడబడంబోవు కాల్నడకల గుర్తించి
కడుసిబ్బరంబుగా నడుగులిడుచు
సంకపట్టిన తోలంగి జారిపోవ గడంగు
పలకఁ బుస్తకములన్ నిలిపికొంచు.
తోడిబాలురు గుమిగూడి తూలనాడు
పలుకుములుకులతో మహాబాధపడుచు
తెల్లవోయిన మొగముతో దీనుఁడగుచు
నరుగుదెంచుచునుండెఁ గన్నమ్మఁజేర !

28

తనయుఁడట్టుల కన్నీటి ధారలొలుక
దరలివచ్చుటగని తల్లి తల్లడిలుచుఁ
జెంతకుంబోయి నిలిచి నాచిట్టితండ్రి !
యేడువకుమంచు జాలిమై యెత్తికొంచు.

29

తిన్నఁగఁ బయ్యెద చెరగునఁ
గన్నులఁ జలములను దుడిచి గారాబముతో
మన్నించి కొడుకు నెందుల
కన్నా ! యేడ్చెదవటంచు నడుగఁ దొడంగెన్.

30

అడిగినంత బాలుఁ డమ్మకు జరిగిన
చరితమంత వినిచి జాలిగూర
ననియె నిట్లు తల్లి ! అక్కయు బావయు
గానుపింప రేమి కారణమ్మ.

31

అక్కబావలుండిరట యందఱకు గూడ
నాకు లేని కారణంబదేమి
యొకనికుండి యొకనికుండక పోదురా !
నమ్మఁజాలకుంటి నమ్మ నేను.

32

తేరా ! నా కవ్వారలు
ధారుణిపై ననుఁగంటఁబడి వెల్వడి చి
న్నారింగని కడుపంటఁగ
మారిల నాయమ్మ యేడ్పు మఱపించుటకై.

33

పుత్రికుని కౌగిటంజేర్చి బుజ్జగించి
యేడువకు తండ్రి! బాలుర కేమి దెలియు
అక్కయున్నది నీకు బావయ్య కలఁడు
వారి మించిన వార లీ వసుధ లేరు.

34

చిట్టితండ్రి వారు శ్రీశైలవాసులై
వెలయుచుందు రెపుడు వేయిగతుల
బావకుండె వెండి బంగారు కొండలు
కలిమిఁగలిగి నటులఁ గానరాఁడు

35

ఇంటి చెప్పులట్లు కాపాడుచున్నారు
నిన్ను నన్ను నెచటనున్న నేమి
పెట్టిపోయలేని పేదవాలను గాన
వారు వారు నా వరాలకుప్ప!

36

మల్లికార్జునుఁడు సమ్యగ్గయాహృదయుండు
ప్రణవస్వరూపుఁడు బావనీకు
పార్వతీ ప్రతిబింబ భ్రమరాంబ జగదంబ
ప్రేముకొల్వఁగొను తల్లి యక్క నీకు
విఘ్నేశ్వర, కుమార, వీరభద్రేశ్వరుల్
గురుయశోభరితు లల్లుండ్రు నీకు
పరమభక్తులు లోకపావనుల్ ప్రమద పుం
గవులు మేలిమ్మి బాంధవులు నీకు
పారఁజూచిన నీకన్న బలగమున్న
బాలుఁడెవ్వఁడుగలఁడీ ప్రపంచమందు
నెవ్వరెటుఁబాడికొన్న నీ కేమికొరత
కంటదడి పెట్టవోకు బంగారుకొండ!

37

అని బుజ్జగించు తల్లిన్
గనుఁగొని రాముండు పలికెఁ గ్రక్కున మాయ
క్కను మా బావను వేగమ
కొనికచ్చెద నాజ్ఞనిడుమ గొబ్బునననుచున్. (సశేషము)

# పద్యాః పరనిర్వృతయే – మలహణ మహాకవి.

శ్రీ బి. చిదంబర శాస్త్రి

(గతసంచిక తరువాయి)

రసాభినివేశముచే అఘటనఘటనా ధురంధరులై శివ సాక్షాత్కారమును బడసిన "పుష్పదంత, మలహణా"ది మహాపురుషులను పరికించిన వాడగుటచేతనే మోక్షమును మహత్ప్రయోజనమున్ను కావ్యమునందు కలదని రూఢిగా నిర్వచించి యుండెను మన యాచార్యుడు.

గంధర్వజాతికి జెందిన పుష్పదంతుడు మనకు పూజ్యుడయినటులనే మానవోత్తముడగు మలహణ మహాకవియు మనకు చిరస్మరణీయుడు. అతడొక విశిష్టమైన వ్యక్తి. లోకవృత్తములైన యభిమానాము లాతనిని బంధింపజాలకుండెను. అతని తీరే వేరు. అగ్రగణ్యమైన తన కులగౌరవమునైనా సరకు సేయక విచ్చలవిడిగా సంచరించుచున్న యాతని నడకలు పిల్లలచేత లనివర్ణింపజూచెను లోకము. కాని నా, నీ, యన్న సంబంధములయొక్క విభాగముల చేత దివారాత్రములును, తెంపులేని పనులలో లీనమైన ప్రజాసమూహామే యాతనికొక బాలచేష్టగా కనిపించుచుండెను. మానము, మర్యాద, యన్న విచక్షతను త్యజించి, పరిభ్రమించుచున్నవా డితడొక పిచ్చివాడని ప్రపంచమంతే క్షణకాలికమైన శరీరము యొక్క పతనావస్థను తెలిసికొనజాలక ఆ దేహమునకు చిరసామ్రాజ్య పట్టాభిషేకము గట్టజూచుచున్న యీ ప్రపంచమే పిచ్చిదని యాతడు వాపోవుచున్నాడు. ధనకనకాది సర్వనాశకర్తమైన వేశ్యాపిశాచ మీతనిని చుట్టికొన పూజ్యమగు వంశమున కీతడొక భూతమై దాపురించినాడని ప్రపంచము నిందింప జూచుచుండ, మానవత్వముయొక్క విశిష్టతను గ్రహింపనేరని యీ పాడులోకము దుస్తర దురాశావ్యామోహముల చేత చిక్కికొని భయంకర పిశాచమువలె యాతని హృదయమునకు తోచుచుండెను. అతని హృదయానుభూతియే వేరు తాను హేయకుల సందూషితమగు నొక వేశ్యజాతికి జెందిన విలాసవతి కలచు భోగములలో నిమగ్నుడై కనబడుచున్నను ఆతనికవి సంకెళ్ళు కావు. విశిష్ట మహానందానుభావమునకు ఆమె సృష్టించు కళాప్రపంచ మొక సాధనాసోపానము. ఆమె మధుర సంభాషణము పారమేశ్వర స్వరూప నిరూపణము. ఆమె నాట్యభంగిమలు విశ్వసంవ్యాప్త చిదచిల్లీలా ప్రవాహము. ఆమె సుఖాలింగనము దివ్యస్వరూప పరిష్వంగము. అట్టియెడ ఆమె యెవరైననేమి, యే జాతికి జెందిననేమి, ఆమె విశుద్ధ మనోభావములచేత సంకలితములైన పరంపరలే తన మానవత్వమును సార్థకము జేయు మూలకారణములు.

"సజ్జనునకు ఆమెవలనఁ గలిగిన దోషమేదియును లేదు. ఏనాడు బాల్యమును వీడి యౌవనదశ ననుభవించుటకు మొదలిడెనో నాటినుండియు నా కళావాహినికి మలహణుడు దక్క మఱియొక పురుషుడు ప్రపంచమునందుండు ననునదియే తెలియదు. ఆమె హృదయమున కాతడాత్మ ఆమె శరీరమున కాతడు జీవము, ఆమె కళల కాతడు కళాధారి......

ఇట్లు సర్వకాల సర్వావస్థలయందు నాతనికామె, యామె కాతడు తప్ప ప్రపంచమే యెరుగని యా సుందరాభిమానులకు రాత్రి పవలు నెప్పుడెట్లు కలుగుచున్నదియు తెలియక సంవత్సరములు గడచిపోవుచుండెను. వారి యన్యోన్యతను విడదీయుటకు సూర్యాకాశములను దారముతో గొలువ నున్నట్లు మోకాళ్ళను బట్టతలలకు ముడిపెట్టనున్నట్లు నీటిధారను రెండుగా చీల్చబోయినట్లు, రాతిబండపై నీరాడనున్నట్లు, ఇసుకతో త్రాడు పేనజూచినట్లు దిక్కులతో తాళములు వాయించనున్నట్లు, కొండలను దొంతరలుగా బేర్చ బోయినట్లు, మంచును కుంచముతో కొలువ దలచినటుల ఆ కళావాహిని తల్లి విశ్వప్రయత్నమును జేయుచుండెను. తన చిన్నతనమునుండియు కల చతురత్వమునెల్ల వినియోగించి ప్రపంచమును మోసగించి కూడబెట్టిన మహదైశ్వర్యమంతయు కరిగిపోవుచుండెను. ఎవతెను నిమిత్తము జేసికొని రాజాధిరాజులును వశ్యపడ విశ్వసామ్రాజ్యము నేలుదునని యాశించియుండెనో యట్టి జగదేకమోహిని సంగీత స్రవంతి యా కళావాహిని యొక బడుగు బాపని వలలోఁజిక్కి యాతని పలుకులే కొంగు బంగారమై యాతని కవిత్వమే పెట్టనిసొమ్మై వలపించిన వలచి, స్రుక్కించిన స్రుక్కి జీవిత సర్వస్వమును వృథా చేయుచుండ నెట్లు సహించగలదు. ఈ యున్న కొలది యౌవనము జారిపోవ నింక నీమె నెవరు మోహింపగలరు! ఈమె సాధించునదేమి? అని పలు విధముల వాపోవుచు నెటులైనను ఈతనినుండి కూతును విడదీయుదునని నిశ్చయించి యొకనాడు మలహణుని జేరి యిటుల గద్దించెను...

ఓయీ మోహపిశాచమా! పిన్ననాటనుండియు నిన్నుగా తెలిసిన మా కన్నెనింక నెంతకాలమువఱకు నంటబెట్టుకొని మా సకలమును నాశము జేయజూచుచుంటివి. మిగిలిన యీ స్వల్పధనము నశించిపోయిన తినుటకు లేక నీవు భిక్షాధైరులవై యింటింట తిరిప మెత్తికొని జీవించు నీ దారతనమే మాకు గద్దె వెక్కింపనుంటివా, సాటివిటులు నగుదురన్న సిగ్గయినను నీకు కలుగుటలేదా? నాటికి నాడు వీరభద్రుని తీర్థమునకై వారములవెల్ల జేరమాడి యరిగె. శివరాత్రినాడు జంగమారాధనకు మాయింటనున్న యంగుళీయకముల నరిగడి బంపుకొంటివి. వసంతోత్సవమున మా కాంతలయింతుల మెప్పునకై చేతికడియముల వెల్ల కొల్లగొట్టుకొంటివి. మన్మథసంహారి కోవెలలో దీపమాలిక నెత్తుటకు

కలపదకంబులను వెచ్చించియుండె. ఇదిగో పులివలె శివరాత్రి సమీపించుచుండ మిగిలిన యా ముత్తైపుసరుల నరువు బెట్టనున్నది. యిటుల నున్న సర్వస్వము మాసతి నీయి వమ్ముజేయుచుండ జూచియు చూడనటుల నెరిగియు నెరుగనటుల కామ రహస్యముల నెల్లె వల్లె వెట్టి మాపిల్లదానియిల్లు గుల్లజేయుటకు మగలంజవోలె కనగట్టి యింత సెంత కాలము సాగించనుంటివి. చాలు చాలు నీ యౌదార్యము మాకుపదివేలు వచ్చె నిక తక్షణమే మాయిల్లు వదలి వెళ్లుమని ధిక్కరించుచు కడురభస జేసి వాకిట దొలగించెను. అంతమాత్రమున బోనీక తన ముద్దుకూతును జేరదీసి తర్కించి వినకుండిన దండించి బలవంతమున నొక్క యధికారి చెంత కాపురమునకై నియమించెను. అట్లు వారి పాంచభౌతిక శరీరములను దూరము జేయ జాలెనుగాని నిరంతర తన్మధురావలగ్న మానసములను వేరుపరుప జాలకుండెను.

మలహాణుడును తనకు బహుకాలమునుండియు కలిగిన దివ్యానుభూతిని విస్మరింప జాలకుండెను ఏదిజూచినను ఆచపలాక్షి వాలుకన్నులచూపులే దోచుచుండెను, దేని వినినను ఆముగ్ధపలుకు పలుకులే చెవులలో గింగురువెట్టుచుండెను. దేని దలచినను ఆమధురలాలస కలచు దివ్యానుభూతి మెలివెట్టుచుండెను. ఇటుల కేవలతదీయ సుందరతా విలీన మానసుండగుట నెటబోయి యేమిజేయుటకును రుచింపక యీ ప్రపంచమే యొక నిగళబద్ధమై తోచుచుండెను అస్వతంత్రమైన శరీరము దుర్విషయలంపటమై జీర్ణింపనుండ నింక తానీప్రపంచమున సాధింప వలసినదేమికలదు నిరవచ్ఛిన్నమహానందమున లీనమగుటనే మానవుని విజ్ఞతకు సార్థకము కలుగుచున్నది కాదా అట్టులైన తననొక దివ్య స్వరూపముగా భావించి జీవితమును ధారవోసియున్న కళావాహిని మాత్రము ఈదుష్ప్రపంచమున కుళ్లవేసిన యగత్యమేమి? ఇప్పుడే యాకరుణ దయాళుడగు పరమేశ్వరుని శరణుగోరుముగాకయని నిశ్చయించి కారుచీకటులుగవిస్మిన యానిశీథ సమయమున నే కళావాహిని శయన మందిరమును చేరి ద్వారము బంధింపబడియుండ నచటనే పొంచియుండెను.

విత్తమునకై యమ్ముడుబడి మలహాణసక్త చిత్తయగు కళావాహినియు నదే సమయమున తలుపుచేరచి పరధ్యానమున నుండుటచే నచటనున్న మలహాణుని గమనింపజాలక నములుచున్న తాంబూలము నాతనిపైబడ నుమ్మివేసెను. కాని వెంటనే మలహాణుడట నిలిచియుండుట తెలిసికొని కలిగిన ప్రమాదమునకు చింతించి మాటిమాటికి నాతని పాదములపై వ్రాలుచు నిట్టి ఘోరపచారమును క్షమించుమని దుఃఖించుచుండెను. మలహాణుడును ఇట్లు జరిగియుండుటకు తానే మూలకారణమని తెలిసినవాడగుట నామెను లేవదీసి 'ప్రియా! వినిర్మలమగు నీమధురభావమును నాటినుండియు నాకై వెచ్చించి

య్యుంటివి. నేను నిమిత్తముగా సామహాదానందమును అనుభవించుటకు నీకును సమయమాసన్నమైనది కావున నీవక్షస్థలమును నా వెనుక భాగము నానుకొని నిలువుమని నియోగించి యాభక్తవశ్యుడగు పరమేశ్వరునిట్లు స్తుతించెను.

శ్లో॥ కాంతా కచప్రచయ పుష్పసుగంధిగంధలుబ్ధభ్రమత్ భ్రమర
కర్బుర కంధరాయ
గంధర్వ యక్ష సుర సిద్ధ కిరీటకోటి సంఘట్టఘృష్టచరణాయ
నమశ్శివాయ॥

చం॥ అమరవిలాసినీ కచభరాంచిత పుష్పసహస్రవాస నో
త్కమద మధువ్రతోపమిత కర్బురకంధర భక్తిగంధ సం
భ్రమకృత్ సిద్ధసాధ్య సురవారకిరీట విఘట్టనోజ్జ్వలత్
సుమహితపాద యోశివ నతుల్ కడునీకయి జేతునీశ్వరా॥

సకల శుభంకరుడైన హేశివా! ఈ ప్రపంచమే యొక నాటకము, అందు రాక్షసుడు మానవుడు దేవుడన్న రూపములను ధరించుచున్న నటుడు అట్టి వేషమును స్థిరముగా నలంకరించుకుందునని భ్రమించుచున్నాడు ప్రకృతి సామరస్యమును గ్రహించిన మధుపము (తుమ్మెద—ముముక్షువు) సుగంధము (పరిమళము—తత్త్వము)నందు లుబ్ధమై చరించుచున్నది. విశుద్ధమగు నీకంధరము (కంఠము—దివ్యత్వము నందు బహుదుఃఖ కరమైన కాలకూటము (మాయ)ను నివసింపజేసి శుద్ధరాగ సమ్మిశ్రమున విచిత్రుడవై యుంటివి రహస్యమును దెలిసిన వాడగుట గంధర్వుడు. యక్షుడు. సిద్ధుడు. అమరుడు. నరుడును దివ్యోపాసనచే నీపదము (చరణము స్థానము) నందు అహమహమికచే (నేను నేనని—సోహమని) సుస్థిరుడగు చున్నాడు, అట్టి నీకొరకై సర్వస్వమును అర్పించుచున్నాను,

ఇట్టి మహోన్నత భావములచేత రసగర్భితములగు ముప్పదియారు శ్లోకములను ఏకధారగా రచించుచు తన్మయుడై శివుని స్తుతించెను అహో, యెంత యాశ్చర్యము, భక్తతత్పరుడైన సదాశివుడు తదీయపరిణత మానసమునకు ముగ్ధుడై వేశ్యామందిరమున నున్న మలహణమహాకవికిని ఆతని నంటికొనియున్న కళావాహినికిని స్వస్వరూపమున ప్రత్యక్షమై వెంటనే వారికి సాయుజ్యమును ప్రసాదించెను. నిజమైన భక్త్యుద్రేకము, క్షణకాలము కలిగినను చాలునుగదా.

మలహణమహాకవీ, నీవెంతటి ధన్యుడవు యుగయుగములనుండి కోటానుకోటులుగా జనించిన వారిలో నొకే యొకడవు. నాటికిని నేటికిని రేపటికిని నీ జీవిత చరిత్ర. స్మరించినవారికి తరణోపాయ మగుచున్నదిగదా.

(పండితారాధ్య చరిత్రమునుండి స్వేచ్ఛానుకృతి).

# ఆశీఃపద్య పంచరత్నములు

## శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు

శ్రీశైవపీఠ సభాస్వర్ణోత్సవమందు బ్రహ్మశ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారొనర్చిన కవి సన్మానమును గుఱించి — కవి యొసఁగినవి.

గీ. ఆంధ్రినవతారమొందినయట్టి శివపురాణకృతిని మదిన్ మెచ్చిరాణఁదగు ప్ర
శస్తి యొప్పు సుబ్రహ్మణ్య శర్మ కవికి సత్కృతి యొనర్చెఁ గవికుల
శ్లాఘ్యుఁడగుచు.

శా— సుబ్రహ్మణ్యుఁడఖండవైభవుఁడు మా సోదర్యుఁ డాత్మీయవం
శబ్రధ్నప్రతిముండు శాంభవసభా స్వర్ణోత్సవం బందుఁదా
నీబ్రహ్మణ్యవరేణ్యశైవబుధు లెం తేన్ బొంగనూరార్లొసం
గెఁబ్రాశస్త్యపటంబుతో శివకృతిన్ గీర్తింపుచున్ నేఁ డిటన్.

శా— ఏతన్మాత్రున కీబహూకృతిని దా నిద్ధానుభావంబునన్
జేతోమోదముగా నొనర్చినగుణ శ్రీభాసమానాత్మునిన్
శీతాద్రీశ్వరపుత్త్రికామణియునున్ శ్రీకంఠుఁడున్ దత్సుత
వ్రాతంబునన్ నిరంతంబు మన్పుదురు సుబ్రహ్మణ్యశర్మజ్ఞ గృపన్.

చ— తివిరి యనేక ధర్మములఁ దేకువతో నొనరించుచుండుటల్
కవులను బండితోత్తముల గౌరవమొప్ప బహూకరించుటల్
సువిహితబుద్ధివై సతము సోమకళాధరుఁబూజనంబు లు
ద్భవకృతభూరిపుణ్యపరి పాకము గాదె! సహోదరాగ్రణీ!

క— ఈసుధి కితోధికంబుగ నాసాంబశివుం డొసంగు నఖిలార్థంబుల్
వాసిదగ వంశవృద్ధియు భాసురగతి నెల్లప్రజలు పరితోషింపన్.



# నందికేశ్వర లింగము — భక్తఋషిక

శ్రీ ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారు

శ్లో॥ ప్రభు స్త్వం దీనానాం ఖలు పరమబంధుః పశుపతే,
ప్రముఖ్యోఽహం తేషామపి కిముత బంధుత్వ మనయోః
త్వయైవ క్షంతవ్యా శ్శివ! మదపరాధాశ్చ సకలం
ప్రయత్నాత్ కర్తవ్యం మదవన మియం బంధుసరణిః

—శివానందలహరి.

తాత్పర్యము:- ఓ పశుపతీ! నీవు నిగ్రహానుగ్రహసమర్థుఁడవగు ప్రభుఁడవు. కావుననే దీనజనులకుఁ బరమబంధుఁడవు నే నా దీనజనులలో మొదటివాఁడను ఇఁక మనచుట్టరికమును గుఱించి యేమి చెప్పవలయును నా యపరాధములన్నియుం నీచే క్షమింపఁదగినవి, నాదు సంరక్షణము ప్రయత్నము వలనఁ జేయఁదగినది. ఇది బంధువులమార్గము.

నర్మదానదీతీరస్థంబగు నొకపుణ్యవనంబందు సౌందర్యనిధి యగు ఋషిక యనఁగ నొక బ్రాహ్మణకుమారి గలదు. ఆమెకుఁ బూర్వకర్మవశంబున బాల్యంబందే నాథుఁడు గతించుటఁ జేసి బాల్యమందే వైధవ్యంబు సంప్రాప్తమయ్యె. ఐనను నాయమధీరయు నుచితజ్ఞయు నొటఁబరిశుద్ధాత్మయై శివదీక్ష నొంది ప్రత్యహమును త్రికాలములందు శివలింగంబును భక్తితోఁ బూజించుచుండె. యౌవనదశ యొదవినను గూడఁ దాను నిరతము శివైకనిష్ఠతో నుండి శివార్చనంబు సల్పుచుండె. ఇట్లుండఁ గొంతదికాలములో నొకనాఁడు నర్మదయందుఁ దీర్థమాడి యుదకంబుఁగొనిపోవుచున్న నా బ్రాహ్మణయువతిని నొకరక్కసుఁడు చూచి రూపలావణ్యంబుల కక్కజపడి మన్మథబాణంబుల నొచ్చి మోహపరవశుండై యచ్చేడియను డాసి యడ్డగించి తనమనోభీష్టంబుఁ దెలిపె. ఆయమ భీతయై తొలఁగిపోవుచుఁ దాను గాముకయువతిని గాననియు వితంతువుననియును శివపూజావ్రతదీక్షితననియును దెలిపి అనుచితపథంబు నుండి హృదయంబును మరల్చికొని పొమ్మనిచెప్పె. మదోన్మత్తుఁడగు నాక్రవ్యాదుఁ డుడుగక కామాంధుఁడై యామెతో నీవంగీకరించినసరి యే లేకున్న బలాత్కరించి నిన్ను గొనిపోయి యిష్టంబులఁ దీర్చికొనెద నని సమీపించుచుండె. అపుడాయుత్తమ యుత్తలం బొంది యాదురాత్మునిబారినుండి తన్ను దప్పించి రక్షించువారి నెవ్వారిని గానక సర్వదుఃఖభయపరిహారకుఁ డగు మహేశ్వరుండే దిక్కని తలంచి మదిలో నిట్లు శివుని గూర్చి ప్రార్థించుచుండె

హరిణగతిరగడ,

శివశివశివశివ శివశివశంకర శివశివశివశివ శివమునికింకర
కవిజననుతపద కంజసముజ్జ్వల రనిశశినయన హిరణ్యతనూజ్జ్వల
శ్రీకర! దయనిటు జిమ్ముము నాపయి వీక నసురఁ దెగ వేయుము
ప్రాపయి
తేకువఁ గొనుమీ దివ్యచిత్తమున నీ కెవరెదురు త్రిణేత్ర! మొత్తమున
నీ పదంబులకు నెక్కొని మ్రొక్కెద నాపదఁ బాపిన నభవా! దక్కెద
వాదమేల పెర వానికిఁ జిక్కెదు మీఁదటఁ గనుగొన మిత్తికిఁ డక్కెదు
తలకొనఁజాల నధర్మము దేవర యలవునఁ జేరి కృపాకర! శ్రీవర
శంకర శంభో శరణు చేసెదను బంకజారి ధర పదముఁ డాఁగెదను
పంకిలకర్మముఁ బాయఁగఁ జేయుము వంకలఁ బోవ కవశ్యముడాయుము
కావఁగ రావే కరుణామూర్తీ ప్రోవంగనీవే పూరితకీర్తి!
నా నేరమనిగ నందగ దిత్తరి నీనెటి దప్పిన నీల్గును బిత్తరి
తల్లివినీవే తండ్రివినీవే యెల్లలోకముల కేలిక నీవే
తోడువునీవే దొరవును నీవే నీడవునీవే నెయ్యుఁడ వీవే
భక్తురాల నీ పాలఁబడితి నిఁక శక్తిపతీ! వే సాకుము గొంకక
ఒప్పరికించిన నొప్పునె నీకది తప్పదు నీకిఁకఁ దారసింపకిది
రమ్మిక రమ్మిక రాజభూషణుఁడ నమ్మితి నిన్నామ్నాయభాషణుఁడ
గౌరీకాంతుఁడ కలుషవిదారుఁడ శ్రీ రమణాదిక చిత్తవిహారుఁడ!
—శివపురాణము

ఇట్లార్తితో నా యమ ప్రార్థించుచున్నంతనే హరుండు బిరబిరవచ్చి యసురుని వీక్షించినంతనే యవ్వాఁడు భస్మరాసియై కూలె. అంత బాలేందు ధరుఁడు ఋషికను గాంచి భయంబుదప్పి నీ పరిశుద్ధ చారిత్రంబునకు మెచ్చితి వరంబులిచ్చెద నభీష్టములఁ గోరుమనియె. అపు డప్పావనమతి యెంతయేని సంతసించి తండ్రీ! బ్రతికించితివి సదయహృదయా! ధన్యనైనన్ దరిసెనము గూడ నిచ్చితి వని మ్రొక్కి యిట్లనియె.

సీ— ఆయెఁగా దెలిపి మేలాయెఁగా సుఖము పెంపాయెఁగా డాయువ నట
ఊఁడెగామదము వెన్నాడెఁగా దృశము పోవాడెఁగా యసురు దై
త్యాధముండు
పానెఁగా బాధ లోడానెఁగా బోధ వేమానెఁగా వెరపు విశ్వాస మెసఁగ
మించెఁగాకోర్కి రుచించెఁగా భక్తి పేర్మించెఁగా హృదయ
ముదంచితముగ

గీ. నిండెఁ గా కీర్తి యెల్లెడఁ బండెఁగా మదీయపూజనమిది పార్వతీసహాయ!
పొదలెఁగా యదరఖిలదుష్కృతులకెంతొ సకలలోకైకరక్షణచతురయిపుడు.

—శివపురాణము.

దేవదేవా! ఇఁకను వరంబులేటికి? నీవిచ్చెదననుట కిట్లడిగెద నిరతము నీదు చరణసేవాసక్తి నాకొసఁగుము మఱియు జగంబుల ననపాయంబుగ సాఁకుట కీవనంబందు వసింపుమనియె. దయామయాత్ముఁడగు పరమేశ్వరుఁ డాయమ కట్ల వరంబిచ్చి యావనస్థలి లింగరూపంబుఁ జెంది యుండె ఆ లింగం బఖిల జనానందకరంబై యొప్పుట నందికేశలింగంబని పేరొందె. అంతఁ బరమేశ్వర పత్నియగు గంగాదేవియుఁ దఱిసి వచ్చి ఋషికనుజూచి అమ్మా! నీ సుచరిత్రమ్మున కెంతయేని బొంగితి. నీవనుదినము తీర్థమాడుచున్న నీ నర్మదాఘట్టంబందు వత్సరంబున కొక్కదినంబందు మార్గశీర్ష శుద్ధ సప్తమీ తిథియందు నేను ప్రవేశించి యుందును అమ్మయునాఁడు మరలఁబోవుదునని యంతర్ధానమొందె ఋషిక యానందించి మ్రొక్కెఁ బదపడి యాసుశీల ప్రత్యహము త్రివార మట్లే శివలింగంబు నర్చించుచు శివానుగ్రహము నొందె నిది భక్తఋషికా చరిత్రంబు పావనంబు.



---

శ్రీ

## విశ్వశాంతి మహాయజ్ఞము — అష్టగ్రహకూటారిష్ట శాంతికై

(యజ్ఞసమితి కమిటీ, సికింద్రాబాద్)

ఈ శ్రావణ శు॥ ౧ నుండి ఐదుమాసములు సికిందాబాదు నందలి లాలాగుడిలో కోటిబిల్వార్చన మహారుద్రాభిషేక నవగ్రహ జపాది కార్యక్రమములు బ్రహ్మశ్రీ లో॥ నిర్మల అంబయ్య సిద్ధాంతిగారి ఆధ్వర్యమున జరుపఁబడుటయేగాక జనవరి 7 నుండి 11 రోజులు 108 కుండములందు సహస్ర చండీ మహారుద్ర నవగ్రహ నక్షత్ర గణేశ పంచాక్షరీ గాయత్రీ విష్ణుయాగములను గావించిరి.

ఇందుకు చాలామంది తమ యరిష్టములు తొలగుటకై స్వీయ గోత్ర నామములతో హవనము చేయించుకొనుటకు సంకల్పించుచున్నందున ఇట్టి సదవకాశము కల్పించనైనది.

---

# పరమేశ్వరుని మహిమ

## శ్రీ ధూళిపాళ రామచంద్ర శాస్త్రిగారు

వేద న్యాయాలంకార పండితులు

ఉపనిషద్వాక్యము—

"సర్వో వై రుద్ర స్తస్మైరుద్రాయ నమో అస్తు ।
పురుషో వై రుద్ర స్సన్మహో నమో నమః ॥"

అర్థము :—యోరుద్రః పార్వతీపతిః పురాణేషు ప్రసిద్ధః — పార్వతీపతియగు ఏ రుద్రుడు పురాణేతిహాసములయందు బహువిధములగు స్తుతి వాక్యములచే ప్రతిపాదితుడై ధ్యేయరూపముగ భక్తుల మనోగోచరుడై ప్రసిద్ధి నొందెనో స ఏవ రుద్రః — ఆ రుద్రమూర్తియే జీవరూపమున సర్వ శరీరముల యందు ప్రవేశించి యుండెను. తస్మైరుద్రాయ — సర్వస్వరూపుడగు యా రుద్రునికొరకు నమః — అస్తు : అగుగాక.

భావము.—ప్రకృతిపురుషుల మధ్యయందు జడాత్మకమగు ప్రకృతిని వదలి చిత్స్వరూపుడగు పురుషుడు భక్తానుగ్రహముకొరకు రుద్రస్వరూపముచే భాసించుచున్నాడు. ఆ కారణముచే "సః పురుషః రుద్రః సన్మహః"— "సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్" ఈ విధములగు వాక్యములచే ప్రతిపాద్యుడును, అబాధిత సద్రూప తేజోమయుడును, అఖండానంద స్వరూపుడగు యా రుద్రుడు మా నమస్కార పరంపరచే ప్రసన్నుడగుగాక యని.

మరియొక వాక్యము—

"విశ్వంభూతం భువనం చిత్రం బహుధా జాతంజాయ
మానంచయత్ । సర్వోహ్యేష రుద్ర స్తస్మై రుద్రాయ
నమో అస్తు"

అర్థము:—యచ్చ జడం విశ్వం అస్తి; యచ్చ భూతంచేతనం ప్రాణి జాతం అస్తి జడము అచేతనమగు ప్రపంచము, చేతనమగు ప్రాణి సమూహాత్మకమగు ప్రపంచము ఏదికలదో ఏవంచిత్రం — ఈవిధమగుచేతనాచేతనమగు చిత్రమైన జగమున బహుధా. జాతం జాయమానంచయత్ — పూర్వమున పలువిధముల పుట్టినదియు, ప్రస్తుతము పుట్టుచున్నదియువగు దృశ్యమానమగు ఈ సకల ప్రపంచము రుద్రుని స్వరూపమే యగుచున్నది. ఈ పరమేశ్వరునికంటె వేరగు వాస్తవమగు ప్రపంచము నిరూపించుటకు శక్యముగాదు. అట్టి సకల చరాచర స్వరూపుడగు పరమేశ్వరుని గురించి అనేకములగు నమస్కారములను మేము చేయుచున్నామని భావము.

ఈ విషయమునే శ్రీ ఆచార్యులవారు దక్షిణామూర్తి స్తోత్రమున చక్కగ నిరూపించి యున్నారు.

శ్లో॥ భూరంభాంస్యనలోఽనిలోఽంబరమహర్నాథోహిమాంశుః పుమాన్
ఇత్యాభాతిచరాచరాత్మకమిదంయస్యైవ మూర్త్యష్టకమ్,
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభోః
తస్మై శ్రీ గురుమూర్తయే, నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే॥

అర్థములు:—భూః — భూమి, అంభాంసి — జలము. అనలః — అగ్ని అనిలః — వాయువు అంబరః — ఆకాశము. అహర్నాథః — సూర్యుడు. హిమాంశుః — చంద్రుడు. పుమాన్ — సకలకర్మలకు, విద్యలకు అధికారి యగు మహాపురుషుడును. ఇతి — ఈవిధముగ యస్యైవ— సచ్చిదానంద స్వరూపుడగు ఏ సదాశివునియొక్క మూర్త్యష్టకమ్ విభాతి — ఎనిమిది శరీరములు ప్రకాశించుచున్నవి. ఇతి — ఈవిధముగ విమృశతామ్ — వేద వాక్యములచేతను, గురుప్రసాద లబ్ధమగు మహావాక్యములచేతను పరమేశ్వరుని తత్త్వమును నిరంతరము విచారణ చేయుచున్న మహాపురుషులకు పరస్మాత్ — సర్వకారణమై విభోః — సర్వప్రపంచ స్వరూపుడైయున్న యస్మాత్ — సర్వాధిష్ఠానమైన ఏ పరమేశ్వరునికంటె అన్యత్ — ఇతరమైన —కించిత్ కొంచెమున్ను నవిద్యతే — భాసించుటలేదో అట్టి దక్షిణామూర్తికై నమస్కారము.

భావము:—ఉపాసకుడు ఈవిధముగ వేదవాక్యముల సారాంశమును నిర్ణయించి పాంచభౌతిక శరీరమందభిమానముగల స్వకీయమగు ఆత్మస్వరూపమును అష్టమూర్త్యాత్మకమగు పరమేశ్వరునితో యభిన్నముగ భావన జేసి చివరకు సర్వవ్యాపకమగు సద్వావ తత్త్వమేనని భావనాతిశయమునొంది ఆ పరమేశ్వరుని సాయుజ్యము నొందుచున్నాడు. కనుక పరమేశ్వరుని మహిమను శ్రుతివాక్యములచే విచారణజేసి ధ్యానము జేసినయెడల నిరంతరము సర్వశుభములు సంప్రాప్తములగునని భావము.

---

## ఆరాధ్య ప్రముఖునికి విజయవాడలో ఘనసన్మానము.

వివిధ నాటకరంగములందు ప్రముఖపాత్రలను నిర్వహిస్తూ కళారాధనయందు ప్రశస్తినందిన మహానటుడు శ్రీ శివలెంక బసవయ్య శాస్త్రిగారికి విజయవాడ నగరమునందు అనేక సంస్థలు పురప్రముఖులున్ను గత సెప్టెంబర్ 17 వ తేదీని మహా వైభవముతో సన్మాన మహోత్సవమును జరిపి వారి సర్వతోముఖ ప్రజ్ఞను కొనియాడుచు అనేక సన్మాన పత్రములను సమర్పించిరి. ఆ సందర్భమున శైవమహాపీఠమున్ను పాల్గొని వారికి అభినందనముల నందించెను.

---

## శ్రీ కొరివిల్లి జోగారావుగారి నిర్యాణము

గత అక్టోబరు 27 శుక్రవారము అర్థరాత్రి లింగోద్భవ కాలమునందు విశాఖపట్టణములో శ్రీ లోకారాధ్య కొరివిల్లి జోగారావుగారు ప్రక్కన శివగీత శివకవచేత్యాది పారాయణములు జరుగుచుండగా తాము స్వయముగా శివపంచాక్షరీ మంత్రమును జపించుచు లింగైక్యము నొందిరి. వీరి డెబ్బదియొక్క సంవత్సరముల జీవితములోను చాలాకాలము ఆంధ్రదేశము నందలి అన్ని జిల్లాలయందును ఇంజనీరుగా వ్యవహరించి విరమించుటయే గాక, వస్తుతః శైవాభిమానులై యుండి తత్సాంప్రదాయము లయందు మిగుల నాసక్తిగలిగి యుండెడివారు. ఈ సంవత్సర శైవమహాసభ నైనను తనగృహ ముననందు జరిపించ వలయునని యెంతయో యభిలషించుచుండి తత్పూర్వమే జీవితమునుండి విరమించినందులకు, చాలా విచారించుచు వారి యాత్మకు శాంతి కలుగుగాకయని యాశించుచున్నాము.

---

## శైవ యువకుల క్షేత్ర సందర్శనము

శ్రీ. యమ్. వి. ప్రసాదరావు గారు.

సికిందరాబాద్ నగరమునకు 22 మయిళ్ల దూరములోనున్న బొంతపల్లి యను చిన్న గ్రామమునకు సమీపమున శ్రీవీరభద్రస్వామివారి యాలయము కలదు. ఈదేవళము ప్రాచీనమైనదే కాక చరిత్ర ప్రసిద్ధి గాంచియున్నది. ఎచ్చెచటినుండియో ఈస్వామివారిని సందర్శించి కరుణాకటాక్షు ప్రాప్తులగుటకు ఎందరెందరో ఈ క్షేత్రమును దర్శించుటకలదు. ఇచ్చట శ్రీస్వామివారికి ప్రాతః కాల మధ్యాహ్న సాయంకాల సమయములందు నిత్యపూజలు జరుగును. ముఖ్యముగా వైశాఖ శ్రావణ కార్తికమాసములలో భక్తులు తండోప తండము లుగా వచ్చి స్వామివారిని సేవించెదరు. ఇచ్చట శ్రీ వీరభద్రుని యుగ్రమూర్తి యందురు. అందుచే కాబోలు ఆలయ ప్రాంగణమునుండి గర్భగుడిలోనికి వెళ్లుటకు ప్రక్కగా తోవ కలదు.

జంట నగరములలోనున్న శైవ యువకులు చరిత్ర ప్రసిద్ధి గాంచిన ఈ క్షేత్ర మహిమ తెలిసికొని అందరు కలసి యొక్కసారైనను శ్రీ స్వామివారిని సందర్శించ వలయుననుకొనిరి. ఈ ప్లవ సంవత్సర మార్గశిర బహుళ తదియ [24-12-61] రోజున కలసికట్టుగా వెళ్లి అచ్చట శ్రీ స్వామివారికి శ్రద్ధతో సహస్ర నామార్చన, రుద్రాభిషేకములను చేసితీర్థ ప్రసాదములను స్వీకరించి సాయంకాలము జరుగు శ్రీ దేవుని సేవ దర్బారు చూచి స్వగృహములకు తిరిగి వచ్చిరి.

---

## — గ్రంధావిష్కరణము —

## బ్రహ్మశ్రీ మున్నంగి పున్నయ్యపంతులుగారికి సన్మానము

స్వస్తిశ్రీ మచ్చాంద్రమాన ప్లవనామ సం॥ శ్రావణ బహుళ ౧౩ బృహస్పతి వాసరమున, తెనాలి తాలూకా నందివెలుగు గ్రామములో బ్రహ్మశ్రీ శివలెంక సుబ్బారావు అయ్యవారి గృహమున, వారి యాహ్వానముచే గ్రంథావిష్కరణ మహాసభ జరిగినది. అందు మహోపాధ్యాయ శ్రీ లోకారాధ్య యోగి శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే సంస్కృతభాషయందు రచింపబడిన వేదాంతార్థపరిష్కారతారహారమనుగ్రంథమును శ్రీమున్నంగి పున్నయ్య పంతులుగారాంధ్రీకరించి చేసిన యనువాదగ్రంథమును శ్రీ శివలెంక సుబ్బారావుగారు వెయ్యి రూప్యములను వెచ్చించి ముద్రింపించి నందున దాని యావిష్కరణ మావశ్యక మాయెను.

ఆ సభకు తెనాలి, ఈమని మున్నగు గ్రామములనుండి, బ్రహ్మశ్రీ లోకారాధ్యులగు ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారు (కృష్ణా పత్రిక ఎడిటరు) ముదిగొండ జ్వాలాపతిలింగశాస్త్రిగారు, ఈ విశ్వనాథముగారు, ముదిగొండ శ్రీ అఘోర మల్లికార్జునరావుగారు, ఇవటూరి సానందారాధ్యులుగారు ముదిగొండ కోటయ్యశాస్త్రిగారు మొదలగు పండితు లనేకులు విచ్చేసిరి.

ఆ సభకు నగ్రాసనాధిపతిగా శ్రీ ముదిగొండ సుబ్రహ్మణ్య శర్మగారిని సభ్యులందరేకగ్రీవముగా నెన్నుకొనిరి. వారు అధ్యక్ష ప్రారంభోపన్యాసములను చేసి, అనువాద గ్రంథకర్తలగు శ్రీ మున్నంగి పున్నయ్య పంతులుగారిని మిక్కిలి ప్రశంసించిరి. శైవవాఙ్మయ గ్రంథావళిని ప్రోగుచేసి, యొక గ్రంథభాండాగారమును ఏర్పాటుచేయుట అవశ్యక మనిరి. సభకు విచ్చేసిన తక్కిన శైవ పండితులందరు శ్రీ లింగశాస్త్రిగారినిగూర్చి మాట్లాడి వారిచే రచితమైన, వేదాంతార్థ పరిష్కారతారహార గ్రంథానువాదము విషయములో శ్రమచేసి, రచించిన శ్రీ మున్నంగి పున్నయ పంతులుగారి మేధాశక్తినిగూర్చి పలువిధముల ప్రశంసా వాక్యములను పలికిరి. పున్నయ్య పంతులుగారి గుణగణములను నుగ్గడించుచు వారికిగల అపారమైన మహేశ్వర భక్తిని ప్రశంసించిరి. సభ నాటిదినము రాత్రి 7 గంటలవరకు జరిగినది. చివరకు అధ్యక్షుల అంత్యోపన్యాసముతో సభ ముగిసినది సభకు విచ్చేసిన వారికందరికిని శ్రీ సుబ్బారావు పంతులుగారు అల్పాహారముతోను. ఫలాదుల తోను సత్కరించిరి. అనువాదకర్తలగు శ్రీ మున్నంగి పున్నయ్య పంతులు గారిని నూతన వస్త్రములతోను రు. 116—0—0 రూప్యముల సన్మానముతోను శ్రీ సుబ్బారావుగారు బహూకరించిరి.

సభకు వచ్చినవారి శ్రమను అభినందించుచు శ్రీ సుబ్బారావుగారిచ్చిన వందన సమర్పణతో సభ ముగిసినది.

---

## శైవ మహాపీఠ భవనము

శైవ మహాపీఠము వారిచేత బహుప్రయాసతో విజయవాడయందు నిర్మింపబడిన భవనము 27—11—1961 వ తేదీ లోపల కూల్చి వేయు నట్లు గామునిసిపాలిటీ వారిచేత ఇవ్వబడిన నోటీసునకై శ్రీ శైవ మహా పీఠ పక్షమున అత్యావసరముగా దాఖలు కాబడిన రిట్ పిటిషన్‌ను పురస్కరించుకొని ప్రస్తుత మట్లు జరుగకుండునట్లుగా హైకోర్టువారు ఉత్తరువును జారీచేసిరి.

(టైటిల్ 2 వ పేజీ తరువాయి)

ఇష్టలింగస్వరూపమునగు శివునియందు సుషుప్తినివలె శివపూజానమయమున నిమగ్నత ననుభవించువాడను శివస్వరూపుడనగుటయును గాన-అణువుకన్న నణువు నగుచున్నాను. (అనగా విశాలప్రపంచమున సమస్తమునకన్న చిన్న రూపము గలవాడు జీవాత్మయనియు జీవాత్మలో ప్రవేశించి ప్రేరేపించుటకు మిక్కిలి అణుస్వరూపమును పరమాత్మ పొందుననియు వివరము)

ఆలాగుననే గొప్పదియగు విచిత్రమైన ఈ జగమునై యున్నాను. పూర్వముకంటె పూర్వమునందుండువాడనగుటచే పురాతనుడను. పరిపూర్ణుడ నగుటచే పురుషుడను, చేతనాచేతనములను శాసించువాడనగుటచేత నీశ్వరుం డను. సర్వాతీతమగు హిరణ్మయ స్వరూపము గలవాడను. ఇట్టి శివరూపమును తానుగా భావించు జీవాత్మ ప్రారబ్ధాంతమున శివరూపముగలవాడై శివానంద మును గోల జాలునని భావము.

శ్లో॥ "పృథగాత్మానం ప్రేరితారం చ మత్వా—జుష్టస్తతస్తేనామృతత్వమేతి"

తాను ప్రేరేపింపబడు జీవాత్మయనియు, తనను ప్రేరేపించువాడు పరమాత్మయనియు ఇవ్విధము జీవేశ్వరులు భిన్నులని భావించునెడ పరమాత్మచేత ననుగ్రహింపబడినవాడై ముక్తుడగును.

పై మంత్రమునందు జీవేశ్వరాభేదభావన యీమంత్రమున భేదభావన యెట్లు పొసగుననగా? వస్తుతః జీవేశ్వరులకు భేదమేగాని యభేదమెప్పుడును లేదు. ఉపాసనాకాలమున మాత్రము భేదభేదమును భావింపవలెనని పెద్దలు విధించియున్నారు. అందువలననే పై మంత్రము "శివరూప మస్మి" యని విశదీకరించినది.

అద్దానింబట్టి జగన్మిథ్యావాదము ప్రామాణికము కాదని గ్రహింప నగును.



SAIVAMATA PRAKASIKA R. No. 5752/61

# శైవమత ప్రకాశిక చందా వివరములు.

సంపాదకులు

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రూ॥ 116-00 |
| రాజ పోషకులు | 50-00 |
| ప్రధాన పోషకులు | 25-00 |
| పోషకులు | 10-00 |
| అభిమానులు | 5-00 |
| చందాదారులు | 3-00 |
| విడిప్రతిక | 0-25 |

## 130, వ శైవ గణార్చనా మహోత్సవము

గతకార్తికమాసము నెలరోజులున్నూ, శ్రీ లోకారాధ్య మల్లికార్జున పండితారాధ్యుల గౌతమ వీరభద్ర అయ్యవారిచే భీమవరమున నెలకొనిన శ్రీ పార్వతీ సమేత భీమేశ్వరాలయము నందు. ఏకాదశరుద్రాభిషేక శివ సహస్ర లలితా సహస్రనామ కుంకుమార్చనలు మహావైభవముగా జరుపబడెను. ఈసందర్భమున ప్రతినిత్యము నిర్మల వాస్తవ్యులు శ్రీకంఠ విద్యాభూషణ నిర్మల శంకరశాస్త్రి గారిచేత నీలకంఠ భాష్య ప్రవచనమున్ను, బందరు వాస్తవ్యులు శ్రీ ఇవటూరి సానందారాధ్యులు గారిచేత శైవమత సిద్ధాంతోపన్యాసములును, జగ్గయ్యపేట వాస్తవ్యులు శ్రీ ములుగు సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే శైవపురాణ కాలక్షేపములున్ను. నందివెలుగు శ్రీ శివలెంక సుబ్బయ్య అయ్యవారిచే శివాద్వైత వ్యాసావళి పఠనమున్ను జన రంజకముగా జరుపబడినవని శ్రీ పొన్నా సత్యనారాయణమూర్తి గారు పంపిన వార్తను తెలుపుటకు సంతసించుచున్నాము.

కృష్ణాపత్రిక ప్రెస్, జాంబాగ్ రోడ్, హైదరాబాదు - (ఆం. ప్ర.)

# శైవమత ప్రకాశిక

పబ్లిషరు :
టీపేట చిదంబర శాస్త్రి

శ్రీ శైవ మహాపీఠము
1-బి. పద్మారావునగరు, సికింద్రాబాదు.

# విషయసూచిక





# శైవమత ప్రకాశిక

శ్రీ శైవ మహాపీఠ పక్షమున ప్రచురింపబడు

సచిత్ర మాసపత్రిక

సంపాదకులు - కందుకూరి వీరబసవరాజు

| సంపుటము ౧ | 4—6—62 | సంచిక ౧౦ |
| --- | --- | --- |

శ్లో॥ యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాత్యేవం
పుణ్యస్య కర్మణో దూరాద్గంధో వాతి. —తైత్తిరీయోపనిషత్తు.

చక్కగా వికసించిన పుష్పములతోకూడిన చంపా పాటలాది వృక్షములయొక్క సుగంధము దూరముగా వ్యాపించినటులనే సత్కర్మయొక్క నిర్మలత లోకాంతరములను వ్యాపించుచున్నది

## మతము

సకల ప్రమాణములలోని నిజము నెఱిగి లోకహితము నభిలషించిన సత్పురుషులు శాస్త్రసమ్మతముగా నిర్మించినదే మతమని చెప్పవలసి యున్నది. ఇట్లనుటచేత సర్వజ్ఞులైన మహాత్ములు పరమ పవిత్రుడైన మానవునియొక్క హితము గోరినవారై చేసిన కట్టుడులనే మతమని నిర్వచింపవచ్చును. అట్టి మతమును నిర్ణయించినవారు సర్వజ్ఞులగుటచేత నందు నజ్ఞానదుష్టత్వము కలదనుటకు వీలులేదు. మానవుని హితమునకే యేర్పరచిన దగుటచేత నిందు నైహికాముష్మిక హితము కలదని చెప్ప వచ్చును.

ఇట్టి మతము నానాటికి విజృంభించుచు మానవునియొక్క యభిరుచిని పురస్కరించుకొని శైవ వైష్ణవ స్మార్తాది భేదములచేత నానా రూపముల శాఖోపశాఖలచేత జగద్వ్యాప్తి నందినది. ఇందు ఆచార వ్యవహారములనుబట్టి శాస్త్రప్రమాణము ననుసరించియు నిష్కల్మష హృదయముతో పరామర్శించి చూచిన యెడల శైవమతము తక్కుంగల మతములకంటె పురాతనమైనదని చెప్పవచ్చును. ఆదిశంకరాచార్యులు

దేశసంక్షోభము నరికట్టుటకై దిగ్విజయము సాగించిననాడు శైవమతమే దేశవ్యాప్తముగా నున్నట్లు తెలియుచున్నది. ఇంతియేగాక దాని యందలి విశిష్ట సంప్రదాయములకు ముగ్ధులైనందుననే యాచార్యులు దేశకల్యాణదృష్ట్యా బహువిధ మతస్థాపకులయ్యు తానుమాత్రము శివోపాసనారతుడై శైవాభిమాని యయ్యెను. మరియు నుద్భట మల్లికార్జున పండితాది మతాచార్యులును ఆ యా కాలములయందవతరించి శైవమతము స్వాహంకారులచేత ప్రక్షీణింపజేయుబడుటను నిరోధించి, తిరిగి దాని మాహాత్మ్యమును విజృంభింపజేసిరి. కాని కాలప్రగతి దురూహ్యము. ప్రచండ కిరణపుంజముచేత జగత్తునకెల్ల వెలుగు నిచ్చిన సూర్యభగవానుడు కాలవినిమయమునకు కట్టుబడి కొంతసేపటికి మాటు మణిగినటులనే సకలవేద ప్రతిపాదితమై, సర్వమహర్షి సమ్మతమైన శైవమతము దురభిమానులైన స్వదేశీయులచేతనేమి, తత్వదృష్టి కలుగజాలని విదేశీయుల సంపర్కమువల్లనేమి నానాటికి క్షీణింపసాగెను మరియు యుగదోషమువలన మతధర్మములయందే విశ్వాసము క్షీణించిపోయెను. విషయవాంఛ ప్రబలమై చిత్తశుద్ధి నశించెను. బాహ్యాడంబరమాత్ర సాధకములు రేకెత్తి కామాదులు జనచిత్తంబుల నాక్రమించెను. మతభేదము కులభేదము చివరకు వ్యక్తిభేదముకూడ నశించిపోయి అన్యోన్య కలహమునకు దారియగుచుండెను. ఇట్టియెడ బహుజన్మగత పుణ్యార్జనంబున జేసి లోకగురుత్వమును వహింపజాలిన మహోన్నత ధర్మవిలసితమైన శైవమతమునందు జన్మగాంచిన నేటిప్రతి శైవుడును తనయొక్క విశిష్టస్థానమును పరామర్శించుకొని తాను రక్షితుడగుటయేగాక జగద్రక్షణమునకున్ను కంకణము కట్టుకొనుట ధర్మము.



## రివరెండ్ సి. గూడి ప్రవచనం

### శైవ సిద్ధాంతము అతి ప్రాచీనమైనది

సిద్ధాంతం దృష్ట్యాగాని, అనుష్ఠానం దృష్ట్యాగాని శైవమతం ఉత్కృష్టమైనది. భారతీయ సాంస్కృతిక' విజ్ఞాన ఔన్నత్యానికి ఆ సిద్ధాంతము ప్రతిరూపము

# రసో వై సః

శతావధాని, జ్యోతిర్విద్యా విశారదః
శ్రీ ముదిగొండ జ్వాలాపతి లింగశాస్త్రి

శ్లో॥ శైవాచార్యాశ్శివపదపరాస్సంఖ్యయా ద్వాదశాఖ్యాః।
జాతం త్యేతే శివరసమయ స్వానుభూతిం విభూతిం।
శ్రీ శ్రీకంఠశ్శివరస లసత్సూత్ర భాష్యం విరచ్య
శ్రీకంఠ స్యానుభవ రస సంపూర్ణ వార్ధిం దదౌ నః॥

శ్లో॥ సంభోగః కిం ప్రియమధు తమో విప్రలంభశ్చ కింవా।
శృంగారోయం కృతకృతక తద్వైహ భేదైక్య ధర్మః।
వక్తుం కోవా ప్రభవతి పృథక్సంశ్లిష్ట ధర్మార్హ హేతూన్।
స్వార్ధాంగ శ్రీకలిత లలితం దంపతీత్వం హిలోకే॥

శ్లో॥ వామే భాగే లలితశిరసః। పుష్పమాలావిలాసః।
భాగేన్యస్మిన్ కిసలయుల సత్కిం జటాజూటశోభా।
పుంస్త్రీ ధర్మ ప్రచలితతనౌ శీర్షలింగద్వయశ్రీః।
పర్యాప్త శ్రీకలిత లలితం దంపతీత్వం కిమేతత్।

శ్లో॥ ఏకం నేత్రం లలితకుముదం। కించ తస్యైవ బంధుః।
శ్చాన్యం నేత్రంవిల సదరుణం పంకజం తస్యబంధుః
మధ్యే వహ్నిర్నయనము భయోశ్శిత తారాగతాఖ్యా
మర్ధోస్మి లల్లలిత మధురం దంపతీత్వం కి మన్యత్॥

శ్లో॥ కస్తూరీ కృత్కుటిల తిలకం। సుందరాస్యార్ధభాగే।
భాగార్ధాస్యే విలసతి లసద్భూతితిర్యక్త్రిపుండ్రః
అంకశ్చంద్రం శ్రుతికృతవిధి శ్చార్కబింబం విధత్తే।
నిత్యజ్యోత్స్నాతప విలసితం దంపతీత్వం మహాత్మ్యం॥

శ్లో॥ నాసాభూషా కనకమణి రుగ్వామగండస్థలశ్రీః।
నాసార్ధా ధోసితకుటిల రుక్శ్మశ్రు గండస్థలశ్రీః।
నిశ్వాస స్వాంతర్జనిత నిగమాలంకృతి శ్రీప్రదాత్రీ॥
సర్వార్థ శ్రీలలితలలితం దంపతీత్వం విమాత్మం॥

శ్లో॥ వాణీలక్ష్మి ప్రముఖవనితా చిత్కళా బోధకత్వం।
బ్రహ్మవిష్ణు ప్రముఖ సురరాట్ జ్ఞాన సద్బోధకత్వం।
యస్మిన్ వక్త్రే ప్రచలతి సదా రాగ వైరాగ్య యుగ్మం॥
తద్విజ్ఞాన క్రమపరిచితం దంపతీత్వం విగణ్యం॥

శ్లో॥ గ్రీవార్థోద్యన్మలయజలసద్గంధయుగ్గంధసారం।
అన్యార్థే శ్రీఘనపదయుతం। విస్తృతం కాలకూటం!
సంభోగాంతః ప్రణయ కలహే తిక్తగర్భాంతరస్థ
స్స్వాదుత్వస్యోన్నతి విలసితం దంపతీత్వం విమృశ్యం॥

శ్లో॥ ఏకోబాహుః కనకవలయాన్ కంచుకం భాతి ధృత్వా।
ఏకోబాహుర్మణియుత శిరస్సర్పభూషాశ్చ ధృత్వా!
గణ్యాగణ్య ప్రకృతివిషయే। దృష్టిభేదైరలక్ష్యః।
స్యాదిత్యుక్తం! వదను విహితం దంపతీత్వం విలక్ష్యం॥

శ్లో॥ ముక్తాహారా అజగరవరా కంఠపార్శ్వద్వయోస్తు।
తూష్ణార్ధారత్వ స్ఫురణ రుచిరాలంబమానా దధస్తాత్।
వక్షస్స్వర్ణాంచల లలిత దివ్యోత్తరీ యాజినస్థాః
ప్రత్యక్శోభా యుగ విలసితం। దంపతీత్వం ప్రహాస్యం॥

శ్లో॥ ఊహాగమ్యం గగనసదృశం। వామమధ్యం చిదభ్రం।
తస్యాధారం తదనుభృదపి వ్యాపకం తద్విశిష్టం।
ముక్తాకాంచీ దృఢకుశల సద్రజ్జుబద్ధ పృథక్త్వం।
యస్మిన్ భాతి ప్రకృతి గుణితం। దంపతీత్వం కిమూహ్యం॥

శ్లో॥ వేదాంతేషు ప్రణవమితి వాకించ చిద్వ్యాపిసద్వా।
యోంయాయంయావితి మునివరాస్తే శివావాస్తువంతి।
గుహ్యాద్గుహ్యం సకల జగతా మాద్యమజ్ఞేయ మన్యత్।
లక్ష్యాలక్ష్యం నిరవధిసుఖం దంపతీత్వం కిముచ్చైః॥

శ్లో॥ వామేపాదే మణిగణల సత్స్వర్ణమంజీరరావః।
పాదేన్యస్మిన్ మణిరుచిలసన్నాగభూషావిభావః।
మందామందద్వయ పదగతి ప్రస్ఫుటాభేదభేదః।
జ్ఞేయాజ్ఞేయస్వ సుఖహృదయా దంపతీత్వం విభావ్యం॥

శ్లో॥ శృంగారాఖ్యో గిరివర సుతాదేహజన్యో రసోయం।
పాదాంగుష్ఠ ప్రభృతి శిరసోలక్ష్యతే లక్షణాఢ్యః
ఇత్యుక్తశ్చే జ్జగతివదతాం। దోష ఏకోమహాన్స్యాత్।
తస్మాచ్ఛంభో స్మరణ మసకృన్నిశ్చితం దోషశాంత్యై॥

శ్లో॥ చిచ్ఛక్తి శ్రీరసమయవపు శ్శంకరశ్చారుమూర్తిః
తస్యాభావే ప్రకృతిరబలా నిష్కళా సహ్యమానా।
సాశక్తిస్స్యాద్ధిమగిరి సుతా తస్యతస్యాశ్చయోగః।
శృంగారాఖ్యోరస ఇతిరసోవైస ఇత్యుచ్యతేహి॥

శ్లో॥ యచ్ఛృంగారః ప్రకృతివిష యోద్భూత ఇత్యుచ్యతేసః।
నష్టస్స్యాదిత్యనుభవమతి శ్శాశ్వతోయం రసోహి।
శంభోర్యస్యాశ్శ్రని చిరతరా భక్తిరానందరూపా
శృంగారస్స్యాత్తదుభయ సమైక్యానుభూతిస్థితేయం॥

శ్లో॥ ఆత్మన్యేవాత్మనిరమత ఇత్యుచ్యతే వేదసూక్తిః।
తస్యాంసత్యం కిముత సరసోజ్ఞాయతే షట్స్థలజ్ఞైః।
సర్వాన్ కామాన్ స పశుపతి నాయుక్తి ఏవాశ్నుతేపత।
చేష్టాపూర్త్యాధిక నిజశివైక్యస్థలాఖ్యార్చనేన॥

శ్లో॥ స్వస్యాపాంగ ప్రణయలలితా, లోలశీలాంకటాక్షాన్।
ద్రష్టుంవాంఛా విరహిత ఫలాలోక కళ్యాణహేతుః।
అన్యత్కింవా ప్రచలలిత తయోస్స్వార్థమేవం జగత్యాః।
క్షేమజ్ఞాన ప్రదమివ భవేద్రస్యతే యోరసస్సః॥

శ్లో॥ ఏకత్రైకః ప్రచలతిరసో న్యత్రశస్యావిరోధే
స్సర్వత్రైవం విలసతి నచేత్ తత్రసాభాసఏవ।
శంభోర్యోగే విషమ విషయేప్యత్ర సర్వత్రపూర్ణః।
శృంగారాఖ్యోరస ఇతిమహాన్ సత్యగర్భోరసజ్ఞైః॥

శ్లో॥ యోబ్రహ్మజ్ఞస్సఖలు రసవిద్బ్రహ్మనామేశ్వరస్సః।
వేదజ్ఞానాం। శివ ఇతిమతంతత్స్వరూపద్వయంహి।
జ్ఞానజ్ఞేయం భవతి విదుషాం సద్గుణం చైకమన్యత్।
గౌర్యాయుక్తం సగుణముదితం యద్ధి తస్మాద్రసశ్చ॥

శ్లో॥ యఃకోవాపిస్వ గురుకరుణాలబ్ధ లింగాంగసంవి
త్పూర్ణో భూత్వా ప్రతినిమిషకృత్ షట్స్థలార్చానుభావః।
లింగాంగీ సప్రమదితమనా జ్ఞాతుమేకోరసత్వం
శంభోర్ధత్తః రసమయ తనుర్నిత్య సాయుజ్యమేతి॥



# "కుబేరుని యైశ్వర్యము"

బి. చిదంబరశాస్త్రి

"మహాదేవే మహానందే మహాకారుణి కోత్తమే
ప్రసన్నే సతి దేవేశే పతితోపి విముచ్యతే"

ప్రపంచము యొక్క నిర్మాణ పరిపాలనాదుల కార్యనిర్వహణమునకై బ్రహ్మ విష్ణ్వాదులను నియమించిన మహాదేవుడు నిరంతర నిరవచ్ఛిన్న మహానంద స్వరూపుడై యట్టి యానందమున ననుభవించుటకు నభిలషించు దివ్యోపాసనారతునకు శాశ్వత సుఖమును చేకూర్చు మహా దయాసముద్రుడు. కావుననే అజ్ఞానవిలసిత పాప పంకిలమున మగ్నుడైన పతితుడున్ను అట్టి మహేశ్వరుని ప్రసన్నుని జేసికొని తరించుచున్నాడు

అది పాద్మకల్పము. దానికి అవసాన సమయము ఆసన్నమగుటచేత సోమయాజి ఇంట పరమ భ్రష్టుడు పుట్టి వంశ నాశనమునకు హేతువగు చుండెను. సకల ధర్మాచార పరాయణుని గర్భమున దురాచార రతుడు జనించి సర్వనాశకు డగుచుండెను. అగ్రపర్గమునకు జెందిన వారెవరో, పూజ్యులెవరో శిష్టాచారమన నెయ్యదియో తెలియని నాటి ప్రజ తనకు తానే భగవంతుడై యణు సమ్మిశ్రమున నేర్పడిన శరీరమునకు నొకడు పెద్దమరి యొకడు చిన్న యన్న పూజ్య పూజక భావమున చరించుట పొరపాటనియు తొల్లిటి డాంబికులయిన మహర్షులు సంకుచిత భావముకలవారై మానవుని స్వేచ్ఛను అరికట్టుటకు మత ధర్మములను కొన్ని కట్టడులను పర్వరచియుండ అట్టి రహస్యమును భేదించగల మేధావంతులమగు మనము అట్టి పాత కాలపు వాసనను త్రోసిరాజనుట కర్తవ్యమని బోధించు చుండెను.

సంప్రదాయానభిజ్ఞుల సంపర్కముల వలన జీవేశ్వరుల భేదము నశించి పోయి స్వాహంకారము ప్రబలమగుచుండెను. స్వార్థపరుల యహమహమికచేత మానవుడు మానవుని రక్తము త్రావ జూచుచుండెను. బలవంతుడు విశ్వాంత రాళము ననగద్రొక్కుదునని తపించుచుండ స్వాహంకారి గోళాంత రాళముల నంత మొందింతునని భ్రమించుచుండెను. జ్యోతియందలి సహజ ప్రభావమును తెలియనేరక దానినే దిగమ్రింగుటకు సాహసించిన శలభంబు మాదిరి దివ్య తేజస్సునందలి విశుద్ధ స్వభావమున స్వరూప నాశము జూచుటకు యత్నించు నా పాద్మ కల్పము ఎప్పుడే రూపమున సర్వ ధ్వంసము కానుండెనో తెలియ రాకుండెను. యుగాంతమున బహు నాశనము కల్పాంతమున సర్వ నాశనమును కలుగుచుండులయే కదా సృష్టి స్వభావము.

ఇట్లు పుణ్యా పాప విచక్షణతా రహితమైన నాటి మానవత్వము పశుత్వము కంటె అభిన్నమై యుండ బ్రహ్మ మానస పుత్రులైన పులస్త్యాది మహర్షులు కల్ప విపరిణామమును శంకించినవారై ప్రళయ కాల వికాస మానమగు కాశికానగరమున ప్రవేశించి సర్వజ్ఞుడైన సదా శివుని ఉపాసించువారై ప్రపంచమునకు దూరులై యుండిరి. మిగిలిన యే కొలది పుణ్యావంతులు ప్రేళ్ళమీద లెక్కింపదగినవారై ఆ నాలుగు దివసములు ప్రపంచము నిలుచుటకు మూల కారణులై యుండిరి.

నాడు కాంపిల్య నగరము ముఖ్యముగా నెన్నదగినదై యుండెను: అందు ప్రజా పాలకుడైన మహారాజు పూర్వ పుణ్య వాసనాయోగమున సన్మార్గరతుడై సత్పురుష సాహసము కలిగి విశ్వ సౌభాగ్యము నభిలషించుచు భూభారమును వహించియున్నను ఆతని రాజ్యము మేకవన్నె పులులై చరించు బహుళ పాప జనులచేత సంకీర్ణమై యుండెను

రాజ బహు మాన్యుడైన యజ్ఞదత్తుడన్న సోమయాజి మాత్రము అట్లుగాక నాడు చెలరేగుతున్న దుమారమును తొలగించుటకు దీక్షితుడై యుండెను. సాంగములైన వేదములన్ని యాతని కంఠ పాఠములు. సుసూక్ష్మములైన వేదార్థములను అవలీలగా సమన్వయించగల సమర్థుడు. అంతియె గాక అట్టి వేదములయందు నిర్వచింపబడిన సకల ధర్మములను సర్వదా నెరవేర్చుటయందాసక్తుడైయుండి, ఇతరులను తన్మార్గరతులగునటుల యత్నించు ధన్యజీవి. కనుకనే నాటి ప్రజా పాలకుడైన రాజునకు కడు నమ్మినవాడై వంశ క్రమంబున సంప్రాప్తమైన మహదైశ్వర్యమున తులదూగుచు నిస్వార్థముగా లోక సేవా పరాయణుడై యుండ ఆతని వైశిష్ట్యమును సత్పురుషులు వేనోళ్ళ కొనియాడుచుండిరి.

నిత్యాగ్నిహోత్రియగు నాతని గృహంబున, నిండిన యతిథులు బంధువర్గంబునకు తీసిపోనివారై గౌరవింపబడుచుండ సాంగ వేదాధ్యయన పరులగు శిష్యగణంబుల కూటములచేత నాతని సదనము నిత్య కళ్యాణముగ గన్పట్టుచుండును. ఇటు సదాచారములయందును అటు రాజకీయములయందును నిమగ్నుడైన యజ్ఞదత్త దీక్షితునకు పూర్వ పుణ్య వశమున జేసి అన్నిం

ట్టను తనకు తగిన మన్నిక గలదైన దీక్షితాయని యను బ్రాహ్మణి ధర్మనిరతయై భార్యగా సమకూడి యుండ గృహ కార్య నిర్వహణ మందు నిమిత్త మాత్ర బాధ్యుడై కాలము గడుపుచుండెను.

ఆ దంపతులకు కర్మానుబంధమున జేసి బహు కాలమునకు ఒకే యొక పుత్రుడు జన్మించెను. వాడు రూప సంపదయందు "చంద్రబింబమును ధిక్కరించుచుండ లోకపూజ్యుడు కావలయునన్న యాశతో గుణనిధి యని నామకరణము చేసి వయఃక్రమంబున అన్నప్రాశన, అక్షరాభ్యాసాదికములను నెరవేర్చుచు నెనిమిదవ వత్సరము రాగ నుపనయన సంస్కారము నెరపి అధ్యయనమునకు నర్హుడై యుండ కుమారుని బహు కార్యనిమగ్నుడైన దీక్షితుడు సుశిక్షితుడగు నొక్క శిష్యునకు నప్పగించి సకల విద్యల నభ్యసించునట్లొనర్చెను

మాతృ హృదయము వెన్నవలె కడు సున్నితమైనది. పుత్ర సంకలితమైన వేదనాగ్నికణము యెంతమాత్రము సోకినను నీరువలె కరిగిపోవుచుండును. అగ్ని ప్రజ్వలమునకు ఉపాధులగు కష్టాదుల యందలి శుద్ధాశుద్ధములతో వెన్నకు నిమిత్తము లేనటులనే మాతృ హృదయమునకు పుత్ర సంసర్గమగు వేదనయందలి పవిత్రాపవిత్రములతో నిమిత్తము లేదు. కనుకనే మాతృదేవి పుత్ర సంగతములైన హృదయాభిలాషలు ప్రజ్వలించుటకు సహించదు.

దీక్షితాయనికి గుణనిధి ఏకైక పుత్రుడై యుండ ఏ క్షణమున ఏద్ది వలసినను చేకూర్చుచు ఆతడు సర్వకాలములయందును సంతుష్టుడై యుండుటకు నుత్సహించుచుండెను. నాటి దుష్టమార్గరతులైన మానవులకు తమ విశృంఖల విహారమునందు అడ్డు తగులుచున్న యజ్ఞదత్తుడు కంటకుడై యుండ నాతనిని ఏమి చేయుటకును చాలక సమయమున వంచించుటకు కనిపెట్టియుండిరి. దీక్షితాయని కుమారునియందు బద్ధానురాగిణియై యుండ స్వభావ పేశలుడైన బాలకుడగు గుణనిధిని చెడుమార్గము బట్టించుట సాధనముగ నెంచుకొనిరి. అందుకు దుష్టులగు కొందరు యువకులను ప్రోత్సహించి యాతని ప్రియ మిత్రులగు నట్లొనర్చిరి.

[సశేషము]

# శైవ యువకుల కర్తవ్యము

ఈ అణుయుగంలో కార్యసాధనకు సంఘీభావం, సమష్టికృషి అవసరం. నేటి యువకులలో-ముఖ్యంగా శైవయువకులలో-సమైక్యతా భావం లోపించిందని "అనుభవైక వేద్యము." ఆ లోపాన్ని తొలగించి శైవయువకులందరిని సమీకరించి సమాజాభివృద్ధికై సమష్టికృషి సాగించే సత్సంకల్పంతో రచయిత యీ వ్యాసంలో కొన్ని ఆచరణ యోగ్యమైన సూచనలు చేశారు. సహృదయులు గ్రహింతురుగాక. —సం.

మనము శైవమత సంప్రదాయులమని చెప్పుకొనుటకు గర్వపడవలెను. ప్రపంచములోని మతములలోకెల్ల హిందూమతము ఉత్కృష్టమైనది. అందునూ శైవము అతి ప్రాచీనమైనదే కాక, శాస్త్రీయమై యుండుటచే, పాశ్చాత్య వేదాంత పండితులను దిగ్భ్రాంతి చెందించియున్నది.

ఒకనాడు ఎంత ఉత్కృష్టస్థితిలో నున్నదో, ఈనాడు మనమత మంత క్షీణదశలో నున్నది. మత మనగా వెర్రియని పలువురి అభిప్రాయము. ప్రస్తుత ప్రకృతిశాస్త్రవేత్తలు, ప్రకృతియందు గల రహస్యములనెల్ల తమ నిశిత శాస్త్ర పరిశోధనల వలన ఎట్లు తెలుసుకొనగలిగితిమని నమ్ముచున్నారో, తాము తమ పారిశ్రామికాలయములయందు చేయుచున్న కృషివలన తమకు శక్తి, తేజస్సు, అధికముగా చేకూరియున్నవని, తాము సంపాదించిన జ్ఞానమే ప్రకృతిపై యాజమాన్యము వహించుటకు కారణమని ఎట్లు కనుగొనిరో, అట్లే మన ఋషులు మానవుని అంతర నిర్మాణముయొక్క జ్ఞానము పొందుట వలన, జీవిత యాజమాన్యము అధికముగా పొందగలమని, సత్యమును చూడగలమని తెలిపియున్నారు. ప్రకృతి శాస్త్రజ్ఞులు బాహ్య ప్రపంచమును తమ రంగముగా ఎన్నుకొన్నచో, ఋషులు తమ అంతర అనుభవ ప్రపంచములను తమ ప్రత్యేక విమర్శలవలన, తమ పరిశోధనలకు సత్యాన్వేషణారంగముగ ఎన్నుకొనిరి. "ప్రపంచ మనగా నేమి?" యని ప్రకృతి శాస్త్రజ్ఞుల ప్రశ్న అయినచో ఋషుల విచారము "మానవుడనగా నేమి?" అని. ఈ విషయమును శ్రద్ధగా పరిశీలించుచో, మతమనగా పరిపక్వ జీవితము, వ్యక్తిగత యాజమాన్యము పొందగలుగుట, నిరాశతో, నిరుత్సాహముతో శిథిలుడైన మానవుడు, శక్తిమంతుడగు వ్యక్తిగ మారగల రహస్య విధానము—మతమని తేట తెల్లమగును.

శైవ మహా పీఠమను నొక సంస్థ మనకున్నదను విషయము చాలా మందికి తెలిసియున్నదే. ఈ సంస్థ ఉద్దేశ్యములను, మన మత శాఖకు చెందిన నలుమూలలనున్న, పల్లెపురికి వ్యాపింపజేసి, మిణుకు మిణుకు మనుచున్న

సంస్థను సుసంఘటిత పరచుట ఈనాటి శైవయువకుల భుజస్కంధములపై నున్నది అందుకుగాను చేయవలసినకృషి అపారము. సంవత్సరమునకు కొకటి రెండుసార్లు వేదికపైజేరి తర్కించుకొనుటవలన కార్యక్రమము రూపొంద జాలదు. ఇందు ఇప్పటికి శైవయువకులు పొందిన అనుభవమే తార్కాణము.

ప్రతి శైవయువకుడు ఈనాటి బాహ్య సంఘ వ్యవస్థలో ఒక స్థానము సంపాదించుకొనవలెనన్న ఒక నిర్మాణాత్మక కార్యక్రమము, దృఢసంకల్పము కలిగి ఉండవలసిన అవసరము ఎంతయో నున్నది. అన్నిటికన్న ముఖ్యమైనది ఒకరినొకరు అర్థముచేసుకొనుట ప్రఖ్యాత అమెరికన్ రచయిత ఎమర్సన్ యిలా అన్నారు. "ప్రతి వ్యక్తిలోనూ ఏదో ఒక విశేషమున్నది. ఆ విశేషాన్ని అవగతం చేసుకొనుటకు ఆ వ్యక్తిని "ఆరాధించాలి.''

ఆ వాక్యములోని సత్యము గ్రహించి ఇతరులలోని మంచిని గ్రహించు దృక్పథమును అవలంబించుట అవసరము.

ఇతర ప్రదేశములను వదలి ఒక్క హైదరాబాదు, సికింద్రాబాద్, జంట నగరములను తీసుకొన్నచో, గత రెండు నెలలలో దాదాపు 100 మంది మన పీఠమందు సభ్యులుగా చేరియున్నారు ఈ నూతన సభ్యులు కాక, అంతకుముందుగనే సభ్యత్వము పొందినవారు చాలామంది ఉన్నారు. ముఖ్యముగా ఈ 100 మంది నూతన సభ్యులలో ఎక్కువమంది యువకులు, అనేక రంగములలో పనిచేయుచున్నారు.

ఈ నూరుమంది సభ్యులు పదిమందికొక గ్రూపుగా జేరి, వారిలో ఒకరిని గ్రూపులీడరుగా ఎన్నుకొని, ప్రతి ఆదివారము -ఆదివారము ఎక్కువమందికి వీలుగానుండునుగనుక,- ఆ యా గ్రూపు సభ్యులకు అందుబాటులోనున్న, ప్రదేశమందు. నిర్ణీత వేళయందు కలియుచో ఒక కార్యక్రమమును నిర్మించుకోగలరు మనది ఒక రాజకీయపార్టీ కాదు గనుక, పదవులకొరకు ప్రాకులాడు ప్రసక్తియే ఉండదు. సంఘసేవయే ప్రధానోద్దేశ్యముగనుక ఉత్సాహమును ప్రదర్శించు వారే ఈ గ్రూపు లీడర్లుగా నుండగలరని ఆశిద్దాం. అయితే ప్రతివారం ఒక నిర్ణీత వేళయందు కలియుటకు ఆకర్షణీయమైన కార్యక్రమమేముండునని పలువురు సభ్యులు ప్రశ్నించవచ్చు ఉదాహరణకు ఒక గ్రూపు సభ్యులు ఇట్లు చేయగలరు. ఒక ఉత్కృష్ట మత గ్రంథమును ఉ॥ ఈశావాశ్యోపనిషత్తు తీసుకొని పఠన చేయగలరు అందు వివరించిన విషయములు, ఈనాటి పరిస్థితులలో ఎంతవరకు ఆచరణ యోగ్యమో, అందు సత్యాసత్యములను గూర్చి చర్చించగలరు తదుపరి సామూహిక ప్రార్థనము చేయవచ్చు. చివరి అర్థగంటలోని కొలది భాగమును, మన సంస్థ చేయుచున్న పనిని, మన నిత్యజీవితములలో ఎదుర్కొనుచున్న సమస్యలగూర్చి చర్చించవచ్చు. చివరికి ఐదునిమిషములు ధ్యానముతో గడపవచ్చు. ఈ కార్యక్రమము ఉదాహరణ మాత్రము

గానే సూచించ బడినదిగాని, అట్లు చేయవలెనని నిర్బంధంలేదు. ఇట్లు కనీసము వారమున కొకసారి పదిమంది ఒక గ్రూపుగా కలియుటవలన. ఒకరినొకరు అర్థము చేసుకొనుటకు, సఖ్యభావాన్ని పెంపొందించుకొనుటకు, పరస్పర కష్టసుఖాలను అవగాహన చేసుకొనుటకు అవకాశము లభించగలదు.

ప్రతి శైవయువకుడు సంఘములో ఒక స్థానము సంపాదించవలెనన్న అతని అభిరుచుల ననుసరించి అభిలాషకలవారై గమ్యస్థానము చేరువరకు నిరంతర కృషి చేయవలసియున్నది 'యద్ భావం తద్ భవతి' అన్నట్లు, సంకల్పముంటే సాధించలేనిది ఉండదు ఏ రంగములో పరిపూర్ణతను పొందుటకైననూ, విద్యాభ్యాసము ముఖ్యము. ఈ అణుయుగములో ప్రతిది సులభసాధ్యమైపోయినది. ఈ పరిస్థితిలో ప్రతి శైవయువకుడు కొద్దిగనో గొప్పగనో విద్యనభ్యసించి, ఏదో ఒక చిన్న ఉద్యోగమును సంపాదించుకొని సంతృప్తి పడక, ఉన్నత విద్య నభ్యసించి గొప్ప పదవులను అందుకొని, సంఘ సంక్షేమానికి తోడ్పడవలెనను ఆకాంక్షతో కృషిచేయాలి. ఇందుకుగాను మన శైవ మహాపీఠము ఎంతవరకు తోడ్పడగలదన్నదే సమస్య అగుచో దీనిని పరిష్కరించుట సహృదయులు ఉన్న మేరకు అంత కష్టసాధ్యమైన విషయము కాదని తోచును విద్యారంగములో, బీద శైవ విద్యార్థులకు ఇప్పటికి మన పీఠము కొంత సహాయము చేయుచున్నద ముందు ముందు ఆ ఉపకార సదుపాయాలను విస్తరించే అవకాశము లేకపోలేదు. అయితే దీనికి అందరి సహకారం అవసరం, ఉద్యోగము చేయుచున్న ప్రతి వ్యక్తి, తనకు తోచినది తానుగా నెలకింతయని, శైవ యువకుల విద్యాభివృద్ధి నిధి నిమిత్తమై యివ్వవలెను. ఆ విధంగా ప్రోగైనధనముతో బీదశైవవిద్యార్థులకు ఉపకారము చేయివచ్చును.

శ్రీ చాగంటి శంకరశాస్త్రి గారు శైవ మహాపీఠమునకు కార్యదర్శిగా నుండి చేయుచున్న కృషి శ్లాఘనీయము వారు తరచు శైవ యువకులను సమావేశపరచి, వారితో సంస్థ కార్యక్రమ విషయములను చర్చించి, వారి సూచనలను వినుచూ, జంటనగరాలలోని శైవయువకులలో ఉత్సాహోత్తేజాలను ఇనుమడించుటకు తోడ్పడుతున్నారు.

జూన్ 3, 1962న, నూతన సభ్యుల నుద్దేశించి, శైవమహాజనుల సమావేశము కవాడీగూడ, శంకరమఠమందు జరుగనున్నది. ఈ వ్యాసములోని విషయములు సహృదయులైన మిత్రులు విమర్శించి, ఒక నిర్మాణాత్మక కార్యక్రమము త్వరలో రూపొందించగలరని ఆశించుచున్నాను. ఒకవిధముగా, చాలా రోజుల తదుపరి జరుగబోవు ఈ మహాసభ నూతనోద్దేశములకు నూతన సంకల్పములకు నాంది అగుననుటలో సందేహము లేదు.

—"ఒక శైవ యువకుడు".

# శివారాధన

## శ్రీ విశ్వాత్ముల చంద్రమౌళి

ఎముకచాలని వాడంద మే దధీచి.
నల్పబుద్ధులె మేఘవాహనుడు, శిబియు
ధర 'బరోపకారార్థ మిదం శరీర'
మనెడు వాక్యంబు వినవె? సంయమివరేణ్య! (హంరవిలాసము)

ఆకాశమంతా కారుమేఘాలు ఆవరించాయి ఉరుములు... మెఱుపులు... ప్రకృతి అంతా నానాబీభత్సంగా ఉంది. జల్లులతో ప్రారంభమైన వర్షం కురుస్తోంది. వర్షం అంతకంతకు ఎక్కువౌతున్నదేకాని తగ్గే సూచన లెక్కడా కన్పించటంలేదు. దీనికితోడు గాలి విపరీతంగా వీస్తోంది.

అబ్బ! గాలివాన...వడగళ్ళు జలజల రాలుతున్నాయి. తలుపులు టప టప శబ్దం చేస్తున్నాయి. వర్షం కుండపోత పోస్తున్నది ఈ విధంగా ఒకటి కాదు రెండుకాదు ఇరువదిఒక్కదినము లహర్నిశము వర్షం కురుస్తూనే ఉంది. కాంచీపుర వీధులన్నీ జలమయమైనాయి. క్రమేపి వర్షం తగ్గుముఖమై సన్న జల్లు పడుతోంది.

కాంచీపుర వైశ్యవాటికలోని ఒక గృహ ద్వారబంధములు తెరచు కొన్నాయి. ఒక వ్యక్తి పంచె నెగకట్టి వీధిలోనికి బయలుదేరాడు. మోకాలు నీటిలోబడి వీధి చివరనున్న వేశ్యావాటిక ప్రవేశించాడు. ప్రతి యింటి తలుపు తట్టి లోనికి తొంగిచూచి ముందునకు సాగిపోతున్నాడు.

ఎందుకో? ఎవరికోసమో? పాపం! వేశ్యావాటికనంతయు గాలించినాడు.

ఆ వీధి మలుపు తిరిగి ఊరులోని దేవాలయములు చూడబోయినాడు.

పాపము! ఎందుకట్లు తిరుగుచున్నాడోకదా? ఏమో! ఆతని మనస్సు లోని ఆలోచనలు ఎవరికి తెలియగలవు, ఊరు చివరనున్న పాడుబడ్డ గుడి లోనికి దారితీశాడు. చలికి గడగడ వణకుచున్న వృద్ధదంపతులను చూచి, ప్రణమిల్లి, "జంగమదేవరా! మాయింటిలో శివారాధన చేసి మా ఆతిథ్యం స్వీకరించవలసినది." అని ప్రార్థించాడు చిరుతొండడు.

"భక్తా! నీకోరిక తీర్చుటకు మాకభ్యంతరమేమియులేదు. కాని ఒక వ్రతము కలదు. దానిని నీవు సక్రమముగా నిర్వర్తించగల్గినచో నీ ఆతిథ్య మును స్వీకరింతును." అన్నాడు జంగమదేవుడు.

"యోగీశ్వరా! మీ వ్రతమును సంపూర్తిచేయుటకన్న నాకు కల భాగ్య మింకేమున్నది. సంసిద్ధుడను మీ వ్రతమున కుపకరించు వాటిని సెల విండు", అని దీనంగా ప్రార్థించాడు.

"ఓయీ! భక్తాగ్రణీ! నా శివార్చనకు నైవేద్యమిడుటకు నరమాంసము కావలయును."

వ్రతకఠోరనియమబద్ధుడైన చిరుతొండడు కొంచెమైనను జంకక ఆలో చనకు తావియ్యక, వెంటనే "మహాత్మా! అట్లే సిద్ధము చేయుదును."

జంగమదేవుడు వికటముగా నవ్వుచు "ఓయీ! నరమాంసమనగనే ఎందుకును కొరగాని ఏ ముసలి పీనుగనో చంపి వడ్డింతునని తలంచితివా? అట్లు కాదు. శుభలక్షణ సంపన్నుడగు చిన్నారి బాలుడు నా వ్రతమునకు కావ లయును." అని చిరుతొండని ముఖ కవళికలు పరీక్షించసాగాడు.

"దేవా! మీరు కోరినట్లే సర్వశుభలక్షణములు కల్గిన చిన్నారి బాలుని పాకముచేసి మీ శివారాధనకు వడ్డింతును. తమరు దయచేయవలసినది." అని తొణకకుండా ప్రార్థించాడు. చిరుతొండడు.

౨

"ఏమేవ్! నీకొక శుభవార్త!" అన్నాడు చిరుతొండడు వంట యింట్లోకి అడుగుపెడుతున్న భార్య తిరువెంగనాంచితో.

"ఏమిటండీ! ఆ శుభవార్త!" అన్నది ఆతురతతో. "నేడు మనయింట ఒక శివయోగీశ్వరునకు మన చిన్నారి బాలుని పాకము చేసిపెట్టుటకు మాట యిచ్చితిని. ఏమి యిది నీకు వింతగా, శుభవార్తగా లేదా?" అని భార్య జవాబుకొరకు ఎదురుచూడ సాగాడు చిరుతొండడు.

"లేకేమండీ! నిజముగా మన అదృష్టములేనిచో నరమాంసమడుగు శివ యోగి వుండునా? తప్పక ఈతడు మనను పరీక్షింపవచ్చిన ఆ పరమ శివ యోగియే!"

భార్యాభర్త లిరువురు సంతోషంతో పనిమనిషి చందనికను కుమారుని పిలుచుకొని రమ్మని పురమాయించారు.

కుమార సిరియాలుని అభ్యంగము చేయించి సర్వాలంకార భూషితుని చేసినది తల్లి తిరువెంగనాంచి. కుమారునకు యిది అంతయు వింతగాతోచింది.

"తల్లీ! నేడు రోజుటికన్న విపరీతంగా అలంకరిస్తున్నావు. ఎందు కమ్మా?" అని ప్రశ్నించాడు సిరియాలుడు,

"మన యింట నేడు మహోత్సవము నాయనా?" అని సంతోషంతో పల్కింది తల్లీ. "కాంచీపురములో ఎవ్వరికిని లేని మహోత్సవము మనకెక్కడి దమ్మా?"

"తండ్రీ! నేడు ఒక శివయోగికి నిన్ను పాకముచేసి పెట్టుచున్నారము. నీకు విచారములేదుకదా నాయనా?" అన్నదీ కంటనీరు పెట్టుకుంటూ.

"అమ్మా! నాకు సంసారభ్రమ ఏమాత్రము లేదమ్మా? నాకొరకు మీరు విచారింప పనిలేదమ్మా? జంగమ ప్రీత్యర్థమై నా యీ తుచ్ఛ శరీరము వినియోగింపబడుటకన్న ఈ జన్మ మెత్తినందులకు సార్ధకత యింకేమున్నదమ్మా?" అన్నాడు తల్లి కంటినీరు తుడుస్తూ.

## 3

ఇల్లాలు మనస్సులో సహజంగావుండే పుత్రవాత్సల్యాన్ని నెమ్మదిగా దూరంచేసుకోటానికి ప్రయత్నిస్తోంది. జనయిత్రి సిరియాలుని చన్నిచ్చులాగున పరుండబెట్టుకొన్నది. చందనిక వాడిగా నూరిన చిరుకత్తిని అందించింది చిరుతొండడికి

చిరుతొండడు పుత్రునిపైనుండు వాత్సల్యమును వీడి కసాయివానివలె ఒక్క వ్రేటును వేసినాడు. సిరియాలుని శరీరం రెండు ముక్కలైంది. ఉత్తమాంగము దూరమునబడి "పంచాక్షరీ మంత్రపు చివర అక్షరమును పూర్తి చేసి ఆగిపోయింది

ఆహా! లోకమందు వ్రతసిద్ధికై కన్న కుమారుని చంపు పుణ్యాత్ములు కూడా ఉందురుకాబోలు? వారికి పుత్రవాత్సల్య మిసుమంతయు లేనట్లు కనబడుచున్నది. ఎవరైనా చేజేతులా కన్నకుమారుని నాశనముచేసికొనుటకు ప్రయత్నింతురా !

విధి? ఏమిచేయుదురు. తప్పనిసరియైనది. ఇప్పటికి యిరువదిఒక్క దినములనుండి ఉపవాసము. వ్రతసమాప్తికై శివయోగి ఆత్మసంతృప్తికై అట్లు చేయవలసివచ్చినదేకానీ, లేనిచో కన్నకుమారుని నాశనము చేసికొనుటకు యిష్టపడుదురా? ఏది ఎట్లయినను సిరియాలుడు దూరమైనాడు.

సిరియాలుని శరీరమును కరకర తొరగి తునకలుచేసి పచన మొనర్చిరి వివిధ శాకపాకములను, సన్నబియ్యపన్నము, ఆవునెయ్యి. గేదెపెరుగు, ఊర గాయలు. పక్వాన్నములు, కట్టునంజుళ్లు సిద్ధం చేశారు. తిరువెంగనాంచి చందనిక కలిసి.

"శివపూజ కవసరమైనది" అని పతికి తెలియపర్చింది. తిరువెంగనాంచి చిరుతొండడు జంగమవృద్ధులను 'శివపూజకురావలసినదిగా' ఆహ్వానించాడు.

"శివారాధన సంపూర్తిఅయినది" అన్న జంగమదేవుని కేకవిని తిరు వెంగనాంచి శాస్త్రీయంగా వడ్డన ప్రారంభించింది. చిరుతొండడు చేతులు కట్టుకొని "మహాత్మా! నివేదనకానిండు!" అని నమ్రతతో పలికాడు

కనుబొమలు ముడిపడ, పండ్లు పటపట కొరుకుచు, జంగమదేవుడు క్రోధంతో, "ఓరీ! శరీరమంతటికి ఉత్తమమైనది ఉత్తమాంగముకదా? దానిని దాచుకొని తనయుని పై వలపు దక్కించుకొనవచ్చుననియా? పుత్రునిపైనుండు వ్యామోహము విడువలేనివారు మొదట నాకెందులకు మాటయిచ్చిరి. నేటికి నా వ్రతము నిష్ఫలమైనది, నేను గట్టిగా మోసపోతి''నని చేతులు తలకాన్చి విచారంతో చతికిలబడ్డాడు,

భార్యాభర్త లిరువురు భయంచే గద్గదకంఠంతో "మహాత్మా మీరు అన్యథా తలచిన మేమింకేమి చెప్పగలము. శిరస్సు కేశదుష్టమని పచనము చేయలేదు. దానిని దాచుకొని పుత్రవాత్సల్యము తీర్చుకొందమనిన అది ఎన్నినాళ్ళు అట్లుండును. ఇప్పుడు సెలవైనది! కావున పచనమొనర్తుము.''

వెంటనే చందనిక శిరస్సును పచనమొనర్చి తెచ్చి వడ్డనచేసినది. కోరికలు కోరుట. యే శివయోగి పనిగా, తీర్చుట చిరుతొండని పనిగా కన్పట్టుచున్నది.

"భక్తాగ్రేసరా! అతిధి ఆతిథ్యము స్వీకరించునపుడు గృహస్థు సహ పంక్తిన ఉండవలెనని వేదశాస్త్రములు ఘోషించుచున్నవి."

"అట్లేస్వామి" అని వారుకూడా వడ్డించుకొన్నారు.

"అహా! ఇదిఏమి? పంక్తిభోజనమందు పదార్థములు కొన్ని వడ్డించుకొనకుండుట నియమవిరుద్ధము. మీరును మీకుమారుని పాకము వడ్డన చేసికొనుడు ''

"మహాత్మా! శివభక్తులు మాంసాహారము ముట్టరు. ముట్టినను అది రుచించుటెట్లు?''

"చిరుతొండా! పంక్తిన స్వాదుపదార్థములు మీరు తినుటతగదు. అతిధికి మాంసాహారమా? నీకు శాకాహారమా? ఒకే పంక్తిలో అతిథిని విడిచి నీవు నీకు కావలసినవి ఆరగించుటయా? ఇది పాడియే! నాకు ఏతర్కముతో పని లేదు మీరును వడ్డించుకొనుడు.

"సాధ్వీ! మనకు వడ్డనచేయుము శివయోగీశ్వరుడే అనతిచ్చిన మన కేమి లోపము. కానిమ్ము" అన్నాడు భార్యవైపుతిరిగి. వెంటనే భర్త ఆజ్ఞ పాలించింది,

"భక్తా! మరియొక భోజన నియమము కలదు పున్నామ నరకము నుండి రక్షించువాడు పుత్రుడేకదా? అట్టి పుత్రుడు లేనిది భుజింపరాదు. ఉత్తములు పుత్రునియింట భోజనము చేయరు. నీపుత్రుని బంతికి పిలువుము." అని ఆనతిచ్చాడు జంగమవర్యుడు

యోగీశ్వరా! కలడొక పుత్రుడు? వాడు యింటలేడు చదువుకొనుటకో, ఆడుకొనుటకో వెళ్ళినాడు. వాడు వచ్చువరకు ఆలస్యమగును. ఈలోపుగా భోజ్యపదార్థములు చల్లారిపోగలవు. తమరు భుజింపుడు వాడు తర్వాతవచ్చి ప్రసాద మారగించగలడు." అని ప్రార్థించాడు. మనస్సులలో దంపతులకు పుత్రుడు లేని కొరత కలవరపెట్టుచునేవుంది. ముఖములో విషాదరేఖాచ్ఛాయలు పొడసూపినవి.

తిరిగి జంగమదేవుడు ప్రారంభించాడు. "అదెట్లు" పుత్రుడెక్కడికి వెళ్లినా పిలిచిన రాకుండునా? నీ సాధ్వీరత్నమును నలువైపుల ఎలుగెత్తి పిలువుమనుము. బాలకుడు వచ్చెనా కలిసి భుజింతము, రానిచో మనమే భుజింతము. ప్రయత్నించి చూడమను" అని సూచించాడు. మనసు కలతచెందినను మాట తడబడకుండా తిరువెంగనాంచి చేతులు జాచి "నా ముద్దులకొడుకా! రావయ్యా! నాగారాలుపట్టీ! నా చిన్నిసిరాలా! రావయ్యా!" అని ఎలుగెత్తిపిల్చింది.

పరుగిడివచ్చి తల్లి కౌగిటిచేరాడు సిరియాలుడు, చిరుతొండడు సంతోషంతో నిండిన మనస్సుతో జంగమదేవరను ప్రసాద మారగించుడని పల్కు ఉద్దేశముతో వెనుతిరిగాడు.

ఇంకెక్కడి జంగమవృద్ధులు!...... వారెప్పుడో మాయమైనారు... వారిస్థానే ఆదిదంపతులగు గౌరీశంకరులు సాక్షాత్కరించారు! 

Statement about ownership and other particulars about newspaper (Saivamata Prakasika) to be published in the first issue every year after last day of February.

## FORM IV.
### ( See Rule 8 )

| | | | |
|---|---|---|---|
| 1. | Place of publication | ... | Sri Saivamahapeetham Officc, 1-B Padmarao Nagar, Secundrabad. |
| 2. | Periodicity of the publication. | ... | Monthly. |
| 3. | Printer's Name | ... | Sri Mudigonda Subrahmanya Sarma |
| | Nationality | ... | Indian. |
| | Address | ... | B-11-20 Jambag Raod, Hy-bad. |
| 4. | Publisher's Name | ... | Beepeta Chidambara Sastry. |
| | Nationality | ... | Indian. |
| | Address | ... | 1-B. Padmarao Nagar Sec-bad. |
| 5. | Editor's Name | ... | Kandukuri Veera Basavaraju. |
| | Nationality | ... | Indian |
| | Address | ... | 1-B. Padmarao Nagar Sec-bad. |
| 6. | Names and addresses of individuals who own the newspaper and partners or shareholders helding more than one percent of the total capital. | | Sri: Saivamaha peetham 1-B Padmarao Nagar, Secunderabad. |

I, Beepeta Chidambara Sastry, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date :- 2—6—1962.

Publisher Signature
(Sd.) Beepeta Chidambara Sastry.



శా. ఏ వేదంబు పఠించె లూత భుజగం బే శాస్త్రముల్ చూచె తా
నే విద్యాభ్యసనం బొనర్చె కరి, చెం చే మంత్ర మూహించె బో
ధావిర్భావ నిదానముల్ చదువులయ్యా కావు నీ పాద సం
సేవాసక్తియె కాని జంతుతతికిన్ శ్రీ కాళహస్తీశ్వరా!

# కాళహస్తి మహాత్మ్యం

## శ్రీ యువటూరి గౌరీనాథ్

శ్రీ కాళహస్తీశ్వరాలయం అతి ప్రాచీనమైన ఆలయం. ఆ ఆలయాన్ని ఎప్పుడు నిర్మించినది నిర్ధారణ చేసి చెప్పుటకు ఆధారాలు లేవు ఆ దేవాలయాన్ని గురించి మహాభారతంలో కూడా ప్రస్తావన వున్నది. అర్జునుడు తీర్థయాత్రలు చేసినప్పుడు కాళహస్తీశ్వరుణ్ణి కొలిచి కైలాసగిరి పైన భరద్వాజ మహర్షిని సందర్శించాడని ప్రతీతి.

సృష్టికర్త అయిన బ్రహ్మ, ఈశ్వరుడు ప్రసాదించిన ఆ విగ్రహాన్ని కైలాసం నుంచి తెచ్చి అక్కడ ప్రతిష్ఠించి కొలిచి తాను కోల్పోయిన మహాత్మ్యాన్ని సంపాదించుకున్నాడని ప్రతీతి. కాళహస్తి ఊరు ప్రక్కనున్న ఆ కొండకు కైలాసగిరి అని పేరు. ఆ కొండను కైలాసాన్నించి తెచ్చారని, అందుకని దానికి కైలాసగిరి అని పేరు వచ్చిందని ఒక సంప్రదాయం ఉన్నది.

బ్రహ్మ తపస్సు చేసినప్పుడు శివుడు ఆ విగ్రహంలో అవతరించినట్లు పార్వతి కూడా అనునిత్యం ఆ విగ్రహానికి పూజలు చేసినట్లు, దుర్గ కూడా ఆమె వెంట తోడుగా ఆ గుడికి వచ్చేదని తర్వాత ఆ కొండపైనే అవతరించినట్లు స్థల పురాణంలో వున్నది.

కుమారస్వామి కూడా కుమారస్వామి అనే గుట్టపైన వేంచేసియున్నట్లు ప్రతీతి.

కుమారస్వామి నారదునకు శ్రీరామచంద్రునకు ఆ గుట్టపైనే వేదాంత రహస్యాన్ని బోధించినట్లు స్కంద పురాణంలో ఉన్నది. అందువల్లనే ఆ గుట్టకు విద్యాపీఠం అని పేరు వచ్చినట్లు, ఆ గుట్టకు ఎదురుగా వున్న కొలనుకు నారద తీర్థమని పేరు వచ్చినట్లు పురాణ ప్రసిద్ధం.

ఆ విగ్రహంపైన సర్పాకారంగాను, మధ్యలో దంతావళం లాగున, క్రింద సాలీడు ఆకారంలోను వుంటుంది. అందువల్లనే ఆ దేవునికి శ్రీ కాళహస్తీశ్వరుడని పేరు వచ్చినట్లు చెప్పుదురు. (శ్రీ అనగా సాలీడు, కాళ అనగా సర్పము, హస్తి అనగా ఏనుగు).

ఆ విగ్రహం పంచభూతాత్మకమైన వాయులింగం అని ప్రసిద్ధి. గాలి కూడా చొర వీలు గాని గర్భగుడిలో దీపారాధన వెలిగిస్తే, ఆ దీపం చిందు లాడుతునే యుంటుంది.

కృతయుగంలో సాలీడు, సర్పము గజము ఆ విగ్రహానికి పూజలు చేసే వని స్థల పురాణ పాఠం. సాలీడు లింగంపైన గూడు అల్లి, ఎండ, వాన తగుల్కుండా కాపాడేదట. ఏనుగు నదిలోనుంచి తొండముతో నీళ్లు తెచ్చెడి దట సర్పము పూజ చేసెడిదట.

ఒక రోజున లింగముపైన బిల్వపత్రము, నీళ్లు వుండటం సర్పము చూచి, ఏనుగేఆ పని చేసివుంటుందని అనుమానించిందట. మరునాడు ఏనుగ నీళ్లు తెచ్చి నప్పుడు, సర్పము ఏనుగ తొండములో దూరి కూర్చున్నదట. ఏనుగకు ఆగ్రహం వచ్చి తొండముతో లింగమును బాదినదట. తొండములో దాచుకున్న సర్పము ఆఘాతానికి మరణించిందట. ఆ విసుర్లులో సాలీడుకుకూడా దెబ్బ తగిలి మరణించిందట. అటు తర్వాత ఆ ఏనుగుకూడా మరణించిందట. శివుడు ఆ ముగ్గురి భక్తికి మెచ్చి వారికి ముక్తి నిచ్చాడని ప్రసిద్ధి.

అక్కడి అమ్మవారి పేరు జ్ఞాన ప్రసూనాంబ. ఆమె తిరుపతి ప్రభువైన వెంకటేశ్వరుని తోబుట్టువని ప్రతీతి. భక్తులందరికి జ్ఞానోదయం కలిగిస్తుంది గనుక ఆమెకు జ్ఞానప్రసూనాంబ అని పేరు వచ్చింది. పరబ్రహ్మస్వరూప రహస్యాన్ని ఆమె ఇంద్రునకు బోధించింది. అందుకని ఆమెకు జ్ఞాన ప్రసూచి అనే పేరు వచ్చిందని మరొక సంప్రదాయం. ఈ కథ "కేనోపనిషత్"లో ఉన్నది.

కన్నప్ప అనే ఒక భక్తుడుండెడివాడు. ఆయన పూర్వ జన్మలో అర్జును డని ప్రసిద్ధి. శంకరాచార్యులు తన "శివానందలహరి"లో కన్నప్ప నైనార్‌ను గురించి స్తుతించారు.

కన్నప్ప ఆ ఆలయంలోనే ఉండేవాడట. ప్రతిరోజు అడవి జంతువులను వేటాడి వాటి మాంసము, దేవునికి నైవేద్యము పెట్టెడివాడట. ఒక రోజున ఆ విగ్రహం కళ్ళ వెంబటి నీళ్లు కారసాగినవట. ఎవరో ఆ దేవుణ్ణి నొప్పజేశారని కన్నప్ప శంకించాడు. వెంటనే తన కన్నొకదానికి ఊడపెరికి ఆ దేమునికి ఇచ్చాడు. కొంతకాలం తర్వాత ఆ విగ్రహం రెండవ కంటివెంట నీరు కార సాగింది, అంత కన్నప్ప, తన పాదమును ఆ కంటిపై గుర్తుగా ఉంచి తన రెండవ కన్ను కూడా పెరికి ఆ దేవునికి సమర్పించాడు.

ఆ భక్తుని నిష్ఠకుమెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమై, అతినికి ముక్తి ప్రసాదించాడు. నేటికీ ఆ విగ్రహాముముందు కన్నప్ప యోగముద్రలో కూర్చొని వున్న విగ్రహం వున్నది.

ఆ కొండప్రక్కగా స్వర్ణముఖి నది ప్రవహిస్తూవున్నది. అగస్త్యుడు ఆ నదిని మళ్ళించుకువచ్చాడని ప్రతీతి. దానికే ఉత్తరవాహిని అనే పేరుకూడా వున్నది. మిగతా నదులవలెగాక స్వర్ణముఖి ఉత్తరదిశగా ప్రవహిస్తున్నది. ఇంద్రుడు ఆ నదిలో స్నానమాడి గౌతమముని శాపప్రభావాన్ని ప్రక్షాళన చేసుకున్నాడని ప్రతీతి. ఆ నదిలో స్నానమాడుటవల్ల నక్కీరారుకు కుష్టువ్యాధి నయమైనదట.

ఈ స్థలంనుంచి గల పర్వతశ్రేణికి కైలాసగిరి అని పేరు. ఇక్కడికి కొద్దిదూరంలోనే ఒక జలపాతం వున్నది రమణీయమైన ఆ పరిసరాలలో సహస్రలింగం వున్నది. అక్కడినుంచి అరమైలు దూరంలో మార్కండేయ తీర్థమున్నది. ఆ ప్రవాహం ఏకాలము ఎండదు. ఆసమీపంలోనే. ఇంకెన్నో తీర్థాలున్నవి— మయూర తీర్థం, భరద్వాజ తీర్థం, శుక తీర్థం, మణికర్ణికా తీర్థం, తత్వప్రకాశ తీర్థం, మొదలైన వెన్నో వున్నవి.

చారిత్రక దృష్ట్యా యీ స్థలము కన్నప్పనాయనార్ కాలంనుంచి ప్రసిద్ధి కెక్కినది. మూడవ శతాబ్దంలో నక్కీరార్ కవి యీ స్థలాన్ని దక్షిణ కైలాసమని వర్ణించారు.

అప్పార్, సంబందార్, సుందరమూర్తి నయనార్ వంటి మహాపురుషులు యీ పుణ్యస్థలాన్ని సందర్శించి శ్రీ కాళహస్తీశ్వరుణ్ణి స్తోత్రం చేశారు. ఆదిశంకరుని తర్వాత పట్టనాథర్, శ్రీరామలింగస్వామి (వడలూరు) వంటి మహనీయులు యీ క్షేత్రాన్ని సందర్శించి శివస్తోత్రం చేశారు.

కాళహస్తి పర్వతందగ్గర ఆ దేవాలయాన్ని పల్లవరాజు తొండమాన్ చక్రవర్తి నిర్మించారు. తర్వాత చోళరాజులు ఆ ఆలయాన్ని పునరుద్ధరించారు.

రాజరాజనరేంద్రుని మనుమడు కులోత్తుంగచోళుడు పదకొండవ శతాబ్దంలో ఆలయ ముఖద్వారంపైన శిఖల గాలిగోపురాన్ని కట్టించారు పన్నెండవ శతాబ్దంలో శ్రీవీర నరసింహయాదవరాయ (నారాయణవనం) ప్రస్తుతమున్న ప్రాకారాన్ని కొండదగ్గరనుంచి దుర్గ పర్వతంవరకూ కట్ట కట్టించారు. అనంతరం విజయనగరం రాజులు కొన్ని మంటపాలను కట్టించారు.

100 స్తంభాల మంటపం, తూర్పు పడమర ద్వారాలపైన గాలిగోపురాలను 1516 లో కృష్ణదేవరాయలు కట్టించినట్లు శాసనాలలో పేర్కొన్నారు: 1529లో అచ్యుతదేవరాయలు కాళహస్తీశ్వరుని సన్నిధిలోనే పట్టాభిషేక మహోత్సవం జరుపుకున్నారట. ఆ దేవాలయానికి విజయనగరం ప్రభువులు 64 గ్రామాలు దానమిచ్చారు. ఆనాటినుంచి 1918 వరకూ కాళహస్తి జమీందారులు ఆ ఆలయ ధర్మకర్తలుగా వుండేవారు. ఆ దేవస్థానానికి అంటిపెట్టుకుని కాళహస్తిలో ఎన్నో దేవాలయాలున్నవి. ఆ దేవాలయాలలో ఉత్సవాలకు వేడుకలకు కాళహస్తి ఆలయ బొక్కసంనుంచే ఖర్చుచేసేవారు. అక్కడ పూజావిధానములు లీలావతి, కరనం, కామికం, అంగుమన్, నటులం అనే ఐదు ఆగమాలను ఆచరణలో వున్నవి. నవరాత్రులు మొదలైన ఉత్సవాలుగాక శివరాత్రికి బ్రహ్మోత్సవం జరుగుతుంది.

కాళహస్తికి సంవత్సర పొడుపునా యాత్రికులు వెళ్ళుతూనే వుంటారు. దేశం నలుమూలలనుంచి ఏటా సుమారు ఐదు లక్షల భక్తులు యీ దేవస్థానాన్ని సందర్శిస్తారు. అక్కడ వసతి సౌకర్యాలు లేనందున భక్తులు దేవదర్శనం చేసుకుని వెంటనే తిరిగి వెళ్ళుదురు.

అక్కడ లక్ష రూపాయలు ఖర్చుచేసి ఒక ధర్మశాలను నిర్మించుటకు తిరుమల దేవస్థానంవారు పూనుకున్నారు. 1959 సం॥లో ముఖ్యమంత్రి శ్రీ నీలం సంజీవరెడ్డి గారు ఆ భవనానికి శంకుస్థాపన చేశారు.

దేవస్థానంవారు లక్షరూపాయల ఖర్చుతో మరొక సత్రాన్ని నిర్మింప దలచారు. ఆ ఖరులో సగం ధనాన్ని ప్రజలవద్దనుంచి విరాళాలుగా వసూలు చేయ సంకల్పించారు. ఇదిగాక మైసూరు ప్రభుత్వం కూడా మరొక సత్రాన్ని నిర్మింప సంకల్పించారు.



# శైవమత ప్రకాశిక చందా వివరములు

| | |
|---|---|
| మహారాజ పోషకులు | రు॥ 116—00 |
| రాజ పోషకులు | 50—00 |
| ప్రధాన పోషకులు | 25—00 |
| పోషకులు | 10—00 |
| అభిమానులు | 5—00 |
| చందాదారులు | 3—00 |
| విడిపత్రిక | 0—25 |



## గమనిక

చందాదారుల సహకారంకోరుతూ చందాలు "శ్రీ శైవ మహాపీఠము 1-B పద్మారావు నగరు, సికింద్రాబాదు SD-25" చిరునామాకు పంపవలెనని మా విజ్ఞప్తి.

## రచయితలకు విజ్ఞప్తి

శైవ సిద్ధాంత ప్రాశస్త్యాన్ని వివరించే కథలు, గేయాలు, వ్యాసాలు పంపగోర్తాము.

—సంపాదకుడు